# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## జీ - 87
రచన: వసుంధర

## ఒకే దోపిడికి ఇద్దరు దొంగలు
రచన: సుంకరి రాంప్రసాద్

## అన్వేషణ
చన: వి. యస్. రావ్

## కిరాయి హంతకుడు
రచన: ఫణిబాబు

ఎడారి కోయిల — మొదటి భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—165
సెప్టెంబరు, 1987
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్ రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64848

ముద్రణ:
కాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీటు, మద్రాసు-1.

# జీ - 87

## వసుంధర

ఆతడు కుర్చీలో కూర్చున్నాడు.

ఆమె అతడి వంకే భయంగా చూస్తోంది.

అతడు జేబులోంచి సిగరెట్ తీసి నోట్లో పెట్టుకున్నాడు. తర్వాత లైటర్ తీసి-"ఇలా రా!" అన్నాడు.

ఆమె అతణ్ని సమీపించింది.

"సిగరెట్ వెలిగించు—" అన్నాడతడామెకు లైటరందిస్తూ.

ఆమె లైటరు వెలిగించింది. సిగరెట్ అంటించింది.

అతడు గట్టిగా ఓ దమ్ములాగి పొగ వదిలాడు.

ఆమె భయంగా అతడి వంకే చూస్తోంది.

అతడామె చేతిలోని లైటరునందుకున్నాడు. ఆమె చేయి వెనక్కి తీసుకోబోతూండగా చటుక్కున పట్టుకున్నాడు.

"వద్దు—" అందామె భయంగా.

"కదలకు—" అన్నాడతడు. గొంతులో క్రూరత్వ

మూంది.

ఆమె కదలలేదు.

అతడు సిగరెట్ తీసి ఆమె మణికట్టుమీద కాల్చాడు.

పంటి బిగువున బాధననుచుకుందామె.

"వెనక్కి తిరుగు—" అన్నాడతడు.

భయపడుతూనే వెనక్కి తిరిగిందామె.

పచ్చగా మెరుస్తున్న నున్నటి ఆమె చర్మాన్ని చూస్తున్నాడతడు. రవికకూ చీరకూ మధ్య అతడి దృష్టి తీక్షణంగా ప్రసరించబడింది.

అతడి చేతిలోని సిగరెట్టింకా ఆరిపోలేదు.

గగుర్పాటుతో ఆమె శరీరం సన్నగా వణుకుతోంది.

ఆమెకు తెలుసు—అతడేం చేసినా తను నోరు మెదప కూడదు. గొంతు పెగలనివ్వరాదు.

అతడు సిగరెట్‌ని వీపుదాకా తెచ్చినవాడే ఎందుకో ఆగిపోయాడు.

ఊహాకందని విధంగా ఆమెను బాధించడంలోనే అతడి కానందముంది. సిగరెట్‌తో తనామె వీపుమీద కాలుస్తాడని ఆమె అనుకుంటుంది. కాబట్టి....

అతడు శక్తినంతా క్రోడీకరించి వీపుమీద కుడి పిడికిలితో ఒక్క గుద్దు గుద్దాడు.

ఆమెకు కళ్ళు బైర్లు కమ్మాయి. అప్రయత్నంగా ముందుకు వెళ్ళి బోర్లాపడిపోయింది.

సరిగ్గా అక్కడే మంచముండడంవలన ఆమె మంచం మీద పడింది. మెత్తటి పరుపుల సౌఖ్యానుభూతి కూడా ఆమెకు కలగలేదు.

అతడి దెబ్బ ఆమెను కత్తిపోటులా బాధిస్తోంది.

ఈలోగా అతడు లేచి ఆమెను సమీపించి-"వెనక్కి

తిరుగు" అన్నాడు.

ఆమె వెంటనే వెల్లకిలా తిరిగింది.

"ఎవరు నువ్వు?" అన్నాడతడు.

"మీ దాసిని___"

"నేనెవరిని?"

"నా దేవుడు_"

"నీ గురించి ఇంకా చెప్పు___...."

"నేను నీచురాలిని. కులటను. పనికిమాలిన దాన్ని. మీ పాదాలు తాకే అర్హత కూడా లేనిదాన్ని...."

అతడు తృప్తిగా నవ్వి—"ఇప్పుడు లేచి నిలబడు-" అన్నాడు.

ఆమె లేచి నిలబడగానే అతడు మంచం మీద కూర్చుని—"అది తీసుకురా—" అంటూ గోడవైపు చూపించాడు.

గోడవైపు చూడకుండానే అదేమిటో ఆమె తెలుసుకుంది.

అక్కడ గోడకు వ్రేలాడుతోందొక కొరడా!

ఆ కొరడా దెబ్బకు మందపు జంతు చర్మంకూడా చిట్లుతుంది.

ఆమె చూడ్డానికెంతో సుకుమారంగా వుంది.

"ఊఁ త్వరగా—" అన్నాడతడు.

ఆమె వెళ్ళి కొరడా తెచ్చి అతడి కందించింది.

"మంచినీళ్ళు తీసుకురా—" అన్నాడతడు.

కొరడాతో కొట్టేముందతడు మంచినీళ్ళు తాగుతాడు.

మంచినీళ్ళు తాగి కొరడా ఎత్తాడంటే—అతడీరోజు గది నేలను రక్తంతో కడగనున్నాడని అర్థం.

ఆమె మాట్లాడకుండా లోపలకు వెళ్ళింది.

అదొక చిన్న గది. గదిలో పూజామందిరముంది.

ఆమె మందిరం ముందు నిలబడి రెండు చేతులూ జోడించి—"భగవంతుడా-నేను తప్పుచేస్తున్నానేమో తెలియదు. అందుకే నీ ఆశీర్వాదాన్ని కోరుతున్నాను. నేను చేసేదానిలో తప్పుంటే అదంతా నీదే తప్పు నాది కాదు—" అంది.

పూజామందిరంలో ప్రముఖులైన దేవుళ్ళ విగ్రహాలు చాలా ఉన్నాయి. ఆ విగ్రహాల ముందో చిన్న సీసా ఉంది.

ఆమె వంగి ఆ సీసా అందుకుంది.

అప్పుడామె మళ్ళీ వణికింది.

ఆ సీసాలో ఉన్నది విషమని ఆమెకు తెలుసు.

"భగవంతుడా! రెండురోజులక్రితం ఇది నీముందుంచాను. నేను చేసే పని తప్పని నువ్వనుకుంటే ఈ విషాన్ని విరిచి మామూలుగా తయారుచేయమన్నాను. విషం విషంలా పనిచేయకపోతే తప్పు నాది. లేకుంటే తప్పు నీది—" అని మరోసారి మనసులో అనుకుని పక్కనే ఉన్న బిందెలోంచి ఓ గ్లాసు నీళ్ళు ముంచింది. సీసాలోని విషం సగానికి సగం ఆ గ్లాసులో వంపింది.

"త్వరగా రా—" కర్కశమైన అతడి గొంతు పడకగదినుంచి అక్కడిదాకా మార్మోగింది.

"వస్తున్నా!" బదులిచ్చిందామె.

విషం సీసాను తిరిగి పూజామందిరంలో ఉంచి ఆమె వెంటనే చకచక పడకగదిలోకి వెళ్ళింది.

"ఏమిటింత ఆలస్యం?" అన్నాడతడు.

అతడి చేతిలో కొరడాను చూసిందామె. అదామెకు మృత్యుతుల్యం.

అప్పుడామె తన చేతిలోని గ్లాసు వంక చూస్తుంది.

అదతడికి మృత్యువు....

"నవ్వుతూ నా దగ్గరకు రా—" అన్నాడతడు.

ఆమెకు నిజంగానే నవ్వొచ్చింది. చేతిలో గ్లాసుతో అతణ్ని సమీపించింది.

అతడు ఎడంచేత్తో ఆమె చేతిలోని గ్లాసందుకున్నాడు.

కుడిచేతిలో కొరడా అలా ఉండగానే గటగటా నీళ్ళు తాగేశాడు.

"వెనక్కి వెళ్ళు—" అన్నాడతడు.

ఆమె వెనక్కి వెడుతూంటే కొరడా చెళ్ళున విసురుతాడతడు.

అదామెకు తెలుసు.

ఇప్పుడూ అదే జరుగుతుందా?

ఆమె అతడి వంకే చూస్తూ వెనకడుగు వేసింది.

అతడు లేచి నిలబడి కొరడా ఝుళిపించాడు.

ఆమె అతణ్నే చూస్తూ వెనకడుగు వేస్తోంది.

అతడు కొరడాను పైకెత్తాడు.

ఆమె శరీరంలో వణుకు.

ఇప్పుడేం జరుగుతుంది?

గదిలో నేలంతా తన రక్తంతో తడిసిపోతుందా?

దైవమతడికేమీ చేయదా?

తప్పంతా తనదేనా?

అతడు వికటంగా నవ్వాడు.

ఆమె మరో అడుగు వెనక్కి వేసింది.

అతడు కొరడా విసరబోయి వెనక్కి పడ్డాడు.
బ్యాలన్సు కాసుకోలేక పోయాడేమో—వెల్లకిలాపడ్డాడు.

అతడు మంచంమీద పడ్డానికి ముందే అతడిచేతిలోని కొరడా నేలమీద పడింది.

ఆమె మరో అడుగు వెనక్కి వేసింది.

జరుగుతున్నది కలో, నిజమో నని ఆమె కనుమానంగా ఉంది.

అతడు పడవాడు పడ్డట్టే వున్నాడు. గిలగిల తన్నుకోవడంలేదు. కేకలు పెట్టడంలేదు.

దగ్గరకు వెడితే కొత్తరకంగా వేధిస్తాడేమోనని ఆమె భయం.

కాసేపాగిందామె.

ధైర్యం చిక్కబట్టుకు నేందుకామెకు కొన్ని క్షణాలు పట్టింది.

అతడు కదలకుండా మెదలకుండా అలాగే పడి ఉన్నాడు.

ఆమె నెమ్మదిగా కొత్త పెళ్ళికూతురిలా అడుగులో అడుగు వేసుకుంటూ అతణ్ని సమీపించింది.

మెత్తటి ఆమె పాదాల సవ్వడి అతడిలో చలనం తీసుకురాలేదు.

ఆమె మంచంవద్ద ఒక్క క్షణం తటపటాయించి నెమ్మదిగా అతడి వంక పరీక్షగా చూసి ఉలిక్కిపడింది.

అప్పుడే అతడి శరీరం నీలంగా మారింది.

"విషం అంత బలమైనదా?" అనుకుందామె.

అతడు చనిపోయాడంటే ఆమెకింకా నమ్మకం కలిగినట్లులేదు. మరో క్షణం తటపటాయించి ఆమె అతణ్ని తాకింది.

అతడు కదలలేదు కానీ శరీరం స్పర్శకు కొత్తరకంగా ఉంది. మనిషికి శవానికీ తేడా అదేనేమో!

9

ఆమె మరింత ధైర్యంతో అతడి చేయి పట్టుకుని చూసింది.

నాడి అందడంలేదు.

ఆమెకు ధైర్యం పెరిగింది.

పరీక్షించి అతడికి శ్వాస ఆడడంలేదనీ, గుండె కొట్టుకోవడంలేదనీ ధృవపర్చుకుందామె.

అంటే అతడు చనిపోయాడన్నమాట!

తనతో దుర్మార్గుడి పీడ శాశ్వతంగా వదిలిపోయింది!

"ఇప్పుడేం జరుగుతుంది?" అందామె మనసు.

"అన్నింటికీ ఆపద్బాంధవుడిలా ఆ చక్రధారే ఉన్నాడు—" అనుకుందామె.

సరిగ్గా అప్పుడే ఎవరో వీధితలుపు తట్టారు.

ఆమెకు వచ్చిందెవరో తెలుసు.

"అంతా అనుకున్నట్లే జరుగుతోంది!" అనుకుంటూ ఆమె ఆక్కణ్నించి వీధి గుమ్మంవైపు పరుగెత్తింది.

## 2

అతడు డబుల్ కాట్ పై వెల్లకిలా పడుకుని వున్నాడు.

ఆమె అతడిపక్కనే బోర్లా పడుకుని వుంది.

అతడింటి కప్పును చూస్తూంటే ఆమె అతడి ముఖాన్ని చూస్తోంది.

"నీ జీవితంలో నా వాటా ఏమిటి చక్రీ?" అందామె.

అతడు చూపుల్నింటి కప్పునించి మరల్చకుండానే—

"ప్రస్తుతానికి ప్రియురాలివి, మున్ముందు భార్యవు—" అన్నాడు.

"ప్రస్తుతం గురించి బాగానే చెప్పావు. భవిష్యత్తు విషయం నేను నమ్మను—" అందామె.

"ఎలా నమ్మతావు? నాకు తెలిసినట్లు నీకు భవిష్యత్తు తెలియదుగా—....” అన్నాడతడు.

"నాకు భవిష్యత్తు తెలుసు. అందులో నీ భార్య పేరు నందిని—” అందామె.

అతడులిక్కిపడి- "నందిని గురించి నీకెలా తెలుసు?" అన్నాడు.

"నా దగ్గరే రహస్యాలూ లేవంటూనే నందిని గురించి దాచావు. నా భవిష్యత్తు గురించి నేను తెలుసుకున్నది నిజం-” అందామె.

"చంద్రికా—ఈ చక్రాధారి గురించి నీకు తెలిసింది చాలా తక్కువ. ముందు నాకు నందిని గురించి నీకెవరు చెప్పారో చెప్పు. అప్పుడసలు విషయం చెబుతాను—” అన్నాడతడు.

"నాకెవరూ చెప్పలేదు. స్వయంగా మీ యిద్దర్నీ చూశాను. మీ సంభాషణకూడా విన్నాను....” అంది చంద్రిక.

"ఎప్పుడు?"

"మనసుంటే మార్గముంటుంది. అనుమానించిన మనసుకైతే ఎన్నెన్నో మార్గాలు....”

"ఈ ఇంట్లో నీ రాకపోకలకెలాంటి అంతరాయాలూ లేవు. అది నేను నీకిచ్చిన చనువు. దాన్ని సద్వినియోగం చేసుకున్నావన్నమాట....ఇంతకీ మా సంభాషణలో ఏం విన్నావు?"

"మీ రిద్దరూ ఒకరికొకరు పెళ్లిచేసుకోవాలనుకుంటున్నారు. అందుకామె భర్త అడ్డు. నువ్వామెకు విషమిచ్చావు—భర్తమీద ప్రయోగించడానికి. నీకోసం భర్తకు విషమివ్వడానికి సిద్ధపడ్డ ఆడది నిన్నెంతగా

ప్రేమించిందో నేనూహించగలను...." అంది చంద్రిక.

"ఓహ్—అయితే మూడురోజుల క్రితం మా సంభాషణ విన్నావన్నమాట...." అని చక్రధారి నిట్టూర్చి—"అయితే నువ్వు అసలు నిజం కూడా తెలుసుకోవాల్సి ఉంది—" అన్నాడు.

"ఏమిటా అసలు నిజం?"

"నందిని నన్ను పెళ్ళి చేసుకోవాలనుకుంటోంది. కానీ అందుక్కారణం ప్రేమ కాదు. అవసరం—...."

"ఏమిటా అవసరం—కండకావరమా?" అంది చంద్రిక వెటకారంగా.

"కాదు. ఆమె బుద్ధిగా కాపురం చేసుకోవాలనే అనుకుంటోంది. కానీ ఆమె భర్త శాడిస్టు ఆమెను శారీరకంగా హింసించి తృప్తి చెందేవాడు. శారీరక బాధనామె తట్టుకోలేకపోతోంది— "

"నేను నమ్మను...."

"ఒక్కసారి నందిని శరీరం చూశావంటే నీకర్థమవుతుంది—ఆమె ఎన్ని గాయాలకు గురయిందో?"

"నువ్వు చూశావా?"

"చూశాను...."

"హుఁ" అంది చంద్రిక కోపంగా.

"చంద్రికా—అసూయకు జాలి జతపర్చి నందిని నర్థం చేసుకో—అప్పుడు నీలో అసూయ మాయమై నందినిపట్ల జాలిమాత్రమే మిగులుతుంది—" అన్నాడు చక్రధారి.

"నీ విషయంలో అదే విశేషమింకా ముందుకు జరిగి ఆ జాలి ప్రేమగా మారి పెళ్ళికి దారితీస్తోంది. కథేమైతే నాకెందుకు? భవిష్యత్తులో మనమిద్దరం భార్యాభర్తలం కావడంలేదు. అంతే కదా!" అంది చంద్రిక.

"కాదు, చంద్రికా! నేను నందినిని మోసగిస్తున్నాను" అన్నాడు చక్రధారి గంభీరంగా.

"ఎలా?"

"నందిని భర్త గోవర్ధన్ అబ్కాధికారి సోమేశ్వరరావు ముగ్గురి కొడుకుల్లో ఆఖరువాడు. అతడికి చిన్నతనంలోనే తల్లిపోవడంవల్ల గారంగా పెరిగాడు. ఆ గారాబం దురలవాట్లకు దారితీసింది. గోవర్ధన్‌కి తిన్నగా చదువు రాలేదు చెడు సావాసాలు పట్టాడు. తండ్రి దీనికెంతో కలవరపడి కొడుకును మార్చాలని ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఒక్కటీ ఫలించలేదు. చివరికాయన విసిగిపోయి కొడుకునింట్లోంచి పొమ్మన్నాడు. పౌరుషంకొద్దీ ఇల్లొదిలి పెట్టినా త్వరలోనే తానెందుకూ కొరగానివాడినని గ్రహించి తప్పు క్షమించమంటూ యింటికి తిరిగొచ్చాడు గోవర్ధన్.

తండ్రి అతణ్ని వెంటనే నమ్మలేదు. తను చెప్పినట్టు పెళ్ళిచేసుకుని ఆమెతో బుద్ధిగా కాపురం చేస్తూంటే— భార్యద్వారా అతడిక్కావలసిన డబ్బిస్తానని చెప్పాడాయన. గోవర్ధన్ ఈ షరతు కంగీకరించాడు. తండ్రి అతడికి పేదింటి పిల్లయిన నందినితో వివాహం జరిపించి అతణ్ని బాగుచేసే బాధ్యత ఆమెకప్పగించాడు.

"నందినికి సవతితల్లి. ఇంట్లో బాధలు పడలేకపోతోంది. ఐశ్వర్యవంతుడి కోడలు కావడం తన అదృష్టంగా ఆమె భావించింది. మామగారి అభీష్టం మేరకామె భర్తకు మంచి బుద్ధులు నేర్పాలనుకుంది. కానీ గోవర్ధన్ ఈ విషయంలో చాలా తెలివిగా వ్యవహరించి ఇట్టే నందిని నాడి పట్టేశాడు. ఆమెద్వారా తండ్రివద్ద నుంచి డబ్బు వసూలు చేసుకుంటున్నాడు. ఆమె అసహా

యతను కనిపెట్టి క్రూరంగా హింసించసాగాడు. ఆ విధంగా తండ్రిమీద కోపాన్నతడు భార్యమీద తీర్చు కుంటున్నాడు.

"నందిని భర్తను విడిచిపెడితే సవతితల్లి పాలబడాలి. నందిని భర్తను మార్చలేకుంటే గోవర్ధన్ తండ్రికూడా ఆమె నాదరించదు. ఇలాంటి పరిస్థితుల్లో గోవర్ధన్ తనే స్వయంగా నందినికీ, నాకూ పరిచయమయ్యే పరిస్థితులు కల్పించి తనేమీ ఎరుగనట్లు నటించసాగాడు—"

చక్రధారి ఊపిరి పీల్చుకుందుకన్నట్లు ఆగి సేపాగాడు.

"చాలా విచిత్రంగా వుంది కథ! ఇందులో గోవర్ధన్ ఆశించే ప్రయోజనమేమిటి?" అంది చంద్రిక.

"నీ ఊహ కందని పథకమిది. గోవర్ధన్ బాధలు భరించలేని నందినికి నేను ఎడారిలో ఒయాసిస్‌లా కన బడ్డాను. ఆమెను పెళ్ళికాశపెట్టాను నేను. అతణ్ని చంప డానికామె సిద్ధపడింది. హత్యానేరం ఆమెపైకి రాకుండా కాపాడతానని మాటిచ్చాను నేను. ఆమె నమ్మింది..." అన్నాడు చక్రధారి.

"ఇప్పుడేమవుతుంది?"

"విషమని చెప్పి నేనో మందిచ్చానామెకు. దానామె భర్తపై ప్రయోగిస్తుంది. అది తిన్న వెంటనే ఆమె భర్తలో చలనం వుండదు. శరీరం నీలం రంగులోకి మారు తుంది. అయితే అతడు నిజంగా చనిపోడు. ఆ పరిస్థితి రెండుగంటలసేపుంటుంది. తర్వాత అతడు మామూలు మనిషవుతాడు. ఆమె తను హత్యచేశాననుకుంటుంది. నేనామెను రక్షించానన్న భ్రమలో వుంచుతాను...."

"ఇందువల్ల లాభమేమిటి?"

"భర్త బ్రతికే వున్నాడని ఆమెకు తెలియదు. బ్లాక్

మెయిలరొకడామె నీ విషయమై వేధిస్తూంటాడు. రహస్యం దాచడానికి మామగారినామె డబ్బడుగుతుంది. మామగారామెకు కొంతకాలం మాత్రం డబ్బిస్తాడు. తర్వాత అనుమానించడం మొదలుపెడతాడు. డబ్బిచ్చినంతకాలం—నేను, గోవర్ధన్ వాటాలేసుకుని అనుభవిస్తాం. తర్వాత ఆమెనింట్లోంచి గెంటేస్తాడు. భర్త పోయాడనుకుని నాతో గడపడానికి సిద్ధపడ్డ నందిని ఒకరోజున రెడ్ హేండెడ్ గా ఆయనకు పట్టుబడే ఏర్పాటు గోవర్ధన్ చేస్తాడు. అప్పుడామెకి ఏ ఆధారమూ ఉండదు. నేనామెను మంచిమాటలతో వంచించి-సైట్ స్టార్ హోటల్ కమ్మేస్తాను. రెండు లక్షలువస్తాయి...."

"నీ ప్లాను భయంకరంగా ఉంది—" అంది చంద్రిక భయంగా.

"నేను భయంకరమైన వ్యక్తిని. కానీ నీకెందుకు భయం? ప్రస్తుతానికి నీవు నా ప్రియురాలివి. భవిష్యత్తులో నా భార్యవు...." అన్నాడు చక్రధారి.

"ఇలాంటి మాటలే నువ్వు నందినిక్కూడా చెబుతూండవచ్చు—" అంది చంద్రిక.

"నువ్వు నన్ననుమానిస్తున్నావా?"

"ఊఁ."

చక్రధారి ఏదో అనబోయాడు. అంతలో నే మంచం పక్క ఫోన్ మ్రోగింది. అతడు చేయిచాచి ఫోనందుకుని "హలో!" అన్నాడు.

"నేను సార్.....చంచలావుని.... ...." అందవతలి గొంతు.

"వ్వాట్ చంచల్....ఏమిటి విశేషం?"

"కొంప మునిగింది సార్...."

"ఏమయింది?"

"గోవర్ధన్ చచ్చిపోయాడు...."

చక్రధారి నవ్వి—"అంటే నందిని అతడికి విషం పెట్టిందన్నమాట...." అన్నాడు.

"అవును సార్...."

"రెండు గంటలయిందా అతడు పోయి..."

"నేను సరైన సమయానికే ఆమె ఇంటికి వెళ్ళి శవాన్ని ముందుగా సిద్ధంచేసి వున్న పెట్టెలోకి మార్చి మా యింటికి తీసుకొచ్చాను సార్....అతడు విషం తిని ఇప్పటికి మూడుగంటలు కావచ్చు...."

"గోవర్ధన్ మామూలు మనిషయ్యాడా లేదా?"

"అతడు నిజంగా చనిపోయాడు సార్...."

"వాట్...."

"అతడు నిజంగా చనిపోయాడు సార్...."

చక్రధారి ఏదో అనబోయి—"మన డాక్టరున్నాడా అక్కడ...." అన్నాడు.

"గంగాధరం గారేనా? అతడి చావు గురించి ఆయనే ధృవపరిచారు సార్"

"చావుకారణమేమిటి?" అన్నాడు చక్రధారి.

"విషప్రయోగంట...."

"అంటే ఆయనిచ్చింది నిజం విషమా?"

"కాదంటున్నారు సార్...."

"మరి విషమెక్కడిది?"

"మాకు తెలియకే కదా సార్.... నేను మీకు ఫోన్ చేశాను."

"సరే—నేను వస్తున్నాను...." అంటూ చక్రధారి ఫోన్ పెట్టేశాడు.

ఆ సంభాషణంతా తనూ విన్న చంద్రిక—"నందిని నువ్వనుకున్న కంటే చాలా తెలివైనది. ఇప్పుడామె వలలో నువ్వు చిక్కుకున్నావు...." అంది.

చక్రధారి కోపంగా—"హుం" అన్నాడు.

# 3

చక్రధారి చంచలావింటికి వెళ్ళగానే చంద్రిక నందిని యింటికి వెళ్ళింది.

"నువ్వెవరో నాకు తెలియదు—...." అంది నందిని ఆశ్చర్యంగా.

"భవిష్యత్తులో చక్రధారి భార్యను. నా పేరు చంద్రిక. నేనెవరో నీకు తెలియకపోయినా నువ్వెవరో నాకు తెలుసు" అంది చంద్రిక.

"నేనెవరో నీకెలా తెలుసు?" అంది నందిని.

చంద్రిక నందిని గురించి చక్రధారిద్వారా తను విన్న కథంతా చెప్పిందామెకు.

"చాలా చిత్రంగా వుంది. చక్రధారి మావారికి స్నేహితుడా?" అంది నందిని.

"అవును. సాటి ఆడదానిగా నీకు సాయపడాలని వచ్చాను. నీకు అడుగడుగునా కష్టాలే! సవతితల్లి బారి నుంచి తప్పించుకుంటే బాధించే మొగుడు. అక్కణ్ణించి తప్పించుకుంటే మోసగించే ప్రియుడు. ఈ సమయంలో నిన్ను హెచ్చరించడం మంచిదనిపించింది...."

"అయితే నా భర్త నిజంగా చావలేదంటావా?"

"లేదు. అతడిప్పుడు చంచలావింట్లో పార్టీ చేసుకుంటూంటాడు."

చంద్రిక కావాలనే నందినికబద్ధం చెప్పింది.

ఆమెకు నందినికి సాయపడాలన్న ఉద్దేశ్యం లేదు.

గోవర్ధన్ నిజంగా చనిపోయుంటే ఆ హత్యానేరం నందినిపైకే వెళ్ళాలి. చక్రధారి తప్పించుకోవాలి.

"నీ సహాయానికి చాలా చాలా థాంక్స్...." అంది నందిని.

"కాసేపట్లో చక్రధారి ఇటు రావచ్చు. నేను సెలవు తీసుకుంటాను. అతడికి నేను చెప్పినట్లేమీ చెప్పకు_" అంది చంద్రిక.

ఆమె వెళ్ళిపోయాక నందిని ఆలోచనలో పడింది.

తాననుకున్నదొకటి___జరిగినదొకటి!

చక్రధారి మంచివాడనీ తన్ను నిజంగా ప్రేమిస్తున్నాడనీ అనుకుంది.

అతడు తన్ను మోసగించి నైట్ స్టార్ హోటల్లో చేర్చాలనుకున్నాడు. అతడి ఆశయం నెరవేరకూడదు'

ముందుగా గోవర్ధన్ చేస్తున్న కుట్ర గురించి మామగారికి చెప్పుకోవాలి. భర్తలో మార్పుతీసుకునిరావడం కోసం ఆమె అతడు పెట్టే క్రూర హింసల గురించి మామగారికి చెప్పలేదు.

ఇప్పుడిక జాప్యం చేయకూడదు.

ఆమె క్షణాలమీద చీర మార్చుకుని మామగారింటికి బయల్దేరింది.

## 4

విశాలమైన గది.

గదిలో నేలపై ఖరీదైన కాశ్మీర్ కంబళి పరచి వుంది.

గది మధ్యగా నేలమీద పట్టుపరుపు. పట్టుపరుపు మీద కూర్చున్నాడు సోమేశ్వరరావు. అతడి చేతిలో అందమైన గ్లాసుంది. అతడి ఒంటిమీద అండర్ వేర్

మినహాయించి మరే గుడ్డలూ లేవు.

పట్టుపరుపులమీద అతడి చుట్టూ నలుగురు యువతులు నిలబడి ఉన్నారు. వారి ఒంటిమీద అండర్ వేర్ కూడా లేదు. వారి నలుగురి చేతుల్లో షాంపేన్ బాటిల్సున్నాయి.

ఆ నగ్న యువతులతడికి మధువును పట్టిస్తూ కవ్విస్తున్నారు.

అతడు వారితో ఆటలాడుతున్నాడు.

గదిలో స్టీరియో సంగీతం మ్రోగుతోంది.

సోమేశ్వరరావు రసవత్తర ఘట్టంలో ఉన్నాడు. అతడు మధువునందించే యువతులనందుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. వారతడికందీ అందకుండా పోతున్నారు.

చివరికతడో యువతిని చేయిపట్టుకుని బలంగా మీదకు లాక్కున్నాడు. ఆమె చేతిలోని షాంపేన్ బాటిలు విసురుగా జారిపోయి కాశ్మీర్ కంబళి పైపడి దొర్లుకుంటూ గోడవారగా వెళ్ళింది.

సోమేశ్వరరావు తన చేతిలోని గాజుసీసాను పక్కన పెట్టి ఆమెను బలంగా హత్తుకున్నాడు.

"షాంపేన్ సీసా తెస్తాను...." అందా యువతి కమ్మనిగా.

"నా మధువిక్కడుంది—" అంటూ అతడామె పెదవులను తన పెదవులతో స్పృశించాడు.

సరిగ్గా అప్పుడే పట్టుపరుపుమీద ఫోనొకటి మ్రోగింది.

ఓ యువతి రిసీవరెత్తి—"హలో!" అంది.

"అర్జంట్ కాల్ " అందవరిలో గొంతు.

"ఎవరు?" అన్నాడు సోమేశ్వరరావు విసుగ్గా.

"సార్—అర్జంటు కాల్ ట...." అందా యువతి.

రెండో చేత్తో రిసీవరందుకున్నాడు సోమేశ్వరరావు. మరో చేయి ఆ యువతినింకా బలంగా హత్తుకునే ఉంది.

“ఎవరు?” అన్నాడు సోమేశ్వరరావు.

“నేను—నందినిని మామయ్యా—” ఆందోళనతలి గొంతు.

“నందిని అంటే?”

“మీ కోడల్ని మామయ్యా—”

సోమేశ్వరరావు తనంతవరకూ బలంగా హత్తుకున్న యువతిని చటుక్కున వదిలిపెట్టాడు. అప్రయత్నంగానే లేచికూర్చుని— “అర్జంట్ కాల్ చేసేటంత అవసరమేమొచ్చింది నీకు?” అన్నాడు.

“ఫోన్‌లో చెప్పనా? ఇంటికొస్తారా?” అంది నందిని.

“మీ అత్తయ్యిల్లోనే ఉందా?” అన్నాడు సోమేశ్వరరావు

“ఉంది. అత్తయ్యే నాకీనంబరు చెప్పింది—”

“అత్తయ్యకు నువ్వు కబురు చెప్పావా?”

“లేదు. ముందుగా మీకే చెప్పాలనుకుంటున్నాను.”

అర్జంటు కాలంటే విషయం చాలా ముఖ్యమైనదే అవుతుంది. అందులోనూ అత్తగారు కోడలికి నంబరిచ్చిందంటే విషయమూ మెకూ యింతో కొంత తెలిసుండాలి.

“నేను వస్తున్నాను....” అంటూ సోమేశ్వరరావు లేచి నిలబడ్డాడు.

ఓ యువతి ఆతణ్ణించి రిసీవరందుకుని క్రెడిల్ చేసింది. మరో యిద్దరు యువతులతనికి బట్టలు తొడిగారు.

“మళ్ళీ వస్తాను....” అంటూ అతడా గదిలోంచి

లై టపడ్డాడు.

అతిడి వెనుకే ఆ యువతులు తలుపులు మూసు కున్నారు.

సోమేశ్వరరావు అక్కణ్నించి తిన్నగా ఓ గదిలోకి వెళ్లాడు.

అదో క చిన్న గది. నీటుగా అలంకరింపబడి వుంది.

గది మధ్యన నాలుగు మెత్తలున్న కుర్చీలున్నాయి.

సోమేశ్వరరావలాంటి కుర్చీల్లో ఒకదానిలో కూర్చు న్నాడు.

కొద్దిక్షణాల్లో నందిని ఆ గదిలోనికి ప్రవేశించింది.

సోమేశ్వరరావా మెవైపు చూశాడు.

నందిని మామగారికి నమస్కారం పెట్టింది.

"అలా కూర్చో—" అన్నాడు సోమేశ్వరరావు.

"నిలబడే మాట్లాడతాను—" అంది నందిని.

"అసలేం జరిగింది?"

"మొత్తమంతా చెప్పేస్తాను మామయ్యా! ఆతర్వాత మీరు నన్ను చచ్చిపొమ్మంటే చచ్చిపోతాను...." అంది నందిని.

"చెప్పు...." అన్నాడు సోమేశ్వరరావు.

నందిని చెప్పడం ప్రారంభించింది.

ఆమె చెబుతూంటే సోమేశ్వరరావాశ్చర్యంగా విన్నాడు.

నందిని చెప్పడం పూర్తయింది.

"నువ్వు నిజమే చెబుతున్నావు కదూ!" అన్నాడు సోమేశ్వరరావు.

"నేను మీకబద్ధం చెప్పలేదు—" అంది నందిని.

"మావాడు నిన్ను క్రూరంగా హింసించాడంటే

నమ్మలేను. సాక్ష్యాలున్నాయా?" అన్నాడు సోమేశ్వర రావు.

"సాక్ష్యాలున్నాయి. కానీ అవి చూపించాలంటే సిగ్గు విడిచి పెట్టాలి...."

"నేను నీకు మామగార్ని. నా దగ్గర సిగ్గు వదలి పెట్టడం తప్పుకాదు...." అన్నాడు సోమేశ్వరరావు గంభీరంగా.

నందిని సోమేశ్వరరావు కళ్ళలోకే సూటిగా చూసింది. ఓక్షణం తటపటాయించినా—చివరకామె తన శరీరం మీద వివిధ ప్రాంతాల—కాలిన మచ్చల్ని—ఇరవై రెండింటిని చూపించింది.

సోమేశ్వరరావు కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"నందినీ—నువ్వు నా కొడుకు భార్యవు. అంటే నాకు కూతురితో సమానం. కానీ నా ప్రవర్తన అంత మంచిదికాదు. కొన్ని సంవత్సరాలుగా నా భార్య నాకు సంసార సుఖాన్నివ్వలేకపోతోంది. నన్ను విచ్చలవిడిగా ప్రవర్తించమని తనే అనుమతించింది. నేనా అవకాశాన్ని యథేచ్ఛగా వినియోగించుకుంటున్నాను. ఆడదాని శరీరం నాకాటవస్తువు. ఆడది నా విలాసాలకోసం ఆడే బొమ్మ. ఇలాంటి భావాలు కలిగిన నాకే నీ శరీరాన్ని చూస్తూంటే గుండె నీరై కనులనుండి ధారగా ప్రవహిస్తూన్నట్టోంది. జరిగిందానికి నువ్వు భయపడకు. నా కన్న కొడుకు నీ కంటే ఎక్కువకాదు. నన్ను నమ్మి నీ బాధలు చెప్పుకున్న నువ్విప్పుడు నా కోడలివి కాదు. కూతురివి. నా కొడుకు జీవితాన్ని బాగుచేయాలనుకుని నీ బ్రతుకు బండలు చేశాను. ఇప్పుడు నా కొడుకు చచ్చినా నాకు బాధ లేదు. నీ బ్రతుకు బండలు కాకుండా చూస్తాను. కానీ...."

అని ఆగాడతడు.

నందిని అనుమానంగా అతడివంక చూసింది.

"చక్రధారికీ నీకూ యేమైనా సంబంధముందా?" సూటిగా అడిగాడు సోమేశ్వరరావు.

"మీ అబ్బాయి పెట్టే బాధలు భరించలేక చక్రధారితో వెళ్ళిపోవాలని అనుకున్నాను. కానీ ఇంతవరకూ మా ఇద్దరికీ యిలాంటి సంబంధమూ లేదు—" అంది నందిని.

"నీ మాటలు నేను నమ్ముతాను. ఇంతవరకూ జరిగినదంతా మరిచిపో—ఇకముందు జరిగేదంతా నీ మంచికోసమేనని నేను హామీ యిస్తున్నాను—వెళ్ళు—" అన్నాడు సోమేశ్వరరావు.

నందిని చటుక్కున వంగి ఆయన పాదాలకు నమస్కరించింది.

# 5

చక్రధారి, చంచల్రావు, డాక్టర్ గంగాధరం—ఒక పక్కగా కూర్చుని ఉన్నారు.

వారికెదురుగా ఉంది గోవర్ధన్ శవం!

శవానికావలిపక్క కూర్చున్నాడు సోమేశ్వరరావు.

అతడి కళ్లలో తడిలేదు. చూపుల్లో బాధలేదు.

ఊహించని అతడి రాకకు మాత్రం తబ్బిబ్బవుతున్నారు చక్రధారి బృందం.

"ఇది హత్య ..." అన్నాడు సోమేశ్వరరావు.

"నిజమే—కానీ ఈ హత్య చేసింది మేము కాదు" అన్నాడు చక్రధారి.

"ఎవరు చేశారు?"

"అవకాశం నందినికే వుంది.." అన్నాడు చక్రధారి.

"నందిని హత్య చేయాలనుకోలేదు. ఆమెను నువ్వే ప్రోత్సహించావు...."

"నేనూ హత్య చేయాలనుకోలేదు. అందుకు మీ అబ్బాయే నన్ను ప్రోత్సహించాడు...." అన్నాడు చక్రధారి.

"మీ అబ్బాయికూడా చావాలనుకోలేదు. అందుకే కదా నేను మోసపు మందు సృష్టించాను, అలాంటి మందు నింతవరకూ యెవరూ కనిపెట్టలేదు. గూఢచారులకూ, నేరస్థులకూ యెంతో ప్రయోజనకారికాగల ఈ మందుకు నేను—'జీ 87' అని పేరు పెడదామనుకుంటున్నాను. జీ స్టాండ్స్ ఫర్ గంగాధరం...." అన్నాడు డాక్టర్ గంగాధరం.

"విషం మీరిస్తే కదా—నందినికి దొరికింది...." అన్నాడు పరమేశ్వరరావు.

"కాదు. కానీ ఆమెకు మా పథకం గురించి ముందుగానే తెలిసిపోయింది. ఈ అవకాశాన్ని తీసుకుని గోవర్ధన్ ని హత్య చేయాలనుకుంది. ఎక్కణ్నించో నిజం విషాన్ని సంపాదించి అతడికిచ్చింది."

"మీరిచ్చింది నిజం విషంకాదని ఆమెకు ముందుగానే తెలుసంటారా?" గంభీరంగా అడిగాడు పరమేశ్వరరావు.

"నేనే ఆమెకు ముందుజాగ్రత్త కోసం చెప్పాను. ఈ విషయం నూటికి తొంభైతొమ్మిదిపాళ్ళు పనిచేస్తుంది. ఆపైన అదృష్టముండాలని....అందుకని ఆమె రిస్కు తీసుకోకుండా నూటికి నూరుపాళ్ళు పనిచేసే విషమైనా సంపాదించి వుండాలి. లేదా ముందుగానే మా పథకమంతా తెలుసుకుని వుండాలి—" అన్నాడు చక్రధారి.

సోమేశ్వరరావు వారందరివంకా తీక్షణంగా చూసి—

"నేను చాలా పవర్‌ఫుల్ మనిషిని. నాకు మీ మీద అనుమానం కలిగితే మీ అంతు చూస్తాను. నా కన్నకొడుకు మీద నాకు సదభిప్రాయం లేదు. నా కోడలంటే జాలి, సదభిప్రాయం కూడా ఉన్నాయి. తనకుతానై ఆమె విషం మార్చి చంపిందంటే నేను నమ్మలేను. నన్ను మీరు నమ్మించగలిగితే నా కోడలి సంగతి నేను చూసుకుంటాను. నమ్మించలేకుంటే మిమ్మల్ని ఉరికంబం ఎక్కిస్తాను. అంతవరకూ మా అబ్బాయి శవాన్ని కూడా మీరు కాపాడాలి—" అన్నాడు.

"అంతవరకూ అంటే?" అన్నాడు చక్రధారి.

"నా కోడలిచ్చిన విషం ఆమెకు మీరిచ్చింది కాదనడానికి ఋజువు కావాలి—నా అనుమానం మీ జీ-87 మీద ఇంకా పరిశోధన జరగాల్సుందని—...." అన్నాడు సోమేశ్వరరావు.

"నా జీ-87 ని ముందు ఎలుకలమీదా, తర్వాత కుందేళ్ళమీదా అటుపైన ఇద్దరు బిచ్చగాళ్ళమీదా ఆ తర్వాత చక్రధారిమీదా కూడా ప్రయోగించాను—" అన్నాడు డాక్టర్ గంగాధరం.

"అయినా అది నా కొడుక్కి వికటించి వుండొచ్చు" అన్నాడు సోమేశ్వరరావు.

"గోవర్ధన్ని నేను పరీక్షించాను. అతడిపై యెలాంటి విషం ప్రయోగించబడిందో నా కర్థంకాలేదు. విషప్రయోగాల విషయంలో నేను స్పెషలిస్టుని. ఈ విషం గురించి నేను పరీక్ష చేయాల్సి వుంది—...." అన్నాడు గంగాధరం.

"మీ జీ-87 శాంపిల్ నాకివ్వండి. నేను నాకు తెలి

సిన నిపుణుల ద్వారా దాన్ని పరీక్షింపచేస్తాను—" అన్నాడు సోమేశ్వరరావు.

చక్రధారి సోమేశ్వరరావు వంకే ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

ఈ పెద్దమనిషి కడుపులో యెలాంటి ఊహలున్నాయి?

కన్నకొడుకు చనిపోతే చలించకుండా యింత నిర్లిప్తంగా యెలా ఉండగలుగుతున్నాడీ వ్యక్తి?

ఇతడివల్ల తమ కెలాంటి ప్రమాదం సంభవించవచ్చు?

చక్రధారి ఆలోచన తెలాగున్నప్పటికీ—సోమేశ్వరరావు డాక్టర్ గంగాధరంవద్ద జీ-37 శాంపిల్ తీసుకున్నాడు. శవాన్ని ఒకరోజుపాటు జాగ్రత్తగా భద్రం చేయమన్నాడు.

# 6

సీతమ్మ, రాజమ్మ ఏకకంఠంతో-"నోట్సు రాయడం అయిపోయింది—" అన్నారు.

"నువ్వు చదువు సీతమ్మా!" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

సీతమ్మ గొంతు సవరించుకుని—"నందినిని భర్త గోవర్ధన్ క్రూరంగా హింసించి బాధిస్తున్నాడు. ఆమెకు చక్రధారి సాయపడతాడని చెప్పి ఒక విషం ఇచ్చాడు. చక్రధారి గోవర్ధన్ ఏజెంటు. తాత్కాలికంగా విష ప్రయోగ లక్షణాలు చూపించే జీ-87 అనే మందును డాక్టర్ గంగాధరం కనిపెట్టాడు. ఆ మందునే చక్రధారి నందిని కిచ్చాడు. నందిని ఆ మందునే భర్తపై ప్రయోగించింది. గోవర్ధన్ తాత్కాలికంగా కాక శాశ్వతంగా

మరణించాడు. ఈలోగా చక్రధారి ద్వారా గోవర్ధన్ పథకం గురించి తెలుసుకున్న చక్రధారి ప్రియురాలు చంద్రిక నందినికి అసలు కథ చెప్పేసింది. నందిని విషయం తన మామగారికి చెప్పింది. ఆయన మనకద్దకు వచ్చాడు" అంది.

"ఇందులో కొన్ని పాయింట్లు మిస్సయ్యాయి—" అంది రాజమ్మ.

"ముఖ్యమయిన విశేషాలే చదివాను. అన్నీ చదవమంటే చదవగలను—" అంది సీతమ్మ.

"గుడ్ .... బాగా చదివావు ..." అని మెచ్చుకుని .... "నాగేశ్వర్రావుగారూ — నే నేం చేయాలో మీరు చెప్పండి...." అన్నాడు వెంకన్న.

"నా కోడలు నా కొడుక్కిచ్చిన విషం శాంపిలూ, డాక్టర్ గంగాధరమిచ్చిన జి-87 శాంపిలూ ఒకటేనా అన్నది మీరు తేల్చాలి. ఆపైన యిందులో నా కోడలి పాత్ర ఏమిటీ అన్నది కూడా మీరు తేల్చాలి. ఇందుకెంతో వ్యవధి లేదు. ఒక్కరోజులో మీరన్నీ తెలుసుకోవాలి—" అన్నాడు నాగేశ్వరరావు.

"ఎందుకొచ్చిన గొడవ? మీ అబ్బాయిని చంపిన హంతకులని ఆ చక్రధారి బృందాన్ని పోలీసుల కప్పగిస్తే సరిపోతుందిగా—" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"వెంకన్నగారూ! నే నాడవాళ్ళను రెండు తరగతులుగా విభజిస్తాను. ఒకరు విలాస జీవితాన్ని కోరేవారు. వేరొకరు పవిత్రులుగా ఆరాధించబడాలనుకునేవారు. మొదటి తరగతివారిని నేను నా సుఖాలకు వినియోగించుకొంటాను. రెండో తరగతివారిని ఆరాధిస్తాను. నా భార్య నా కూతురు రెండో తరగతికి చెందినవారు. నా కోడలు

కూడా ఆ తరగతి మనిషేనని నా అనుమానం. ఆమె సహచర్యంలో నా అబ్బాయి బాగుపడతాడనుకున్నాను. కానీ వాడామెను క్రూరంగా హింసించాడు. పరోక్షంగా ఆ హింసకు బాధ్యుడ్ని నేను. ఆ తప్పు నేను సవరించుకోవాలి.

ఆమె కావాలని గోవర్థన్‌ని చంపితే అదామె తప్పు కాదు. అయితే ఆమె క్రూరహింసలు భరించలేక భర్తను చంపాలనుకుందా? లేక విలాస జీవితాన్ని కోరి చక్రధారితో చేతులు కలిపిందా? ఈ ప్రశ్నకు సమాధానం యెంతైనా అవసరం. విలాస జీవితాన్ని కోరే పక్షంలో నందిని బాధ్యత నాకేమీ లేదు. ఆమె పవిత్రురాలే అయితే—ఆమె భవిష్యత్తును సంరక్షించడం నా బాధ్యతగా భావిస్తాను...."

"విషపరీక్షకూ—దీనికీ సంబంధ మేమిటి?"

"ఉంది వెంకన్నగారూ—ఉంది! తానిచ్చిన జీ-87 తాత్కాలికమని చక్రధారి అంటున్నాడు. అలాంటప్పుడు గోవర్థన్ ప్రాణాలెలా పోయాయి? నందినికి వేరే ఇంకా పరిచయాలున్నాయా? విషం సరైనది కాదని ఆమెకు ముందే తెలియజెప్పి—శాశ్వతంగా ప్రాణాలుతీసే విషాన్నామె కందించిన వారెవ్వరై ఉంటారు?" అన్నాడు సోమేశ్వరరావు.

"ఈ ప్రశ్నలకు మీ కోడలే జవాబు చెప్పగలదు. అడిగిచూడలేదా మీరు?"

"అడిగాను. ఆమె చెప్పిన జవాబు విచిత్రంగా ఉంది—...." అన్నాడు సోమేశ్వరరావు.

"విచిత్రమంటే?"

"చక్రధారిచ్చిన విషాన్నామె పూజా మందిరంలో

ఉంచిందట. తనకు న్యాయం జరిపించమని భగవంతుణ్ని ప్రార్థించుకుందిట. తను చేసేది తప్పు కాకుంటే ఆ విషం భర్త ప్రాణాలు తీయాలని ఆమె భగవంతుణ్ని కోరుకుంది. భర్త చనిపోతే అది దేవుడి మహిమే అయుండాలని ఆమె అంటుంది. భర్త నిజంగా చనిపోయాడని నా ద్వారా విన్నప్పుడామె కళ్ళలో నీళ్ళుకూడా తిరగలేదు. గోవర్ధన్ వంటి భర్త జీవించి ఉండడం కంటె పంతొమ్మిదవ శతాబ్దపునాటి వైధవ్య సంప్రదాయమే తనకు మెరుగని ఆమె అంది....”

వెంకన్న నిట్టూర్చి—“ఒక్క క్షణం మీరు కూర్చుని నా అసిస్టెంట్సుతో మాట్లాడండి—నా వద్ద అత్యంతాధునిక పరికరాలున్నాయి. వాటితో ఏ విషాన్నయినా ఇట్టే అయిడెంటిఫై చేయొచ్చు—....”

సోమేశ్వరరావు తలాడించాడు.

వెంకన్న లోపలకు వెళ్ళగానే సోమేశ్వరరావు సీతమ్మ. రాజమ్మలచేత తను చెప్పిన వివరాలు నోట్సు చదివించుకుని విన్నాడు. ఒక చిన్న విశేషం కూడా పోకుండా మొత్తం వివరాల నొకేవిధంగా రికార్డు చేసిన వారిద్దర్నీ ఆయన అభినందించాడు.

సరిగ్గా నలభై నిముషాలపాటు డిటెక్టివ్ వెంకన్న లోపల ప్రయోగశాలలో తన పరిశోధనలు ముగించుకుని వచ్చాడు.

సోమేశ్వరరావు వెంకన్న వంక ఆత్రుతగా చూశాడు.

“రెండు విషాలూ వేరు. రెండూ కొత్తవి....” అన్నాడు వెంకన్న.

“అంటే?”

"ఇంతవరకూ నాకు తెలిసిన ఏ విషంతోటీ, మత్తు పదార్థంతోటీ ఇవి సరిపోలడంలేదు. అంటే రెండూ కూడా కొత్త పదార్థాలే! కానీ రెండూ ఒకటి కాదు——...."

"చాలా చిత్రంగా ఉందే! యెవరికీ తెలియని కొత్త విషాన్ని డాక్టర్ గంగాధరం కనిపెట్టి నా కోడలి కిచ్చాడు. కానీ యెవరికీ తెలియని మరో కొత్త విషాన్ని నా కోడలెలా సంపాదించిందంటారు?" అన్నాడు సోమేశ్వరరావు.

"ఇలాంటి విషం మామూలుగా మార్కెట్లో దొరికే ప్రసక్తే లేనేలేదు. చక్రధారి బృందం మినహాయించి మరొకరి ద్వారా నందినికీ విషమందిందనుకునే ఆస్కారం లేదు. మరొకరెవరైనా నందినికి సాయపడా లనుకుంటే—ఏదో మామూలు విషం తెచ్చిస్తారు తప్ప— ఇలాంటి అరుదైన విషం తేలేరు——...." అన్నాడు వెంకన్న.

"అయితే ఏమంటారు?"

"చక్రధారి అబద్ధం చెబుతున్నాడని నా అనుమానం. అతడు గోవర్ధన్ని అంతం చేయాలనే నిశ్చయించు కున్నాడు. జీ-87 ఉన్నమాట నిజమో కాదో తెలియదు. కానీ వాళ్ళు నందిని కిచ్చింది నిజం విషం——"

"వెంకన్నగారూ——డాక్టర్ గంగాధరం చక్రధారిని మోసం చేసే అవకాశముందని మీ కనిపిస్తోందా?" అన్నాడు సోమేశ్వరరా వున్నట్లుండి.

"మధ్య గంగాధరం ప్రసక్తి యెందుకు?" అన్నాడు వెంకన్న.

"గంగాధరం జీ-87 యేదో ప్రయోజనంతో కనిపెట్టి

ఉండొచ్చు. దాని ప్రభావాన్ని పరీక్షించడానికి చక్రధారిని సాయమడిగితే అతడు మా అబ్బాయిని సూచించి వుండవచ్చు. జీ-87 ప్రయోగం వికటించి ఉండవచ్చు ...”

“సోమేశ్వర్రావుగారూ—మీ బుర్ర సూపర్బ్....మీ వంటి వారికింద కొంత కాలం అసిస్టెంటుగా పని చేస్తే—నా వృత్తిలో నేను మరింత రాణించగలనేమో....”

“వెంకన్నగారూ—మీరు నన్ను వేళాకోళం చేస్తున్నారు....”

“వేళాకోళం కాదు....ఉన్నమాటే అన్నాను.... బహుశా మీరు చెప్పినట్లే జరిగుండొచ్చునేమో!”

కాసేపెవ్వరూ మాట్లాడలేదు. తర్వాత వెంకన్న లేచి నిలబడి—“నేనొకసారి అర్జంటుగా చక్రధారి బృందాన్ని కలుసుకుని వస్తాను—” అన్నాడు.

## 7

గదిలో చక్రధారి, గంగాధరం, చంచల్రావు వున్నారు. వారి ఎదురుగా డిటెక్టివ్ వెంకన్న ఉన్నాడు.

“వెంకన్నగారూ! నిజం చెబుతున్నాను. జరిగింది యాక్సిడెంటే తప్ప—హత్య కాదు హత్యేంటూ జరిగితే ఆ బాధ్యత నందినిది—మాది కాదు—....” అన్నాడు చక్రధారి దీనంగా.

“నేను మీ మాటలు నమ్మాలంటే ఒకటే పద్ధతి ఉంది....” అన్నాడు వెంకన్న గంభీరంగా.

“చెప్పండి—” అన్నాడు చక్రధారి.

“నేను జీ-87 ప్రభావాన్ని పరీక్షించాలి....”

"తప్పకుండా పరీక్షించవచ్చు-" అన్నాడు డాక్టర్ గంగాధరం.

"అది మీ మీదే ప్రయోగిస్తాను...."

"అందుకు నేను సిద్ధం..." అన్నాడు డాక్టర్ గంగాధరం.

"మీరొక్కరే కాదు...."

""ఇంకెవరు?" అన్నాడు గంగాధరం.

"చక్రధారి... చంచల్రావు...."

"మేమూ సిద్ధమే—" అన్నారు వాళ్ళిద్దరూ.

"ముగ్గురూ ఒకేసారి...." అన్నాడు వెంకన్న.

చక్రధారి ఆశ్చర్యంగా—"ఒకరి తర్వాత ఒకరు పరీక్షిస్తే పనికిరాదా?" అన్నాడు.

"పనికిరాదు. జీ-37 ప్రభావం పరీక్షించబడుతున్నప్పుడు మీ ముగ్గురిలో యే ఒక్కరూ మెలకువగా ఉండకూడదు ..."

చక్రధారి అంత ఓపట్టాన అంగీకరించలేదు. డాక్టర్ గంగాధరం కలగజేసుకుని అందర్నీ అందుకొప్పించాడు.

"ఈ వెంకన్న నెలా నమ్మతాం? అతడు మనల నేదయినా చేస్తే?" అన్నాడు చక్రధారి—ఒప్పుకున్నాక కూడా.

"డిటెక్టివ్ వెంకన్నగారి గురించి నాకు బాగా తెలుసు. వారు నీతికీ, నిజాయితీకి పేరుబడ్డవారు. నేరస్థుడిని శిక్షించాలన్నది వారి అభిమతం కాదు. నేరాన్ని రూపుమాపడానికే వారు కంకణం కట్టుకున్నారు. వారిని మనం నమ్మవచ్చు—...." అన్నాడు గంగాధరం.

"నేరస్థులకు సహకరించే జి-87 లాంటి విషాన్ని కని పెట్టినందుకు మీకు. ఆ విషంవల్ల ప్రయోజనం పొందా లనుకున్నందుకు చక్రధారికి, మీ పథకంలో ఒక భాగ మైన చంచల్రావుకు—జీ-87 ప్రభావాన్ని నా ముందు ప్రదర్శించడం బాధ్యత...." అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

అప్పుడు డాక్టర్ గంగాధరం తన కోటు జేబు లోంచి ఒక సీసా తీసి డిటెక్టివ్ వెంకన్న కందించి— "ఇందులో పది గ్రాముల జీ-87 ఉంది. నేను చెప్పిన ప్రభావం కనపడాలంటే—మనిషికొక గ్రాము చాలు. మంచినీళ్ళలో మీరే స్వయంగా కలిపి అందించండి—" అన్నాడు.

వెంకన్న సీసా అందుకున్నాడు.

ముదురు నీలంరంగులో ఉందా సీసా!

వెంకన్న సీసాతో పక్క గదిలోనికి వెళ్ళాడు.

గదిలో పొడవాటి పెట్టె ...

ఆ పెట్టెలో శవం వుందని వెంకన్నకు ముందే తెలుసు.

ఇవతలపక్కగా వాష్ బేసిన్ వుంది.

పక్కనే బోర్లా పెట్టిన గాజు గ్లాసులు నాలు గున్నాయి.

వెంకన్న ఓ గ్లాసు తీసి—వాష్ బేసిన్‌లో కుళాయి విప్పి తొలిచి నిండా నీళ్ళుపట్టి తాగాడు.

నీళ్ళు రుచిగా వున్నాయి.

తర్వాత వెంకన్న మిగతా గ్లాసులూ తీసి కుళాయి కింద కొలిచి—కొద్ది కొద్దిగా నీరు పట్టాడు. తనవద్ద నున్న సీసాలోని మందును ఉజ్జాయింపుగా ఒకో గ్రాము నా గ్లాసుల్లో వేసి బాగా కలిపాడు. మందు నీళ్ళలో కరిగేక

ప్రతి గ్లాసునూ—మూడు వంతులు నీటిలో నింపి—చక్రధారి బృందమున్న చోటికి వెళ్ళాడు.

వారందిచ్చిన గ్లాసుల నందుకుని నీళ్ళు గట గటా తాగేశారు.

కాసేపటికి ముగ్గురూ వెనక్కి వాలిపోయారు.

వారి శరీరం రంగు నీలంగా మారింది. శరీరంలో చలన మాగింది.

నాడి అందడంలేదు. గుండె కొట్టుకోవడంలేదు.

వెంకన్న గుండె వేగంగా కొట్టుకుంది.

తన చేతులతో తను వారిని హత్య చేశాడా?

వాళ్ళు ముగ్గురు కూడా ఎంతో ధైర్యంగా, ఆత్మ విశ్వాసంతో తానిచ్చిన మందు పుచ్చుకున్నారు.

వారికిది అలవాటై ఉండాలి.

కొన్ని ప్రయోగాల అనంతరం వారిది ఎందరికో ప్రదర్శించే వుండాలి. లేకుంటే అంతటి ఆత్మవిశ్వా ముండదు.

వారు నిజంగా చనిపోలేదా? వైద్యశాస్త్రం ఈ పరిణామానికేం పేరు పెడుతుంది? మృత జాగ్రదవస్థలో మనిషి భావా లెలాగుంటాయి?

వెంకన్న ఆలోచిస్తూ అసహనంగా పచార్లు చేస్తున్నాడు,

మందు పుచ్చుకున్న రెండు గంటలకు చక్రధారి బృందం శరీరాలు యథాప్రకారం అయ్యాయి. రంగు మార్పుతోపాటు శరీరంలో చలనం వచ్చింది.

కొద్ది క్షణాల్లోనే వాళ్ళు లేచి కూర్చున్నారు.

"హేట్సాఫ్ టూ యూ—" అన్నాడు వెంకన్న

గంగాధరం బృందాన్నభినందిస్తూ,

“థాంక్స్—” అన్నాడు గంగాధరం.

“ఏ ఉద్దేశ్యంతో మీరీ మందును కనిపెట్టారు?” అన్నాడు వెంకన్న.

“నేను దీన్ని సదుద్దేశ్యంతోనే కనిపెట్టాను. కానీ గోవర్ధన్ మరణంతో నేను కాస్త డీమోరలైజ్ అయ్యాను....” అన్నాడు గంగాధరం.

“ఏమిటి మీ సదుద్దేశ్యం?”

“ఈ విధంగా ఒక్కసారి చచ్చిబ్రతికితే—మనిషి శరీరంలో ఏళ్ళ తరబడి నిద్రలేమి వున్నా—ఆ ప్రభావం పోతుంది. రక్తపుపోటు పోతుంది. పాత జబ్బులన్నీ తొలగిపోయి మనిషికి కొత్త జీవితం ప్రారంభించే అవకాశముంది....”

“వెరీగుడ్....మరి మీ మందు గోవర్ధన్‌నెలా చంపిందంటారు?” అన్నాడు వెంకన్న.

“అదే తెలియడంలేదు. నందిని యేం చేసిందో మరి!....”

“అది తెలుసుకోవాలని మీకుంటే మీరూ నాతో రావాలి....”

“ఎక్కడికి?”

“నందిని ఇంటికి!”

“ఎందుకు?”

“మీ మందు నామె యేం చేసిందో తెలుసుకోవాలిగా—....”

## 8

“దేవుడున్నాడు....” అంది నందిని.

“ఉంటే మన దేశంలో ఎందరో అన్నార్తు లెందు

ఉంటారు?" అన్నాడు వెంకన్న సూటిగా.

"వాళ్ళు పాపాత్ములు—...." అంది నందిని తడుముకోకుండా.

"వాళ్ళు పాపాత్ములు కాదు—అమాయకులు—...." అన్నాడు వెంకన్న.

"అమాయకుల్ని దేవు డెప్పుడూ కాపాడతాడు." అంది నందిని.

"మన దేశంలో దేవుళ్ళ కన్నో పేర్లు—నీ దేవుడి పేరేమిటి?" అన్నాడు వెంకన్న.

"ఏ దేవుడి పేరు చెప్పను?" అంది నందిని చటుక్కున.

"చక్రధారి నీ కిచ్చిన తాత్కాలిక విషాన్ని శాశ్వత విషంగా మార్చిన దేవుడి పేరు చెప్పు..." అన్నాడు వెంకన్న.

చక్రధారి, చంచల్రావు, గంగాధరం ఉత్సాహంగా ఆమెవంక చూస్తున్నారు.

"ఆ దేవుడి పేరు నా కెలా తెలుస్తుంది?" అంది నందిని.

"పేరు తెలియకపోతే అడ్రసు చెప్పు...." అన్నాడు వెంకన్న.

"రండి—చూపిస్తాను—" అంది నందిని.

వెంకన్న, చక్రధారి బృందం ఆమె ననుసరించారు.

ఆమె వారిని పూజామందిరములోకి తీసుకెళ్ళింది.

"ఈ మందిరంలో చాలా విగ్రహాలున్నాయి. ఏ దేవుడి విగ్రహం నా కోరిక తీర్చిందో నాకు తెలియదు-" అంది నందిని.

"అంటే?"

"నా చేతికొచ్చిన విషాన్ని చిన్న సీసాలో పోసి ఈ పూజామందిరంలో ఉంచాను. దేవుణ్ని ప్రార్థించు కున్నాను. దేవుడు నా కోరిక తీర్చాడు...."

"అయితే ఈ విషయంలో మనుషు లెవ్వరూ నీకు సాయపడ లేదంటావు?"

"లేదు—...."

"అసాధ్యం—...." అన్నాడు డాక్టర్ గంగాధరం.

"డాక్టర్ గంగాధరం జస్టేమినట్...." అన్నాడు వెంకన్న—"నువ్వు దేవుణ్ని నమ్మావు. దేవుడు నీకు సాయపడ్డాడు. నువ్వు చక్రధారిని కూడా నమ్మావు. అతడు నిన్ను మోసగించాలనుకున్నాడు. నీ భర్త మీదున్నట్లే అతడిపై కూడా నీకు ద్వేషముందిగా"

"అంటే?"

"తన పథకం పారితే చక్రధారి నిర్దాక్షిణ్యంగా నిన్ను నైట్ స్టార్ హోటలుకమ్మేసి వుండేవాడు. వీలుంటే అతడూ చావాలని నీకుందా?"

"నా కర్థంకాలేదు...."

"నేను నీకు గతంలో చక్రధారిచ్చిన మందును మరి కాస్త యిచ్చాను. ఆ మందును గతంలోలాగే నీవు పూజా మందిరంలో ఉంచు. రెండ్రోజుల అనంతరం అతడిచేత ఆ మందును తాగించు. అతడు జీవించాడా—నీ కతడి సొత్తువు. అతడు నిన్ను నైట్ స్టార్ హోటల్ కమ్మేస్తాడు. అతడు మరణించాడా—నీవు పవిత్రురాలివి. నీ మామగారికే కాదు—నాకూ ఆరాధ్య దేవతవు—" అన్నాడు వెంకన్న.

అతడు మాట్లాడుతున్నదేమిటో అర్థంకావడానికి

కందరికీ కాసేపట్టింది.

"నో నో — నేనిందుకు సిద్ధంగా లేదు —" అన్నాడు చక్రధారి.

"ఎందుకని?" అన్నాడు వెంకన్న.

"ఆమె మందును విషంగా మార్చగలదు...."

"మందు నామె కాదు — దేవుడు విషంగా మార్చాడు."

"అదంతా కట్టి కథ...."

"అదే మనమిప్పుడు తేల్చేస్తాం.... పూజామందిరానికి వంతులవారిగా నేను. మీరు కాపలా కాద్దాం.... గతంలో లాగే దేవుడికి రెండే రెండ్రోజులు టయిమిద్దాం...."

"నేనిందుకు ఒప్పుకోను...." అన్నాడు చక్రధారి.

"మిస్టర్ చక్రధారి! మీరిందుకొప్పుకోకపోతే — నందినికి జీ-87 కి బదులు శాశ్వత విషాన్ని మీరే యిచ్చారని — ఒప్పుకోవలసి ఉంటుంది...."

డాక్టర్ గంగాధరం చక్రధారికి నచ్చచెప్పాడు.

"ఇది నీ పవిత్రతకు పరీక్ష. భవిష్యత్తుకు సోపానం. కాదనకూడదు —" అంటూ వెంకన్న నందినిని సవాలు చేయడంలో ఆమెకూడా ఒప్పుకుంది.

అప్పుడు నందిని ఓ చిన్న సీసా తెచ్చిచ్చింది.

మూడంగుళాల పొడవున్న సిలిండర్ ఆకారంలోని తెల్లని గాజు సీసా అది. దానికి స్క్రూ సిస్టంతో ఓ ప్లాస్టిక్ మూత వుంది.

వెంకన్న ఆ సీసాను తనే స్వయంగా కడిగాడు. శుభ్రంగా కడిగాడు. తనవద్దనున్న జీ-87 లో కొంత ఆ సీసాలోకి మార్చి సీసా మూత పెట్టాడు. నందిని చెప్పినచోట అతడే ఆ సీసా ఉంచాడు.

పూజామందిరంలో జీ-87 ఉన్న సీసా..

ఆ సీసా కుదురుగా ప్రముఖ దేవుళ్ళ విగ్రహాలు.

పూజామందిరం ముందు నందిని కూర్చుంది. ఆమె కనులు మూసుకుని భగవంతుణ్ని ప్రార్థిస్తోంది—తన పవిత్రతను ఋజువు చేయుమని.

ఆమెకూ పూజామందిరానికీ కాపలాగా ఉన్నారు వెంకన్న, చక్రధారి బృందం.

వెంకన్న చెంచలావుద్వారా సోమేశ్వరరావుకూ, తన అసిస్టెంట్సుకూ కబురుపెట్టి అక్కడికి రప్పించాడు.

సోమేశ్వరరావుకు జరిగిందంతా చెప్పి—"మీ కోడలి పవిత్రతను నిరూపించడానికి మీరు మరో రెండ్రోజులాగక తప్పదు...." అన్నాడు.

"మీరన్నది సబబుగానే ఉంది—" అని సోమేశ్వరరావు అంగీకరించాడు.

"నేనెవర్నీ నమ్మను. నా వంతు కాపలా లేనప్పుడు మోసం జరక్కుండా మీరుండాలి—" అని వెంకన్న తన అసిస్టెంట్సుకు చెప్పాడు.

# 9

రెండురోజులలా గడిచాయి.

"చక్రధారి - పరీక్షకు సిద్ధపడాలి. మీకు విజయమో, వీరస్వర్గమో!" అన్నాడు వెంకన్న.

"దేవుడున్నాడు—నా పవిత్రతను ఋజువుచేస్తాడు" అంది నందిని.

ఆమె ముఖం నిర్మలంగా వుంది. ఆమె కళ్ళు నిశ్చలంగా వున్నాయి.

చూడగానే ఆమె మహాపతివ్రత అనిపిస్తుంది.

చక్రధారి భయపడుతూ—"నేను నందిని విషయంలో తప్పుగా ప్రవర్తించాను. అందుకు నాకు తగిన శిక్షపడా

ల్సిందే.... కానీ....” అడిగాడు.

“ఊఁ చెప్పండి—” అన్నాడు వెంకన్న.

“నా తప్పుకు నాకు శిక్షపడుతుంది. నేను చనిపోతానని భయంగా ఉంది—” అన్నాడు చక్రధారి.

“అయితే?”

“నేను నందిని పవిత్రతనంగీకరిస్తున్నాను. నా ఓటమిని ఒప్పుకుంటున్నాను. ఆమె యిచ్చే మందును స్వీకరించను....”

“తప్పించుకోవడం మీకంత సులభంకాదు. నందినికి మనమందరమూ కాపలాగా వున్నాం. పూజామందిరంలో మందునామె మార్చలేదు. ఈ రోజుల్లో మాయమంత్రాలనెవరూ నమ్మరు—....” అన్నాడు వెంకన్న—“కాబట్టి గోవర్ధన్ చావుకి కారణమైన విషం మీరే ఆమెకిచ్చారని అనుకోవచ్చా?”

“మిస్టర్ చక్రధారీ! డోంట్ క్రియేట్ సీన్....నందినిచ్చిన మందు పుచ్చుకో—” అన్నాడు డాక్టర్ గంగాధరం.

“నాకు చెప్పేబదులు నువ్వే పుచ్చుకోవచ్చుగా—” అన్నాడు చక్రధారి.

“నాకభ్యంతరంలేదు. కానీ పురాణ కథల్లా ఇది సైన్సుకాదు — పవిత్రతకు పరీక్ష. నందిని చేతిమందు నీపట్ల నీ తప్పు నాపట్ల విషంగా మారకపోవచ్చు....”

“నందిని విషయంలో ఇద్దరూ ఒకేరకం మోసగాళ్ళు. మందెవరు పుచ్చుకున్నా ఫరవాలేదు—....” అన్నాడు వెంకన్న.

“నాకైతే ముగ్గురికీ యివ్వాలనుంది..” అంది నందిని.

“పుచ్చుకుందుకు నేను రెడీ—....జీ—87ని నేను

"నమ్మకుంటే ఇంకెవరూ నమ్మలేరు...." అన్నాడు గంగాధరం.

నందిని ముందుగా ఒక గ్లాసుడు నీళ్ళలో కొద్దిగా ఆ మందును కలిపింది.

"ముందెవరు తీసుకుంటారు?" అన్నాడు వెంకన్న.

"నేను—" అన్నాడు డాక్టర్ గంగాధరం.

"అయితే తీస్కోండి...."

గంగాధరం ఆ గ్లాసును తీసుకుని—నీళ్ళు త్రాగబోతూండగా—"ఆగండి!" అన్నాడు వెంకన్న.

"ఏం?" అన్నాడు డాక్టర్ గంగాధరం ఆశ్చర్యంగా.

"ఆ సీసాలో యిప్పుడున్నది జీ—ఎయిటీ సెవెనో, ప్రమాదకరమైన మందో తెలుసుకోవడానికింకా సులభమైన పద్ధతి నాకు తెలుసు. అంతవరకూ యెవరూ రిస్కు తీసుకోవడం మంచిది కాదు—" అన్నాడు వెంకన్న.

"ఏమిటది?"

"గతంలో నందిని తన భర్తకిచ్చిన మందును నేను పరికరాలద్వారా పరీక్షించాను. అది జీ—ఎయిటీ సెవెన్ కాదని తేలింది. ఇప్పుడు నేను మళ్ళీ ఆ పరికరాలద్వారా పరీక్షించి ఇది జీ—87 అవునో కాదో తేల్చగలను—"

"అదే అత్యుత్తమమైన పద్ధతి-పరీక్షకు నేను మీతో వస్తా—" అన్నాడు డాక్టరు గంగాధరం.

## 10

ఆ గదిలో చక్రధారి బృందం, నందిని, సోమేశ్వరరావు, వెంకన్న బృందం—ఉన్నారు.

"ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది. నందిని పూజా మందిరంలో వుంచిన తాత్కాలిక విషం-రెండురోజుల్లో ప్రమాదకరమైన విషంగా మారిపోతోంది. ఇది ఒకసారి

కాదు. రెండు పార్లు జరిగింది. దేవుడనుకోవాలా? నందిని పవిత్రత గొప్పదనుకోవాలా? లేక మన కర్ణంకాని నమ్మిన్నిందులో ఉన్నదనుకోవాలా? — అన్నది నేను, డాక్టర్ గంగాధరం యిప్పుడు పరిశోధించి తేల్చబోతున్నాం—" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

జరిగిన విశేషం అందరికీ ఆశ్చర్యంగా ఉంది.

పూజామందిరంలో నే మందు విషంగా మారుతున్నదని నిశ్చయంగా తేలింది కాబట్టి వెంకన్న, గంగాధరం కూడా ఆ మందిరంపై నే పరిశోధన ప్రారంభించారు.

బాగా పరిశోధించాక వారు తేల్చిన విశేషమిది....

మందిరంలో అటూ యిటూ రెండు దీపాలు నిత్యం వెలుగుతూంటాయి. కరెంటున్నంత సేపు అవి వెలుగుతూ నే ఉంటాయి.

ఆ మందిరంలో నే ప్రముఖ దేవుళ్ళ విగ్రహాలు ఆరు న్నాయి. ఆ విగ్రహాల కళ్ళు ప్రత్యేకమైన వజ్రాలతో పొదగబడ్డాయి. ఈ దీపాల కాంతి ఆ వజ్రాలపైబడి ప్రతిఫలించి—అన్నివైపులనుంచీ కేంద్రీకరించబడి-జీ-87 మందుపై ప్రసరిస్తోంది. అప్పుడందులో రసాయనిక చర్య జరిగి—జీ—87 ప్రమాదకరమైన విషంగా మారుతోంది.

ఇలా జరుగుతుందని జీ—87 కనిపెట్టిన డాక్టరు గంగాధరానికి కానీ — దేవుణ్ణి నమ్మిన నందినికిగానీ తెలియదు.

"ఈ విగ్రహాలు నీ కెక్కడివి?" అన్నాడు వెంకన్న నందినితో.

"అదా మెకు నే నే యిచ్చాను. రోజూ వాటికి పూజ చేయడం ద్వారా నా కొడుకులో మంచి మార్పు వచ్చి ఆమె సుఖపడుతుందని చెప్పాను. కానీ అవా మెకిలా

ఉపయోగపడతాయని నేను కలలో కూడా అనుకో లేదు...." అన్నాడు సోమేశ్వరరావు.

జరిగిన విశేషానికి చక్రధారి, చంచల్రావు 'వగైరా లందరూ షాక్ తినేశారు.

"దేవుడున్నాడు. అతడు పవిత్రుల్ని రక్షిస్తాడు. మోసగాళ్ళను శిక్షిస్తాడు"

ఇలాంటి భావాలక్కడి వారందరి ఆలోచనల్లోనూ తిరుగుతున్నాయి.

"సోమేశ్వరరావుగారూ! గోవర్ధన్‌కి మీరు జన్మనిచ్చారు. అందుకే భగవంతుడు మీ చేత అతణ్ని అంతం చేయించాడు. అతడి మరణం యాదృచ్ఛికంగానే జరిగినా దుర్మార్గులందరికీ హెచ్చరికగా ఉంటుంది..." అన్నాడు వెంకన్న.

సోమేశ్వరరావు లేచి నిలబడి—"వెంకన్నగారూ! కాసేపట్లో మీ ఫీజు మీ ఆఫీసుకు పంపిస్తాను. నా కొడుకు గురించి నేను పూర్తిగా మర్చిపోతాను. వాడి శవానికి అంతిమ సంస్కారం జరిపించుకునే అర్హత కూడా లేదు. దాన్ని మీ యిష్టానికే వదిలిపెడుతున్నాను. నా కోడలికి పునర్వివాహం జరిపించి ఆమె భవిష్యత్తును తీర్చిదిద్దుతాను .... భగవంతుడున్నాడనీ-తన పవిత్రతను నిరూపిస్తాడనీ నమ్మిన ఆ అద్భుత వ్యక్తి నా కోడలు కావడం తాత్కాలికమైనా నా అదృష్టం...." అన్నాడు.

చక్రధారి వెంకన్నవైపు తిరిగి—"గోవర్ధన్‌కి అంతిమ సంస్కారం జరిపించే బాధ్యత నాది. అర్హత ఉందనుకుంటే నేను నందినికి భర్తను కావాలనుకుంటున్నాను-" అన్నాడు.

## 43

వెంకన్న చటుక్కున లేచి నిలబడి తన అసిస్టెంటు వైపు తిరిగి—"మనమిక్కడ చేయవలసిందీ చెప్పవలసిందీ ఏమీ లేదు. అన్నింటికీ దేవుడున్నాడు. ఆ విషయమిప్పుడే ఋజువైంది కదా—రండి, పోదాం—" అన్నాడు.

—: అ యి పో యిం ది :—

# ఒకే దోపిడికి ఇద్దరు దొంగలు

సుంకరి రాంప్రసాద్

**1979** సెప్టెంబర్ 20.

హైదరాబాద్ నిజాం వారసుడైన నిజాం షాహీ వారసత్వంగా సంక్రమించిన వజ్ర వైఢూర్యాలు, కెంపులు ముత్యాలు, రత్నాలు బంగారు, వెండి ఆభరణాలను వేలం వేయడానికి అన్ని ఏర్పాట్లు పూర్తయ్యాయి.

చారిత్రాత్మకమైన ఆ వేలం పాట సుప్రీంకోర్టు ఆవరణలో ఏర్పాటు చేయబడింది. దేశం నలుమూలల నుండీ ఎందరో కోటీశ్వరులూ, షేక్‌లూ ఆ పురాతన జవహారీని కొనడానికి కరెన్సీ కట్టలను పట్టుకొని సిద్ధంగా వచ్చారు.

అయితే నిజాం షాహీ ఆధీనంలోని ఆ అపూర్వ వస్తువు లన్నీ చారిత్రాత్మకమైనవి గనుక తమకు స్వాధీనం చేయవలసిందగా పురాతత్వశాఖ డైరెక్టర్ ఆయనకు నోటీసు జారీ చేసాడు.

వేలంలో పాల్గొనడానికి కొందరు విదేశీయులుకూడా పెందర్లు పెట్టడంతో....

ఆ అపూర్వ సంపద మన దేశాన్ని దాటిపోరాదని, అది భారతీయ సంస్కృతిలో భాగమని బొంబాయి వజ్రాల వర్తకులు కూడా ఒక కేసు నమోదు చేసారు.

ఆ వేలాన్ని తక్షణం ఆపుచేయించాలని ప్రాచీన భారత సంస్కృతీ సంరక్షణా సంఘం ఆధ్వర్యంలో పెద్ద ప్రజా ప్రదర్శన జరిగింది.

ప్రజలనుండి వచ్చిన వత్తిడికి తట్టుకోలేక ప్రభుత్వం ఆ వేలంను నిషేధించింది.

నిజాం సంపదమీద కన్నువేసి ఉంచిన ప్రపంచ ప్రసిద్ధ చెందిన అభినవ కుబేరులకు, భారతీయ వజ్రాల వర్తకులకూ ఈ నిషేధం....అశనిపాతమే అయింది.

న్యాయబద్ధంగా వీలుకాకుంటే, అన్యాయంగానైనా అమూల్యమైన ఆ సంపదను స్వంతం చేసుకోవాలను కున్నారు కొందరు బడా శేఠ్‌లు.

ఆ క్షణం నుండీ....రహస్య మంతనాలూ, ఎత్తులూ, పైఎత్తులూ, బేరసారాలూ ప్రారంభమయ్యాయి.

చీకటి ఒడిలో లోకమంతా నిద్రించే వేళ ....చీకటి ప్రపంచపు దాదాలు మాత్రం అమూల్యమైన ఆ సంపదను చేజిక్కించుకోవడానికి హడావుడి పడుతున్నారు.

## 2

బొంబాయి నగరం నడి బొడ్డున హాంగ్ కాంగ్ బ్యాంక్ ఉంది. (దీన్ని ఇదివరలో మర్కంటైల్ బ్యాంక్ అనేవారు) ఈ బ్యాంకులోనే ఒకనాడు భారతదేశం లోని అత్యంత సంపన్నులైన రాజుల్లో ఒకరుగా....

బ్రిటిష్‌వారు 250 లక్షల పౌనులు అప్పుగా అడగ్గా

అర క్షణంకూడా ఆలోచించకుండా అప్పటికప్పుడు ఖజానాలోంచి తీసిచ్చి బ్రిటిష్ పాలకులను విస్మయ సాగరంలో ముంచెత్తిన మహారాజుగా....

ప్రసిద్ధిగాంచిన నిజాం నవాబు సంపదలో కొంత భాగం ఈ నాటికీ భద్రంగానే ఉంది. కూర్చుని తింటే కొండలైనా తరుగుతాయంటారు.

అలా తరిగిపోగా, దాయాదులు పంచుకోగా, ప్రభుత్వం స్వాధీనం చేసుకోగా, మిగిలిన ఆయన సంపద ముందు, ఈనాటి చమురు వాణిజ్యవేత్తలయిన అరబ్ కుబేరుల ఆస్తిపాస్తులన్నీ కలిసినా సూర్యునిముందు చిన్న దీపం పెట్టినట్టే ఉంటుందంటే అది యేదో కట్టుకథలా కనిపిస్తుందే తప్ప నూటికి నూరుపాళ్ళు వాస్తవంలా కనిపించదు.

ఇంతగా ప్రసిద్ధి చెందిన నిజాం నవాబు నిజానికి చాలా సామాన్యమైన జీవితాన్ని కోరుకున్నాడు.

ఆయన నివసించిన గది పది, పన్నెండు అడుగులకు మించి ఉండదు. శాకాహార భోజనం. పళ్ళూ తప్ప ఆడంబర భోజనం ఆయనకు అలవాటు ఉండేది కాదు. ఎప్పుడూ పాతవి, లేదా మాసిన దుస్తులే ధరించేవాడు.

అయితే అతనిని పిసినారిగా అభివర్ణించే వారికి కనువిప్పు కలిగించే వాస్తవం ఒకటి వుంది. మైసూర్, బరోడా, గ్వాలియర్, కాశ్మీర్ మహారాజుల తరువాత బ్రిటిష్ వారిచేత ఇరవై ఒక్క సార్లు శతఘ్నుల గౌరవ వందనానికి నోచుకున్న మహారాజు నిజాం నవాబు ఒక్కరే.

అందుకు కారణం ఏమిటి?

ఏడవ నిజాంగా ప్రసిద్ధి చెందిన ఈ నిజాం నవాబు

తన ఆస్తిలో చాలా భాగాన్ని పేదల సంక్షేమ కార్యక్రమాల కోసం వినియోగించారు.

ఆసుపత్రులు, విద్యాసంస్థల నిర్మాణం వంటి సంక్షేమ పథకాలకు ఆయన చేసిన ఖర్చులకు ప్రత్యక్ష సాక్ష్యాలను ఈనాటికీ మన ఢిల్లీ, బొంబాయి, హైదరాబాద్ వంటి నగరాల్లో చూడవచ్చు.

అయితే తన రాజవంశ భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని ఆయన వాణిజ్య రంగంలో కూడా పెట్టుబడులు పెట్టారు.

స్వాతంత్ర్యం వచ్చిన ఇరవై ఒక్క సంవత్సరాల తరువాత ఆయన ఎనభై ఒక్క ఏళ్ళ వయసులో వరు వృద్ధుడుగా మరణించాడు.

ఆయన చనిపోయేనాటికి మిగిలిన సంపదలో చాలా భాగం ఇప్పటికీ లెక్కలోకి రాకుండా సమాధానం దొరకని ప్రశ్నలా మిగిలిపోయింది. ఆయన గురించి ఇప్పుడు ప్రచారంలో ఉన్న విషయాల్లో కట్టుకథలేవో, వాస్తవాలేవో తెలియని పరిస్థితి ఏర్పడింది.

ఒకనాడు ఆయన రాజప్రాసాదం అలంకరణలో.... ఆయన సంపదలో భాగంగా కుప్పలకొద్దీ పోసి వున్న వజ్రాలు, కెంపులు, ఇంద్రనీలాలు, పచ్చలు, ముత్యాలు, పాత పేపర్ల కట్టల మధ్య ఉన్న నగదు కట్టలు లండన్ లోని పేవ్ మెంట్ల మీదకు తరలి వెళ్లాయని అంటూంటారు.

వాటి నిజమైన విలువ తెలిసిన వారెవరైనా క్షణంలో కోటీశ్వరుడు కావడానికి అవకాశాలు యేర్పడ్డాయి. అలా కోటీశ్వరులయినవారు కూడా చాలామందే ఉంటారని ఒక అంచనా.

నిజాం తండ్రి....అంటే ఆరవ నిజాం టేబిల్ పై ఒక

పేపర్ వెయిట్ ఉండేది. అది కేవలం గాజుతో తయారుకాబడిన పేపర్ వెయిట్ అనుకుంటే మాత్రం పొరపాటే!

గోల్ఫ్ బాల్ పరిమాణంలో ఎనిమిది కోణాలుగా వున్న వజ్రం అది. ప్రస్తుతం బ్రిటన్ రాణి కిరీటంలో చోటు చేసుకొన్న కోహినూర్ వజ్రంకన్నా అది 75 కేరట్లు యెక్కువ. అంటే అది మొత్తం 184 కేరట్ల వజ్రం.

'జాకబ్ డైమండ్' అని పిలిచే ఈ వజ్రాన్ని ఆరవ నిజాం 1901 లో కలకత్తాలో ఒక యూదు వర్తకుని వద్ద ఆ కాలంలో 60 లక్షలు పెట్టి కొన్నాడట!

రూపాయి విలువ సుమారు 16.08 పైసలకు పడి పోయిన ఈ రోజుల్లో దాని విలువ ఎంత వుంటుందో లెక్కించగలిగితే సిరి తరగని నిజాం ఖజానా విలువ ఏపాటిదో తెలుస్తుంది.

ఏడవ నిజాం కూడా ఆ వజ్రాన్ని పేపర్ వెయిట్ గానే వాడుకున్నాడు. అతడు చనిపోయాక మాత్రం ఆ వజ్రం, నిజాం వాడి పారేసిన చెప్పుల దొంతరల మధ్య పడివుండగా కనుగొన్నారు.

ఇది ఆయన సంపద సాగరంలో ఒక చిన్న నీటిబొట్టు మాత్రమే!

నిజాంవద్ద మూడడుగుల ఎత్తు వున్న ఒక బంగారు వృక్షం వుండేది. దానికి అన్నీ వెండి ఆకులు, బంగారు పండ్లు! ఆయనవద్ద ఏనుగు దంతంతో చేసిన చదరంగపు బల్ల, వజ్రాలు, వైఢూర్యాలు పొదిగిన బంగారు పావులు వుండేవి.

ఉదాహరిస్తే ...యిలాంటి అమూల్య వస్తువులు

యెన్నో!

నామమాత్రంగా ఎనిమిదవ నిజాంగా పిలువబడే ముకర్రంజాకు తెలియని సంపదే యెంతో వుండేదట. మిగిలిన వజ్ర, వైఢూర్యాలు, కెంపులు, పచ్చలను కూడా తాను రెండుసార్లు మాత్రమే చూశానని ఆయన అంటూ ఉంటారు.

## 3

'హోటల్ మదీనా'

ఫ్లోరోసెంట్ లైట్ షేడ్‌లో కొట్టొచ్చినట్లు కనిపిస్తోన్న సైన్ బోర్డును చూసి టక్కున ఆగాడు జానీ.

వత్తుగా దుబ్బులా పెరిగిన గడ్డం, నల్లని పెద్ద పెద్ద గాగుల్స్, నుదుటిపైకి జారినట్లు పెట్టుకొన్న కేప్ .... అన్నీ కలసి అతని ముఖాన్ని చాలావరకు కవర్ చేస్తున్నాయి. తలపై చిన్న కేప్‌ను మరింత క్రిందకు లాక్కుంటూ ఆ హోటల్ లోనికి అడుగు పెట్టాడు.... అతడు.

కరోల్ బాగ్ మెయిన్ రోడ్ ప్రక్కనున్న సందులో వుంది ఆ హోటల్. ఇరవై నాలుగు గంటలూ అలగా జనంతో క్రిక్కిరిసి ఉండే చౌకబారు హోటల్ .... అది.

హాలులోనికి అడుగుపెడుతూనే ఓసారి చుట్టూ పరికించి చూశాడతడు. కౌంటర్‌కు కాస్త దూరంలో హాలుకు కుడివైపున కనిపించాయి అతనికి మేడపైకి పోయే మెట్లు. చకచకా అడుగులు వేసుకుంటూ మెట్లపైకి నడిచాడతడు.

సన్నగా, పొడుగ్గా వున్న నడవాకు ఇరువైపులా వున్న

రూమ్ నెంబర్లను చూసుకుంటూ వెళుతున్నాడు అతడు. తనకు కావాల్సిన నెంబరుగల రూమ్ యెక్కడుందో అడిగి—అనవసరంగా ఎవరి దృష్టిలోనూ పడటం ఇష్టం లేదు అతనికి.

రెండవ ఫ్లోర్‌లో దొరికింది అతడు వెతుకుతున్న గది '203.' ఆ గది నెంబరును మరోసారి పరీక్షగా చూశాడతడు.

ఒకసారి చుట్టూ చూసి, తనను యెవరూ గమనించటంలేదని ధృవపరచుకున్నాక, మునివ్రేళ్ళతో మెల్లగా ఆ గది తలుపులను తట్టాడు.

"ఎవరది?" గదిలో నుండి ఒక బొంగురు గొంతు వినవచ్చింది.

"జానీ!" అన్నాడతడు.

తలుపులు తెరుచుకున్నాయి. అతడు లోనికి ప్రవేశించాడు.

గది మధ్యలో వేసివున్న కుర్చీలో కూర్చొని తీరిగ్గా విస్కీని సేవిస్తోన్న లాల్ అతన్ని చూసి పలకరింపుగా నవ్వాడు.

"కూర్చో జానీ."

తెరిచిన తలుపులను క్లోజ్ చేస్తూ బొంగురు గొంతుతో అన్నాడు శంభుమిత్ర.

కుర్చీని ముందుకు లాక్కొని కూర్చున్నాడు జానీ. మరో గ్లాసులో సగంవరకూ బాటిల్‌లోని విస్కీని పోసి అతని ముందుకు తోశాడు లాల్. ఫ్లాస్క్‌లో నుండి రెండు ఐస్ క్యూబ్స్‌ను తీసి గ్లాసులో వేసుకున్నాడతడు.

"ఎప్పుడూ ఫైవ్ స్టార్ హోటల్స్‌లో విహారం చేసే

మీరు ఈసారి ఈ గల్లీ హోటల్‌లో మకాం వేశా రంటే — యేదో పెద్ద చేపకే ఎర వేశారన్నమాట.

చెప్పండి దోస్తు!

ఏమిటి విషయం? ఎందుకు నన్నింత అర్జంటుగా పిలి పించారు?”

—గ్లాసులోని విస్కీని మెల్లగా చప్పరిస్తూ అడిగాడు జానీ. అతని వంక మెచ్చుకోలుగా చూశాడు శంభు మిత్ర.

“ఫైవ్ స్టార్ హోటల్స్ అన్నింటిపైనా పోలీసులు మాటువేసి వుంచారు జానీ! అందుకే ఇలాంటి చౌకబారు హోటల్లో కలియాల్సి వచ్చింది.”

తనుకూడా వారిద్దరి ప్రక్కనున్న మరో కుర్చీలో సెటిల్ అవుతూ అన్నాడు శంభుమిత్ర.

‘చిల్లర నేరస్థులూ, పేట రౌడీలూ సంచరించే— మదీనా లాంటి గల్లీ హోటల్స్‌ను విడిచిపెట్టి ఢిల్లీ పోలీసులు ఫైవ్ స్టార్ హోటల్స్‌పై నిఘా వేశారంటే.... ఏదో పెద్ద నేరమే జరగబోతూందని ఊహిస్తున్నారన్న మాట వారు.

అంటే....తన అంచనా తప్పు కాదంటే, చీకటి రాజ్యంలోని చాలా పెద్ద తలకాయలే ఢిల్లీ నగరంలో తిష్టవేసి వుండాలి.

పోలీసులనూ, నేరస్తులనూ ఇంతగా ఆకర్షిస్తున్న ఆ బంగారు ఎర యేమిటి?’

మరి కాస్త విస్కీని గ్లాసులోకి వంచుకుంటూ.... ఆలోచిస్తున్నాడు జానీ.

అతని మనసులోని ఆలోచనలను చదివినట్లుగా, నవ్వాడు లాల్.

"నిజాం నవాబు ఖజానా గురించి ఎప్పుడయినా విన్నావా జానీ?"

చెళ్ళున రుళ్ళనకో అర చేతితో ముఖంమీద చరిచి నట్లనిపించింది అతనికి. త్రాగుతూన్న విస్కీ పొలమారింది....

'కోట్ల రూపాయల విలువ చేసే అపూర్వమైన నిజాం సంపదను విక్రయించటాన్ని నిషేధిస్తూ ప్రభుత్వం చేసిన ఉత్తరువును ఆ రోజు ఉదయమే పేపర్లో చదివాడతడు.

"ప్రస్తుతానికి ప్రభుత్వం ఆ నిజాం ఖజానాను పురావస్తుశాఖ ఆధ్వర్యంలో వున్న మ్యూజియంలో వుంచింది జానీ! ఢిల్లీ ప్రజలు తిలకించడం కోసం మరో రెండు రోజులు మాత్రం ఆ ఖజానా మ్యూజియంలో వుంచబడుతూంది. తరువాత సేఫ్టీ లాకర్స్‌లో భద్రపరచడానికి రిజర్వ్ బాంక్ కు తరలిస్తారట ఆ సంపదను."

చెప్పటం ఆపి జానీ వంక కొరగా చూశాడు లాల్.

"సో! వుయ్ షుడ్ స్నాచ్ దట్ ట్రెజరీ బిఫోర్ దీజ్ టూ డేస్! యామ్ ఐ రైట్ ఫ్రెండ్స్?" సాలోచనగా తల పంకిస్తూ అడిగాడు జానీ.

అయితే అది అంత సులువైన పనేమీ కాదని అతనికి తెలుసు.

పురావస్తుశాఖ ఆధ్వర్యంలో వున్న ఆ మ్యూజియంకు యెలాంటి సెక్యూరిటీ యేర్పాట్లు వుంటాయో అతనికి తెలియకుంది కాదు. ఆ మ్యూజియం ఫోటోగ్రఫీ అతని కళ్ళముందు ఒక్కసారి లీలగా కదలాడింది.

చాందినీ చౌక్ రోడ్‌లో విశాలమైన కాంపౌండ్ మధ్య కట్టబడి వుంది ఆ మ్యూజియం.

పది అడుగుల ఎత్తయిన పటిష్టమయిన రాతి ప్రహారీ. దానిపై మరో మూడడుగుల ఎత్తున్న ఐరన్ ఫెన్సింగ్. తాకిన అరక్షణంలో ఆ మనిషిని మాడ్చి, బొగ్గులా చేయగల్గేంతటి శక్తివంతమైన ఓల్టేజ్ కల విద్యుత్ ఇరవై నాలుగు గంటలూ ఆ ఫెన్సింగ్‌లో ప్రవహిస్తూ వుంటుంది.

ప్రహారీకి, మెయిన్ బిల్డింగ్‌కూ మధ్యనున్న ఖాళీ స్థలంలో నాలుగు బ్లడ్ హౌండ్స్ తిరుగుతూ వుంటాయి. నాలుగడుగుల ఎత్తుతో, చిన్నసైజు పెద్దపులుల్లా వుండే ఆ బ్లడ్ హౌండ్స్—పరాయి మనిషి ఆ ప్రాంగణంలో కనిపిస్తే చాలు....కోరలతో కండలు చీల్చి, చెండాడుతాయి.

మెయిన్ బిల్డింగ్ పైనున్న టవర్‌లో యిద్దరు గార్డ్స్ కాపలా వుంటారు. మెర్క్యురీ లైట్ల వెలుగులతో పట్టపగలులా ఉండే ఆ బిల్డింగ్ ఆవరణలో అనుమతి లేకుండా ఎవరైనా ప్రవేశించడానికి ప్రయత్నిస్తే, నిర్దాక్షిణ్యంగా కాల్చిపారేస్తారు వారు.

వీరుగాక మెయిన్ గేటుదగ్గర ఇద్దరు గార్డ్స్. మెయిన్ బిల్డింగ్ చుట్టూ ఆరుగురు గార్డ్స్...పహారా తిరుగుతూ వుంటారు.

మ్యూజియంలోపల అమూల్యమైన వస్తువు లుంచబడ్డ గాజు షెల్ఫ్‌లకు అలారం బెగ్స్ అమర్చబడి వున్నాయి. వాటిపై చేయి వేసిన మరుక్షణం.... చెవులు చిల్లులు పడేలా మోగటం ప్రారంభిస్తాయి ఆ ఎలక్ట్రిక్ అలారమ్స్.

ఇన్ని కట్టుదిట్టమైన రక్షణ ఏర్పాట్లతో దుర్భేద్యంగా విలసిల్లే ఆ మ్యూజియంలోకి ప్రవేశించి ఆ నగలను దొంగ

లించడమంటే మాటలు చెప్పినంత సులువేం కాదని అతనికి తెలుసు.

"దానికో అద్భుతమైన ప్లాన్ వేసి వుంచాను జానీ!" అన్నాడు లాల్. అతని మనసులోని ఆలోచనలను చదివి నట్లుగా చిన్నగా నవ్వుతూ.

"చెప్పు!" అన్నట్లు చూశాడతడు.

"ఈ రోజు దుర్గాష్టమి!

చాందినీచౌక్ సెంటర్‌లో ప్రతిష్ఠించారు ఒక దేవీ విగ్రహాన్ని. గత వారం రోజులుగా దేవీ నవరాత్రులను మహావైభవంగా జరుపుతున్నారు చాందినీచౌక్ ఏరియా ప్రజలు.

రేపు నవమి! అంటే ఆఖరి రోజన్న మాట! రేపు ఆ విగ్రహాన్ని నీటిలో నిమజ్జనం చేస్తారు.

నిమజ్జనానికి ముందు దేవీ విగ్రహాన్ని పురవీధుల్లో ఊరేగిస్తారు. మిగిలిన ఏరియాలను కవర్ చేసి, మ్యూజియమ్ ఉన్న రోడ్డులోనికి ఆ ఊరేగింపు వచ్చేసరికి, రాత్రి పదకొండు గంటలు దాటుతుంది.

సరిగ్గా ఆ సమయానికి...."

....లో గొంతుతో లాల్ వివరిస్తున్న ఆ అద్భుతమైన ప్లాన్‌ను చెవులప్పగించి మరీ వినసాగారు జానీ, శంభుమిత్ర.

## 4

"నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ సేకరించిన ఈ అమూల్య ఆభరణాలను, పురావస్తు కళాఖండాల చట్టం (1972) క్రింద ప్రభుత్వ నిర్బంధంగా స్వాధీనం చేసుకోవడం. న్యాయశాస్త్రరీత్యా సమ్మతమే!"

——రిఫర్ చేస్తున్న లావుపాటి బౌండ్ బుక్‌లో నుండి

తల యెత్తి, ముక్కు మీదకు వాలుతున్న కళ్ళజోడును యెగదోసుకుంటూ అన్నాడు లాయర్ బలరామ్.

“అంటే....ఆ ఆభరణాలను వేలం వేసే అవకాశమే లేదంటారా....?” అసహనంగా అడిగాడు షేక్ ముస్తాఫా.

“బహుశ వుండకపోవచ్చు ముస్తాఫా! వారసుడైన నిజాంషాహీ కోర్టుకు అప్పీల్ చేసినా, కోర్టు తీర్పు కూడా బహుశ ప్రభుత్వానికి అనుకూలంగానే రావచ్చు.

197 లో సవరించబడ్డ పురావస్తు, కళాఖండాల చట్టం అలాంటిది.

అథవా....తీర్పు నిజాంకే అనుకూలంగా వచ్చి మళ్ళీ వేలం జరుగుతుందని ఆశిద్దామన్నా అది మళ్ళీ ఎప్పుడో మూడేళ్ళవాటికి కదా!”

అర్థంకానట్లు తనవంక చూస్తున్న షేక్‌ను చూసి చిన్నగా నవ్వాడు బలరామ్.

“ఇది ఇండియా ముస్తాఫా!

కోర్టులోని ఒక కేసు పరిష్కరింపబడాలంటే మా దేశంలో కనీసం మూడేళ్ళయినా పడుతుంది. అందుకే కోర్టు కెక్కినవాడూ, గాడిదెక్కినవాడూ ఒక్కటేనని మతిక సామెతను చెప్పుకుంటూంటారు ఇక్కడి ప్రజలు” గట్టిగా నవ్వుతూ అన్నాడతడు.

“త్రీ ...ఇయర్స్!” అంటూ అసహనంగా తల విదిల్చాడు ముస్తాఫా.

“ఇంతకూ ఆ అమూల్య ఆభరణాలలో మీరు దేనిని కొనాలనుకుంటున్నారు ముస్తాఫా?”

“జాకబ్ డైమండ్‌ను. అయినా ఏదయితేనేం

లేండి. చేతికి అందకపోయాక" నిరుత్సాహంగా అన్నాడు ముస్తాఫా.

"అరబ నిజాం ఆ వజ్రాన్ని ఆ రోజుల్లో 60 లక్షలకు కొన్నాడు. ఈ రోజులలో దాని విలువ సుమారు నాలుగు కోట్లు చేస్తుంది.

ఇప్పుడు చెప్పండి ముస్తాఫా! అమూల్యమైన ఆ వజ్రానికి మీ రెంత మూల్యం చెల్లించగలరు?"

—ముస్తాఫా ముఖంలోని భావాలను ఓరకంట గమనిస్తూ అడిగాడు బలరామ్.

"పుట్టని బిడ్డకు పేరు పెట్టినట్లు వేలం వేయని వజ్రానికి విలువ కట్టడం ఎందుకు భాయ్! అయినా అడిగారు కనుక చెబుతున్నాను. ఎంత ఖరీదయినా చెల్లించి, ఆ కేర్ డైమండ్‌ను నా స్వంతం చేసుకుందామను కొన్నాను.

... ఆఖరికి అయిదు కోట్లయినా సరే!"

ముస్తాఫా వంక ముచ్చటపడుతూ చూశాడు బలరామ్.

'కోట్లకొలదీ పెట్రోడాలర్లు అయాచితంగా వచ్చి పడే ఆ అరబ్ షేక్‌లకు డబ్బంటే కేర్ లేదని, తాము మెచ్చి, తమ మనసుకు నచ్చే వస్తువును స్వంతం చేసుకో డానికి ఎన్ని కోట్ల దీనారాలనయినా వెచ్చించడానికి వారు వెనుకంజవేయరని' అతనికి తెలుసు.

"దెన్ ఇట్స్ డన్ ముస్తాఫా!

ఇప్పటికీ మీ రా ధరను చెల్లించడానికి సిద్ధంగా వుంటే ఆ వజ్రం మీ స్వంతం అవుతుంది" కూల్‌గా అన్నాడు బలరామ్.

అతని మాటలకు ఉలిక్కిపడ్డాడు ముస్తాఫా! తన శ్రవణేంద్రియాలు తనను మోసం చేస్తున్నాయేమో నన్న

అనుమానం వచ్చింది అతనికి.

ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న జాకబ్ డైమండ్‌ను అంత ధీమాగా తెచ్చియిస్తానని అంటున్నాడంటే ఈ బలరామ్ సాధారణ లాయర్ అయివుండడు.

కాకుంటే ఎవరతడు?

అతనికి సడన్‌గా సూట్‌వాలా గుర్తుకు వచ్చాడు. ఆ రోజు ఉదయం....

ప్రభుత్వం నిజాం నగల విక్రయంపై పూర్తి నిషేధాన్ని ప్రకటించిందని తెలిసిన వెంటనే, నిరాశగా వెనక్కి మరలుతున్నాడతడు.

సుప్రీంకోర్టు ఆవరణలో ఓ మూల పార్క్ చేసివున్న తన మెర్సిడెజ్ బెంజ్ కారువైపు మెల్లగా కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్నాడతడు.

అంతలో ఒక సూట్‌వాలా అతడిని పలకరించాడు.

"అపురూపమయిన నిజాం నగలు మీ స్వంతం కావాలంటే, ఒక్కసారి ఈ ఎడ్రస్‌ను కాంటాక్టు చేయండి ప్లీజ్!" అంటూ అతని చేతికి ఒక విజిటింగ్ కార్డును యిచ్చాడు.

తెల్లని పాల తరకలాంటి విజిటింగ్ కార్డుపై తళ తళలాడుతున్న బంగారురంగు అక్షరాలు.

'లాయర్ బలరామ్'

ఆ పేరునూ, అందలి ఎడ్రస్‌నూ చదివాక 'ఈ లాయర్‌కూ, ఈ నిజాం నగలకూ సంబంధం ఏమిటని' ఆ సూట్‌వాలాను అడుగుదామనుకొని తల ఎత్తి చూశాడతడు.

కాని, అతడు కనిపించలేదు.

క్షణంలో ఎటో మటుమాయమైపోయాడా సూట్

వాలా. అతడు అసహనంగా చుట్టూ చూశాడు.

అతని మనసులో అతనికి తెలియకుండానే ఏదో ఆరాటం బయలుదేరింది.

కనులకు గంతలు కట్టి, వెనుక నుంచి వెన్ను తట్టి, పట్టుకు చిక్కక, చేతికి అందక అల్లరిగా చిందులేసే దొంగాటలోని చిలిపితనంలా....

తెలిసినట్లే తెలిసి, తెలియకుండా పోయే విషయాన్ని తెలుసుకుందామని మనసు పడే ఆత్రం అది.

ఆ ఆత్రంతోనే బలరామ్‌ను కలిశాడు. నిజాం నగల వేలానికి సంబంధించిన లీగల్ క్లూ ఏదో చెబుతాడు కామోసు ఆ లాయర్ అనుకున్నాడతడు.

కాని ఇదేమిటి యిలా....

ఆలోచనల్లో పడి కొట్టుకుపోతున్న ముస్తాఫాను చూసి చిన్నగా నవ్వాడు బలరామ్

ఢిల్లీలో మాఫియా రింగ్ లోని అతి కీలకమైన వ్యక్తులలో బలరామ్ ఒకడని- కాకలుతీరిన నేరస్థు లెందరో అతని కనుసన్నలలో నడుస్తూంటారని.... ఎక్కడో అరబ్ దేశాల నుండి వచ్చిన షేక్ ముస్తాఫాకేం తెలుసు.

అయితే ముస్తాఫాకు ఒక్కటి మాత్రం తెలుస్తూంది. 'వారు కోరిన మూల్యం చెల్లించగలిగితే అమూల్యమైన ఆ వజ్రం తన స్వంతం అవుతుంది. అదీ రాజమార్గంలో కాకుండా.... దొడ్డి దారిలో.'

అదే సమయంలో....

బూట్లను టకటక లాడించుకుంటూ ఆ గదిలోకి వచ్చాడొక యువకుడు. సన్నగా, శలాక లాగున్నాడు అతడు.

"రా! సలీమ్! రా! నీ కోసమే యెదురుచూస్తున్నాను...." అంటూ సాదరంగా ఆహ్వానించాడు బలరామ్.

ఆ యువకుని వంక ఆశ్చర్యంగా చూస్తూన్నాడు ముస్తాఫా. అతని వంక చూసి పలకరింపుగా నవ్వాడతడు.

సుప్రీంకోర్టు ఆవరణలో ముస్తాఫాను కలిసి, బలరామ్‌ను కలియమని సలహా యిచ్చిన సూట్‌వాలా ఎవరో కాదు సాక్షాత్ ఆ యువకుడే.

"బేరం సెటిల్ అయింది సలీమ్! రేపు రాత్రికి జాకబ్ డైమండ్‌ను నీవు ముస్తాఫాకు అందజేయాలి.

అన్నట్లు ముస్తాఫా! అడగటమే మరిచాను. ఇంతకూ ఆ వజ్రాన్ని మీకు ఎక్కడ అప్పగించాలి?"

బజార్లో పేవ్‌మెంట్ మీద దొరికే యే సో గాజు పాత్రను కొని, అందించాలన్నంత సులువుగా చెబుతున్న బలరామ్ వంక తెల్లబోతూ చూశాడు ముస్తాఫా.

"రేపు నవమి సలీమ్!

నవరాత్రి ఉత్సవాల్లో చివరి అంశమయిన నిమ్మజ్జనోత్సవం రేపే! నిమ్మజ్జనానికి ముందు దేవీ విగ్రహాన్ని వీధులలో ఊరేగిస్తారు మిగిలిన ప్రాంతాలను చుట్టి ఆ ఊరేగింపు మ్యూజియం రోడ్డులోకి వచ్చేసరికి రాత్రి పదకొండు గంటలు దాటుతుంది.

సరిగ్గా ఆ సమయానికి...."

బలరామ్ వివరిస్తు న్న ప్లాన్‌ను వింటూంటే ముస్తాఫా కర, చరణాలు కదలడం మానేశాయి. భయంతో అతని గొంతు ఎండిపోయింది.

అతడిని మరింతగా భయపెడుతున్నది వారి తెగువ!

'జరుపబోయే దోపిడీ గురించి పరాయి మనిషి సమక్షంలో....అంత నిర్భయంగా వారు మాట్లాడుకుంటున్నారంటే వారి తెగువ ఎంతటిదో సులువుగా అర్థం అవుతూంది అతనికి.

ఇక తాను పదవి విప్పలేడు. విప్పితే....! ఎప్పుడో ఎక్కడో విన్నాడతడు ఎవరి నోటనో....

తమకు ద్రోహం చేయటానికి ప్రయత్నించేవారికి మాఫియా విధించే శిక్షేమిటి!

అది: మరణశిక్ష!'

ఆ ఊహ రాగానే చిగురుటాకులా గజగజ వణికిపోయాడు ముస్తాఫా.

## 5

మహార్నవమి!

దేవీ నవరాత్రోత్సవాలలో చివరిఘట్టమైన నిమ్మజ్జనోత్సవం ప్రారంభమయింది.

పూలరథంలా అలంకరించబడిన మోటారు ఛాసీపై దేవీ విగ్రహాన్ని ఉంచారు. విద్యుద్దీపాల ధగధగలతో నింగి నుండి నేలకు దిగివచ్చిన పాలపుంతలా వెలిగిపోతూంది ఆ ఉత్సవ రథం.

త్రొక్కిసలాడుకుంటున్న వేల కొలది భక్తజన సందోహంతో ఊరేగింపు ప్రారంభమయింది.

ఓ ప్రక్క మంగళతూర్య నాదాలు, మరో ప్రక్క జానపద వాద్యాల ఘోష.

విచిత్రవేషాలూ, జానపద నాట్యాలు, సాము గరడీలు, నేలవేషాలూ, బల్లవేషాలూ, పులి ఆటలూ.... కన్నులపండుగగా వుంది ఆ ఊరేగింపు.

మరి కొద్ది నిముషాలలో ఆ ఊరేగింపు మ్యూజియం

రోడ్డును సమీపిస్తుంది అనగా.... ఆ రోడ్డులోనికి సర్రున దూసుకుంటూ వచ్చిందొక లేలెండ్ లారీ.

ఇద్దరు ఉత్సవ కార్యకర్తలు రోడ్డుకు అడ్డం పడుతూ, పరుగెత్తుకొని వెళ్ళి ఆ లారీని ఆపారు.

“ఏమిటి భాయ్?” తలను బైటకు పెడుతూ విసుగ్గా అడిగాడు ఆ లారీ డ్రయివర్.

“రాస్తా బంద్ భాయ్! దుర్గామాత ఊరేగింపు వస్తూంది. ఈ రూట్‌లో వాహనాలు పోవడానికి వీల్లేదు” అన్నాడొక వాలంటీర్.

దుర్గామాత పేరు వింటూనే, డ్రయివర్ ముఖంలోని విసుగు మంత్రించినట్లు మాయమైపోయింది. కన్నులు అరమోడ్చి, చేతులు పైకెత్తి, కనుపించని ఆ దుర్గామాతకు మనసులోనే నమస్కరించాడతడు.

లారీని రోడ్డుకు ప్రక్కగా తీసి పార్క్ చేశాడు. ఇంజన్‌ను ఆపి క్రిందకు దిగాడు. రోడ్డు అంచున వున్న డ్రయినేజీ రంధ్రానికి సరిగ్గా పైన ఆపబడివుంది ఆ లారీ.

పెద్ద వెదురుబుట్టనొకదాన్ని జాగ్రత్తగా కేబిన్‌లో నుండి క్రిందకు దించాడు ఆ లారీ క్లీనర్.

“మతాబాలు భాయి సాబ్! దుర్గామాత ప్రీతికోసం అందరం తలా ఒకటి ఆనందంగా కాల్చుదాం”—ఆ బుట్టవంక ఆశ్చర్యంగా చూస్తున్న వాలంటీర్లతో నవ్వుతూ అన్నాడా డ్రయివర్.

జాతరలలో అమ్మవారి గుడిముందూ, ఉత్సవ ఊరేగింపులలోనూ మందుగుండు కాలుస్తామని మ్రొక్కుకునే వారిని చాలామందిని చూశారు వారు. ఆ ఊరేగింపులో ఆ డ్రయివర్ లాంటి వారు కొన్ని వందలమంది రోడ్డు పొడుగునా మందుగుండు కాలుస్తూ తమ మ్రొక్కుబడు

లను తీసుకుంటారని వారికి తెలుసు.

అయితే, 'ఊరేగింపు ఆ గోడౌన్లో వస్తూందని కూడా తెలియని ఆ డ్రయివర్, మొక్కుబడిని తీర్చుకోవడానికి బుట్టలో మతాబులెందుకు తెచ్చి ఉంటాడని?' ఆలోచించలేకపోయారు వారు.

అతని వంక నవ్వుతూ చూసి "అచ్ఛా భాయి! వస్తా!" అంటూ ముందుకు నడిచారు వారు.

వారక్కడ నిలబడి మాట్లాడుకుంటూ ఉండగానే, లారీ కేబిన్ లోనుండి ఒక వ్యక్తి మెల్లగా క్రిందకు దిగి, చప్పుడు చేయకుండా పాములా ప్రాకుకుంటూ లారీ క్రిందకు పోయాడు.

వారు మరో పది అడుగులు ముందుకు పోగానే.... అటూ, ఇటూ ఒక్కసారి చూసి, తను కూడా చటుక్కున లారీ క్రిందకు దూరాడు ఆ లారీ క్లీనర్.

వాళ్ళ దగ్గరున్న బుట్టను చూస్తూ అసహనంగా దుబ్బుగా పెరిగిన గడ్డాన్ని బకురుకున్నాడు ఆ డ్రయివర్.

లారీ క్రింద....

డ్రయినేజీ రంధ్రానికి బిగించివున్న కప్పును ఊడదీసి, ఆ రంధ్రంగుండా లోనికి దిగాడు మొదటగా లారీ క్రిందకు చేరిన వ్యక్తి. అదే క్షణంలో ఆ లారీ క్లీనర్ కూడా ఆ రంధ్రాన్ని సమీపించాడు.

"కమాన్ శంభూ! క్విక్!" అన్నాడతడు లో గొంతుతో.

"ఒక్క నిముషం లాల్!" అంటూ ఆ క్లీనర్ కూడా ఆ డ్రయినేజ్ లోనికి దిగాడు.

లాల్ జేబులోనుండి పెన్ టార్చ్‌ను తీసి వెలిగిం

చాడు. క్లీనర్ వేషంలో ఉన్న శంభుమిత్ర చేతిలో చిన్న సైజు డ్రిల్లింగ్ మెషీన్ వుంది. గనులలో పని చేసే కార్మికులు గోడలకు రంధ్రాలు చేయడానికి ఉపయోగించే యంత్రం అది.

లాల్ టార్చి వెలుగును ముందుకు ఫోకస్ చేశాడు. పెద్ద భూ సొరంగంలా ఉంది ఆ డ్రయినేజీ. మోకాటిలోతువరకూ ఉంది అందులోని మురుగునీరు. చిక్కగా, జిడ్డుగా ఉన్న ఆ కుళ్ళు నీటిలో మెల్లగా అడుగులు వేసుకుంటూ ముందుకు నడిచారు వారు.

బురదతో కూడిన అడుసులో వారి పాదాలు దిగబడి పోతున్నాయి. భరించలేని దుర్గంధం వారి ముక్కుపుటాలకు సోకుతూ, కడుపులోని ప్రేవులను మెలి పెట్టసాగింది. ఈ క్షణమో, మరుక్షణమో వాంతి వచ్చేటట్టుంది వారి పరిస్థితి. 'ఝుం' అంటూ దోమలు ముసురుకుంటూ విసురుగా వారి ముఖాలను తాకుతున్నాయి.

అయినా....పళ్ళబిగువున ఆ నరకాన్ని భరిస్తూ....ముందుకు నడుస్తున్నారు వారు.

కొంతదూరం అలా నడిచాక, లాల్ ఆగి జేబులో నుండి ఒక ప్లాన కాగితాన్ని పైకితీశాడు. టార్చి లైట్ వెలుగులో దాని వంక పరీక్షగా చూశాడు. ప్లాన్‌ను మడిచి జేబులో పెట్టుకున్నాడు. మరో పది అడుగులు ముందుకు నడిచి ఆగాడు. అతని వెనకనే నడుచుకుంటూ వచ్చాడు శంభుమిత్ర.

"శంభూ! యిక ప్రారంభించు."

"డ్రెయినేజి పైభాగాన ఒక ప్రదేశాన్ని చూపుతూ అన్నాడు లాల్.

చేతిలోని డ్రిల్లింగ్ మెషిన్‌ను ఆన్ చేసి, డ్రయినేజి

ఉపరితలానికి అనించాడు శంభుమిత్ర. చిన్నగా శబ్దం చేస్తూ ఆ భాగాన్ని దొలవటం ప్రారంభించింది ఆ యంత్రం.

బయట....

లారీ ముందు డ్రయివర్ వేషంలో నిలబడ్డ జానీ అసహనంగా చుట్టూ చూశాడు.

గువ్వల్లా రివ్వుమంటూ నింగికి ఎగురుతున్న తారా జువ్వలు దోసిళ్ళతో వెలుగు పువ్వులను విరజిమ్ము తున్నాయి. టపాసుల శబ్దంతో ఆ ప్రదేశమంతా మారుమ్రోగిపోతూంది. ఊరేగింపు మెల్లగా ఆ వీధిలోనికి ప్రవేశించింది.

ఊరేగింపును చూసి తేలిగ్గా నిట్టూర్చాడు జానీ. వాళ్ళ దగ్గరున్న వెదురుబుట్ట మూతను ఊడదీశాడు. మతాబాలు, టపాసులు దాని నిండుగా నీట్ గా పేర్చ బడి వున్నాయి.

రెండు జెయింట్ సైజు సీమటపాకాయ గుత్తులను పైకితీసి పట్టుకున్నాడతడు. కర్ణభేరీలు పగిలేలా శబ్దం చేస్తూ, ఒక్కొక్కటి పదినిముషాలసేపు ఏకబిగిని ఆగ కుండా పేలే పటాసులవి.

వాటివంక నవ్వుతూ చూశాడతడు.

అయితే....ఆ లారీ ఆ వీధిలోనికి ప్రవేశించినప్పటి నుండి, తమ ప్రతి కదలికనూ వేయి కళ్ళతో ఒక వ్యక్తి గమనిస్తున్నాడని....అతనికి తెలియదు.

అందుకే అంత ధీమాగా నవ్వుకుంటున్నాడతడు.

ఆ వ్యక్తి....రోడ్డుప్రక్క నున్న పేవ్ మెంట్ పై చింకిగోనె పట్టాను పరచుకొని, పడుకున్న ఒక ముసలి భిక్షగాడు.

'లారీ క్రిందకు దూరిన ఆ పెద్దమనుషులు యిద్దరూ, సుమారు పది నిముషాలు కావస్తున్నా, బయటకు రాకుండా చేస్తున్న రాచకార్యమేమిటి? అనుకున్నాడా వృద్ధ భిక్షువు.

మెల్లగా పైకి లేచి గోనెపట్టాను చుట్టి, చేతికర్రను తాటించుకుంటూ ముందుకు నడిచాడు.

ఆ వీధిని విడిచి ప్రక్క వీధికి పోతున్నాడు గాబోలు ననుకుంటారు అతనిని చూస్తున్నవారు. సరిగ్గా జానీ కూడా అలాగే అనుకున్నాడు.

నూటిగా ఇరవై పజాల దూరం పోయాక నిదానంగా రోడ్డును క్రాస్ చేశాడా భిక్షుగాడు. మళ్ళీ వచ్చిన రోడ్డుగుండానే వెనక్కు మరలాడు.

అయితే ఒక్కచే లేడా! అంతకు క్రితం రోడ్డుకు కుడిప్రక్క నడిచాడు. ఇప్పుడు ఎడమప్రక్క నడుస్తున్నాడు. జానీవాళ్ళు వచ్చిన లారీ, రోడ్డుకు యెడమవైపునే ఆపబడి వుంది.

ఆ భిక్షగానికీ, తనకూ మధ్య లారీ అడ్డుగా వుండటం వలన, వెనక్కు తిరిగివస్తున్న ఆ భిక్షగాడిను గమనించలేదు జానీ.

లారీని సమీపించాడు ఆ భిక్షగాడు. అటూ, ఇటూ చూసి ఛటుక్కున లారీ క్రిందకు దూరాడు.

కాని, ఆ లారీ క్రింద యెవరూ లేకపోయేసరికి ఆశ్చర్యపోయాడతడు.

"ఏమయ్యారు వీరిద్దరూ?

తను చూస్తూనే ఉన్నాడు. లారీ క్రిందకు దూరాక వారు బయటకు రాలేదు. మరెలా మాయమైపోయారు

వారు?"

అసహనంగా తల విదిలిస్తూ, మరి కాస్త లోపలకు ప్రాకుకుంటూ పోయాడతడు.

మూడడుగులు ముందుకు వెళ్ళగానే అతని మనసును ఆవరించిన అనుమానం మంచులా విడిపోయింది. ఎదురుగా తెరచి ఉన్న డ్రయినేజీ రంధ్రాన్ని చూసేసరికి వారిద్దరూ ఎలా మాయమైపోయారో అర్థం అయింది అతనికి.

అయితే దుర్గంధ భూయిష్టమైన ఆ మురికి కూపంలోకి వారెందుకు దిగారో అర్థంకాలేదు అతనికి.

ఆ రంధ్రం వంకే చూస్తూ తీవ్రంగా ఆలోచించసాగాడు. సరిగ్గా రెండు నిముషాల తరువాత అతని మెదడులో మెరిసినట్లనిపించింది.

భూగర్భంగుండా పోయే ఆ డ్రయినేజీ మార్గం యే దిక్కులో పోతూందో గుర్తుకు వచ్చేసరికి అతని ముఖం మ్లానమయింది.

ఆ డ్రయినేజ్ సరిగ్గా మ్యూజియం భవనం క్రింద నుండే పోతుంది.

'అంటే ఆ మురుగు కాలువద్వారా మ్యూజియం లోనికి ప్రవేశించడానికి ప్రయత్నిస్తున్నారా వారు?

ఆ ఆలోచన వచ్చాక ఒక్క క్షణం కూడా తాత్సారం చేయలేదతడు. వచ్చినంత వేగంగానే ఆ ప్రదేశాన్ని వీడి వెళ్ళిపోయాడతడు.

మ్యూజియమ్ రోడ్‌ను దాటి, ప్రక్క వీధిలోనికి వస్తే యెదురుగా సాక్షాత్కరిస్తుందొక పెద్ద పార్క్. రాత్రి పదకొండు గంటలు దాటటం వలన నిర్మానుష్యంగా ఉంది ఆ పార్క్. సూటిగా ఆ పార్క్‌లోకి నడిచాడు ఆ బిక్షగాడు.

గుబురుగా వున్న ఒక పొద చాటుకు పోయాడతడు. చుట్టూ ఒకసారి కలియజూసి, ఆ చుట్టుప్రక్కల ఎవరూ లేరని ధృవపరచుకున్నాక, జోలెలోనుండి ఒక వస్తువును పైకి తీశాడు.

అది.... అరచేతిలో ఇమిడే మినీ వైర్‌లెస్ సెట్. దానికున్న చిన్న బటన్‌ను నొక్కగానే బీప్.... బీప్... మంటూ చిన్నగా శబ్దం చేయసాగిందది.

# 6

కొన్ని గంటలు వెనక్కు వెళ్ళితే!

ఆ రోజు ఉదయం....

ఢిల్లీ కమీషనర్ ఆఫ్ పోలీస్ కార్యాలయంలో.

ఎదురుగా కుర్చీలలో కూర్చున్న పోలీస్ ఆఫీసర్ల వంక సాలోచనగా చూశాడు. పోలీస్ కమీషనర్. ఒక్కసారి చిన్నగా దగ్గి గొంతును సవరించుకున్నాడు.

"డియర్ ఆఫీసర్స్!

ఉపోద్ఘాతాలు లేకుండా సూటిగా అసలు విషయానికి వస్తాను.

అమూల్యమైన నిజాం నగల అమ్మకాన్ని నిషేధించింది మన ప్రభుత్వం! ఎంత ధరనైనా చెల్లించి, వేలం పాటలో వాటిని తమ స్వంతం చేసుకోవాలని ఆశించిన కొందరో బడా శేక్‌లకూ అరబ్ షేక్‌లకూ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం గొడ్డలి పెట్టు అయింది.

అలా అని, వారు చేతులు ముడుచుకు కూర్చుంటారని నేను అనుకోను. న్యాయబద్ధంగా వీలుకాకుంటే, అన్యాయంగానైనా అపురూపమైన ఆ నగలను పొందడానికి ప్రయత్నిస్తారు వారు.

దొంగలను శేక్‌లే కాంటాక్టు చేసి వుంటారో, లేక

షేక్‌లను దొంగలే కాంట్రాక్ట చేసి వుంటారా! ఏది యేమయినా, నా అంచనా తప్పుకాకుంటే....

చాందినీ చౌక్ రోడ్డులోనున్న మ్యూజియంకు కన్నం వేసి, ఆ నగలను కొట్టేయడానికి, ఈసరికే ఢిల్లీలోని గజదొంగలంతా కలలుకని వుంటారు.

ఆ అనుమానంతోనే ఢిల్లీలోని అన్ని పెద్ద హోటల్స్ పైనా నిఘావేసి వుంచారు మన పోలీసులు. అయితే ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే....

కరెన్సీ నోట్లను చిత్తుకాగితాల్లా ఖర్చుచేస్తూ, స్టార్ హోటల్స్‌లో విలాసంగా గడిపే నొటోరియస్ క్రిమినల్స్, మాఫియా ముఠా సభ్యులు... ఒక్కరు, ఒక్కరంటే ఒక్కడు కూడా ఆ హోటల్స్‌లో కనిపించటం లేదు.

నిన్న రాత్రినుండి మంత్రం వేసినట్లు మాయమై పోయారు వారంతా? ఏమైపోయారు? ఎక్కడకు పోయారు వారంతా?

తుఫాన్‌కు ముందు సముద్రంలో ఏర్పడే ప్రశాంతత లాంటి పరిస్థితి ప్రస్తుతం ఢిల్లీనగరంలో నెలకొని వుంది.

సంథింగ్ ఈజ్ రాంగ్ సమ్‌వేర్!

ఎక్కడో, ఏదో జరుగబోతూంది. ప్రస్తుతానికి మన కళ్ళ యెదురుగా కన్పిస్తున్నవి మాత్రం మ్యూజియంలో నున్న నిజాం నగలు!

అదీగాక చాందినీ చౌక్ ఏరియా ప్రజలు నిర్వహిస్తున్న దేవీ నిమజ్జనోత్సవం, ఈ రోజు రాత్రి పదకొండు గంటల ప్రాంతంలో....సరిగ్గా మ్యూజియం వీధిలో నుండే పాస్ అవుతుంది.

సో! బీ ఎలర్టు మైడియర్ ఆఫీసర్స్! ముఖ్యంగా

మ్యూజియం ఏరియాను వెయ్యి కళ్ళతో వాచ్ చేయండి"
చెప్పటం ఆపాడు పోలీస్ కమీషనర్.

ఫార్మల్ గా తీసుకోవాల్సిన జాగ్రత్తల గూర్చి మరి కొద్ది నిమిషాలసేపు డిస్కస్ చేశాక, కమీషనర్ కు సెల్యూట్ చేస్తూ ఆ గదిలోనుండి నిష్క్రమించారు ఆ ఆఫీసర్లు.

అంతవరకూ ప్రక్క గదిలో కూర్చుని, వారి మధ్య నడిచిన సంభాషణంతా శ్రద్ధగా ఆలకిస్తున్న ఒక యువకుడు స్వింగ్ డోర్స్ ను తెరుచుకుంటూ ఆ గదిలోనికి అడుగు పెట్టాడు.

అతని వంక ప్రసన్నంగా చూశాడు కమీషనర్.
"రా! రాంకుమార్! రా! కూర్చో!" అంటూ సాదరంగా ఆహ్వానించా డతడు.

కుర్చీలో రిలాక్స్డ్ గా సెటిల్ అయ్యాక,
"మీ మాటలన్నీ విన్నాను కమీషనర్ సాబ్! కాని మ్యూజియం సెక్యూరిటీలాంటి ఇంత చిన్న విషయం కోసం మీరు సి. బి. ఐ. ను కాంటాక్ట్ చేసి వుంటారని నేననుకోను.

మీరు యింతకు క్రితం చెప్పినట్లు....
సంథింగ్ ఈజ్ రాంగ్ సమ్ వేర్! ఎక్కడో, ఏదో జరుగబోతూంది.

నా అంచనా తప్పుకాకుంటే యూ గాట్ దట్ ఫ్లూ! చెప్పండి కమీషనర్ సాబ్!

మీ డిపార్టుమెంట్ అధికార్లకు కూడా చెప్పకూడని ఆ రహస్యం ఏమిటి? ఇంత అర్ధంతరంగా యెందుకు నన్ను పిలిపించినట్లు?" కూల్ గా అడిగాడు రాంకుమార్.

అతని తార్కిక జ్ఞానానికి ఆశ్చర్యపోయాడు కమీ

మనర్. ఆనతికాలంలోనే సి.బి.ఐ.లో స్టార్ ఏజెంట్‌గా రాంకుమార్ ఎందుకు పేరు తెచ్చుకున్నాడో అప్పుడు అర్థం అయింది అతనికి.

ఒక్కసారి చిన్నగా నిట్టూర్చి చెప్పటం ప్రారంభించాడతడు.

"రాంకుమార్!

మీకు తెలిసే వుంటుంది. ఈమధ్య ఢిల్లీలో హెరాయిన్, ఎల్.ఎస్.డీ. లాంటి మాదక ద్రవ్యాల బెడద యెక్కువగా వుంది. ఎన్ని జాగ్రత్తలు తీసుకుంటున్నా ఆ మత్తుపదార్థాల రవాణాను అరికట్టలేక పోతున్నాం.

చివరకు ఈ మాదక ద్రవ్యాల చలామణిని అరికట్టేందుకు ఒక స్పెషల్ స్క్వాడ్‌ను నియమించటం జరిగింది.

ఢిల్లీ మాఫియా రింగ్‌లోని ఒక మూల స్తంభంగా అనుమానింపబడుతున్న బలరామ్ ఈ మాదక ద్రవ్యాల రవాణాలో ముఖ్య పాత్రధారి అని వారి పరిశోధనలో తేలింది.

అనుమానంపై అరెస్టు చేయడానికి బలరామ్ సామాన్యుడు కాదు. కోటీశ్వరుడు. నగరంలో పేరుపొందిన క్రిమినల్ లాయర్. గొప్పగొప్ప రాజకీయ నాయకులతో సన్నిహిత సంబంధాలున్న వ్యక్తి. అలాంటివానిపై తగిన సాక్ష్యాధారాలు లేకుండా రెయిడ్ చేస్తే అభాసు పాలవుతాం.

ఇక, పరిశోధనలో తేలిన రెండో విషయం:

సుమారు నూటికోట్ల రూపాయల విలువ చేసే మాదక ద్రవ్యాలు రెండురోజుల క్రితమే ఢిల్లీకి రహస్యంగా దిగుమతి అయ్యాయి. ఈ రోజో, రేపో అవి మిగిలిన

ప్రాంతాలకు పంపిణీ చేయబడతాయి.

అయితే, ఎంత ప్రయత్నించినా, ఆ మాదక ద్రవ్యాలు దాచబడ్డ స్థలాన్ని మాత్రం కనిపెట్టలేక పోయారు మావాళ్ళు.

ఏం చేయాలో తోచక ఈ రోజులాగానే ఢిల్లీలోని పోలీస్ అధికారుల నందరినీ పిలిచి, ఈ సిట్యుయేషన్‌ను ఎలా టాకిల్ చేయాలా అని డిస్కస్ చేస్తున్నాం"—

అంతలో మమ్మల్ని డిస్టర్బ్ చేస్తూ, నా టేబిల్ పైనున్న రెడ్ టెలిఫోన్ మ్రోగింది.

ఈ సమావేశం పూర్తయినంత వరకూ, నన్ను డిస్టర్బ్ చేయకుండా, నాకు వచ్చే ఫోన్ కాల్స్ అన్నింటికీ తననే ఎటెండ్ కమ్మని నా సెక్రటరీకి ఆదేశించాను నేను.

'నా ఆదేశాన్ని అతిక్రమించి మరీ, ఈ కాల్ నాకు డైరెక్టు చేయబడిందంటే, అదేదో అత్యవసరమైన మెసేజ్ అయి ఉంటుంది' అనుకుంటూ రిసీవర్‌ను ఎత్తాను నేను.

పాలం ఎయిర్ పోర్టు ఏరియాలోని ఇన్‌స్పెక్టర్ సంతోష్ దగ్గరనుండి వచ్చిన ఫోన్ కాల్ అది.

'ఢిల్లీ నగర శివార్లలో నున్న ఒక పాత గోడౌన్‌లో ఆ మాదక ద్రవ్యాలున్నట్లు తాను కనుగొన్నాననీ, మమ్మల్ని వెంటనే బయలుదేరి అక్కడకు రమ్మనీ, అంత వరకూ తాను అక్కడే వుండి, వాచ్ చేస్తుంటాననీ' చెప్పాడు ఇన్‌స్పెక్టర్ సంతోష్.

జరిగిన విషయాన్ని ఆ అధికారులకు వివరించాను నేను. బలగంతో వెంటనే బయలుదేరి సంతోష్ చెప్పిన స్పాట్‌కు చేరుకున్నాను.

కాని ఆశ్చర్యం!

అక్కడ ఖాళీగా వున్న గోడౌన్ సాక్షాత్కరించింది నాముందు. ఓ మూల రక్తపు మడుగు మధ్య విగతజీవుడై పడివున్నాడు ఇన్‌స్పెక్టర్ సంతోష్.

'తన వెనుక బలగం ఏమీ లేదని తాను ఒంటరిగానే, ఒక వ్యక్తిని వెన్నాడుతూ ఆ ప్రదేశానికి చేరుకున్నానని' నాతో ఫోన్‌లో చెప్పాడు సంతోష్.

మేము వచ్చేటంత వరకూ తొందరపడి వారిని ఎదుర్కొనడానికి ప్రయత్నించవద్దని హెచ్చరించాను నేను.

నా హెచ్చరికను పాటించి, అతడెక్కడో దాక్కొనే ఉండి. వుంటాడు. మరి. దాక్కున్న అతనిని శత్రువులు వెతికి మరీ ఎలా పట్టుకోగల్గారు?

అసలు అతడి గురించి వెతకాల్సిన అవసరం వారికేం వచ్చింది? అతడక్కడ దాక్కున్నట్లు వారికి తెలిసి ఉండాలి.

పోనీ, యింకో రకంగా ఆలోచిస్తే....

ఏదో ఏక్సిడెంటల్‌గా వారి దృష్టిలోపడ్డ సంతోష్‌ను వారు అంత మొందించారే అనుకుందాం.

కాని, ఇంత అర్థాంతరంగా, కేవలం కొన్ని నిముషాలలో హడావుడిగా ఆ గోడౌను ఖాళీచేసి వెళ్ళిపోవాల్సిన అవసరం వారికేం వచ్చింది?

ఇట్ మీన్స్ దె స్మెల్ట్ ద డేంజర్!

అంటే, పోలీసులు ఆ గోడౌన్‌పై రెయిడ్ చేయబోతున్నట్లు వారికి తెలిసి వుండాలి.

ఎలా తెలుస్తుంది?

నాకూ, సంతోష్‌కూ, నా గదిలోనున్న పోలీస్ అధికారులకూ తప్ప ఇతరులకు ఈ రెయిడ్ గురించి తెలిసే

అవకాశం లేదు.

అంత కాన్ఫిడెన్షియల్ గా, కేవలం కొద్ది నిముషాలలో నిర్ణయం తీసుకొని, చేసిన రెయిడ్ గురించి కూడా, శతృవులు తెలుసుకోగల్గారు అంటే... ఖచ్చితంగా మాలోనే ఎవరో శతృవుల ఇన్ ఫార్మర్ ఉండి తీరాలి.

మాలో యెవరిని నమ్మాలో యెవరిని నమ్మకూడదో తెలియని పరిస్థితి

ఈ స్థితిలో యేం చేయాలో తోచక, మా బాస్ కరుణాకర్ ను కాంటాక్ట్ చేశాను" చెప్పటం ఆపి ముఖానికి పట్టిన చెమటను తుడుచుకున్నాడు కమీషనర్.

"ఇంతకూ... నూరుకోట్లు విలువ చేసే ఆ మాదక ద్రవ్యాలు యేమయినట్లు? యెక్కడ వున్నట్లు?" తనకు తానే ప్రశ్నించుకున్నట్లు సాలోచనగా అన్నాడు రాంకుమార్.

నవ్వుతూ భుజాలను ఎగురవేశాడు కమీషనర్. 'అదే తెలిస్తే ఈ బాధంతా యెందుకు?' అన్నట్లుంది అతని నవ్వు.

"ఒక్క విషయం మాత్రం ఖచ్చితంగా చెప్పగలను రాంకుమార్.

ఆ మాదక ద్రవ్యాలు ఢిల్లీ సిటీని మాత్రం దాటి బయటకు పోలేదు. ఢిల్లీ బార్డర్స్ నన్నింటినీ వేయి కళ్ళతో పెట్రోల్ చేస్తున్నారు మా వాళ్ళు.

సిటీలోపల కూడా...

అనుమానం వున్న సెంటర్స్ లోనూ, గల్లీలోనూ గట్టి నిఘా యేర్పాటు చేశాం. హెరాయిన్ లాంటి మత్తు పదార్థాలు సేవించిన వ్యక్తులను కస్టడీలోకి తీసుకొని, వారికి మాదక ద్రవ్యాలు యెలా లభించాయో ఆరాలు తీయ

మని అన్ని స్టేషన్స్‌కు స్ట్రిక్టు ఆర్డర్స్ జారీ చేశాం.

స్టిల్ వాట్ ఎల్స్ యూ ఎక్స్‌పెక్టు ఫ్రం మి?" ఉద్వేగపూరితమైన కంఠంతో అన్నాడు కమీషనర్.

'నిజమే! యెవరు కూడా అంతకన్నా యేమీ చేయలేరు.

అన్ని కట్టుదిట్టాలు చేసినా, అంత అష్ట దిగ్బంధనం గావించినా, యింకా నేరస్థులు హాయిగా తమ కార్యకలాపాలను కొనసాగిస్తున్నారంటే అది అతని తప్పు కాదు___'

ఒక క్షణం తరువాత ఆలోచనల్లో నుండి తేరుకొని, "వెల్ సర్! ఆ గోడౌన్‌లో అనుమానించదగ్గ ఆధారాలేం లభ్యం కాలేదా?" సూటిగా కమీషనర్ కళ్ళలోకి చూస్తూ అడిగాడు రాంకుమార్.

లేదన్నట్లు తలాడించాడు కమీషనర్.

"కాని, ఇన్‌స్పెక్టర్ సంతోష్ శవం ప్రక్క నేల మీద మూడు అక్షరాలు కనిపించాయి. కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతూ, అతి కష్టంమీద వ్రాయబడినట్లు వంకర టింకరలతో అలికినట్లున్నాయి___ఆ రక్తాక్షరాలు.

అతని శవం పడివున్న భంగిమను బట్టి. అతని కుడిచేతి చూపుడు వ్రేలుకు అంటిన రక్తాన్నిబట్టి, వాటిని వ్రాసింది అతడేనని స్పష్టంగా తెలుస్తోంది."

"ఏమిటా అక్షరాలు కమీషనర్ సాబ్!"

"న....వ....మి....!" ఒక్కొక్క అక్షరాన్ని ఒత్తి పలుకుతూ అన్నాడతడు.

"నవమి" మెల్లగా ఆ అక్షరాలను మననం చేసుకుంటూ వాటిలో దాగివున్న క్లూ ఏమిటా అని ఆలో

చించసాగాడు రాంకుమార్.

“యస్....నవమి!

ఈ రోజు నవమి, మహర్నవమి. ఈ రోజును దృష్టిలో వుంచుకొనే అతడు ఆ అక్షరాలను వ్రాసి వుంటాడని భావిస్తున్నాను నేను. అందుకే ఈ రోజు, యెక్కడో యేదో జరగబోతోందని నా అనుమానం!....”

—ఒక గొప్ప రహస్యాన్ని ఛేదించినట్లు వెలిగిపోతున్న ముఖంతో అన్నాడు కమీషనర్.

కాదన్నట్లు అడ్డంగా తలాడించాడు రాంకుమార్.

“కేవలం ఈ రోజు యెక్కడో యేదో జరగబోతూందని చెప్పడం పెద్ద ఇన్ఫర్మేషనేం కాదు.

తన ఆఖరిక్షణాలలో కూడా అంత కష్టపడి, ఆ అక్షరాలను వ్రాశాడంటే, వాటిద్వారా అతడు చెప్పదల్చుకున్నది అంత చిన్న 'క్లూ' అయివుండదు.

ఇంకేదో వుంది.

అదీగాక, ఈ రోజు యేదో జరగబోతూందని చెప్పాలంటే, ఈ రోజు తేదీ వ్రాస్తారు. లేదా, సోమవారం అనో, మంగళవారం అనో వారం పేరు వ్రాస్తారు. అంతేగాని....'నవమి, దశమి' అంటూ తిథుల పేర్లు వ్రాయరు కదా!”

అతని లాజిక్‌కు ముగ్ధుడవుతూ అతనివంక మెచ్చుకోలుగా చూశాడు కమీషనర్.

ఒక క్షణం ఆగి మళ్ళీ చెప్పటం ప్రారంభించాడు రాంకుమార్.

“నూరు కోట్ల రూపాయల విలువచేసే మాదకద్రవ్యాలు ఢిల్లీలోకి దిగుమతి అయినట్లు మనకు తెలుసు

అవి ఈ రోజో, రేపో మిగిలిన ప్రాంతాలకు పంపిణీ చేయబడతాయి అని కూడా మనకు తెలుసు.

కాని, మనకు తెలియందల్లా....

అవి యెప్పుడు, యెక్కడ, యెలా పంపిణీ చేయబడతాయనేదీ!

ఇన్‌స్పెక్టర్ సంతోష్ పెన్నాడిందీ, పొంచి వుండి గమనించిందీ, ఆ మాదకద్రవ్యాల ముఠానే! చనిపోయే నాటికి, అతడు డీల్ చేస్తున్నది ఆ ఎసైన్‌మెంట్‌నే.

ఫోన్‌లో అతడు మీతో మాట్లాడిన దానిని బట్టి, ఆ మాదక ద్రవ్యాలు యింకా పంపిణీ చేయబడలేదు, దెంర్ స్టిల్ స్టోర్డ్ ఇన్ గోడౌన్.

సో! అతడు చెప్పదలుచుకున్నది ఖచ్చితంగా ఆ మాదకద్రవ్యాల గురించే అయివుంటుంది. అవి ఎప్పుడు, ఎక్కడ పంపిణీ చేయబడతాయో శత్రువుల మాటల ద్వారా అతడు గ్రహించి వుంటాడు. ఆ రహస్యాన్నే చిన్న 'క్లూ' ద్వారా మనకు చెప్పటానికి ప్రయత్నించాడు.

అతడిచ్చిన క్లూ....'నవమి!'

మీ రన్నట్లు యీ రోజు నవమి....మహర్నవమి! మ... హా....ర్న....వ....మి!"

—అక్షరాలను గుణించుకుంటూ ఆలోచిస్తున్న రాంకుమార్ మెదడులో యేదో మెరిసినట్లయింది. ట్యూబ్‌లైట్‌లా వెలిగిపోయింది అతని ముఖం.

"మహర్నవమి అంటే.... దేవీ నవరాత్రి ఉత్సవాల్లో చివరిదినం. నిమజ్జనోత్సవం జరిగే రోజు.

కమీషనర్ సాబ్!

తెలిసిపోయింది. ఆ మాదకద్రవ్యాల పంపిణీ....నవమి

వాడు. అంటే ఈ రోజు దేవీ నిమజ్జన ఉత్సవంలో జరగబోతూంది."

అతనివంక తెల్లబోతూ చూశాడు కమీషనర్. పోలీస్ శాఖకూ, ఇంటలిజన్స్ శాఖలకూ మధ్య, ఆలోచించే విధానంలో యెంత తేడా వుంటుందో ఆ క్షణంలో స్పష్టంగా తెలిసింద అతనికి.

నిమజ్జనోత్సవం అనగానే చాందినీచౌక్ ఏరియాలోని మ్యూజియంరోడ్ గుర్తుకు వచ్చింది వారిద్దరికీ.

మ్యూజియం రోడ్డు అనగానే, నిజాం నగలు గుర్తుకు వచ్చాయి.

మరో అయిదు నిముషాలసేపు యేదో దీర్ఘంగా చర్చించుకున్నారు వారు.

"సో! వస్తాను కమీషనర్ సాబ్!

మీరు అనుక్షణం అప్రమత్తంగా వుండాలి. గుర్తుందిగా మన కోడ్ ....ఈగల్!"

కుర్చీలో నుండి లేచి నిలబడి నవ్వుతూ కమీషనర్ తో కరచాలనం చేస్తూ అన్నాడు రాంకుమార్.

ఆకాశంలో చక్కర్లు కొడుతూ కూడా, భూమిమీద దాక్కున్న తమ ఎరలను గుర్తుపట్టి రివ్వున మూసుకు వచ్చి, క్షణంలో ఎగురవేసుకుపోతాయి ఈగల్స్!

ఠీవిగా నడుచుకుంటూ పోతున్న రాంకుమార్ ను చూస్తూంటే....ఆ ఈగిలే గుర్తుకు వచ్చింది కమీషనర్ కు.

## 7

"ఊరేగింపు వచ్చేస్తుంది!" స్వగతంలో అనుకున్నట్లు మెల్లగా అన్నాడు సలీమ్.

"మనవాళ్ళంతా సిద్ధంగా వున్నారు బాస్!"

మ్యూజియంరోడ్డులోకి అప్పుడే ప్రవేశించిన ఉత్సవ

జనసందోహాన్ని చూస్తూ అన్నాడు సలీం ప్రక్కనే నిల బడ్డ వ్యక్తి.

క్రిక్కిరిసి వున్న భక్తజనుల మధ్య కలిసిపోయి, అమాయకుల్లా నడుస్తోన్న తన సహచరుల వంక తృప్తిగా చూశాడు సలీమ్.

పురావస్తుశాఖ మ్యూజియమ్‌కు వెనుకవైపు నున్న రెండంతస్తుల భవంతిలోని ఒక గదిలో కిటికీ ప్రక్కన నిలుచుని వున్నారు వారు.

అతని చేతిలో టెలిస్కోపిక్ గన్ వుంది. దానికి సైలన్సర్ బిగించబడి వుంది. మ్యూజియం పైనున్న టవర్‌లో పహారా తిరుగుతున్న ఇద్దరు గార్డ్సువంక తదేకంగా చూస్తున్నాడతడు.

తలలు నరికే ముందు, గొర్రెలవంక కసాయివాడు చూసే చూపది.

ఆ రెండవ వ్యక్తి మెల్లగా కిటికీలో నుండి బయటకు వచ్చి, టెర్రస్ పై జాగ్రత్తగా నడుచుకుంటూ, ఆ బిల్డింగ్ అంచుకు చేరుకున్నాడు.

ఆ భవనం గోడప్రక్కనే వుందొక ఎలక్ట్రిక్ పోల్ — ఇప్పుడు అతడు సరిగ్గా చేయి చాస్తే అందేంత దూరంలో.

అతని చేతులకు రబ్బర్ గ్లోవ్స్ తొడుక్కున్నాడు. అతని కాళ్ళకు రబ్బరు బూట్లు వున్నాయి. జేబులో నుండి పట్టకారు వంటి సాధనాన్ని పైకి తీశాడతడు.

ఎటువంటి లోహంతో తయారుకాబడ్డ వైరు నయినా అవలీలగా క్షణంలో కత్తిరించగల కటింగ్ ప్లేయర్ అది.

ఆ విద్యుత్ తీగలవంక ఆకలిగా చూశాడతడు. వాటిని కత్తిరించిన మరుక్షణం.... మ్యూజియంతో సహా ఆ వీధి

అంతా అంధకార బంధురమయిపోతుందని అతనికి తెలుసు.

అక్కడ....వీధిలో....

అట్టహాసంగా ప్రవేశించిన ఊరేగింపును చూసి, ఒక్కసారి చేతికున్న వాచీవంక చూసుకున్నాడు డ్రయివర్ వేషంలో ఉన్న జానీ.

"యస్! ఇట్స్ ద టైమ్!" అనుకున్నాడు అతడు.... చేతిలోని టపాసులను ముట్టించడానికి ఉద్యుక్తుడవుతూ....

అతని ముందున్న బుట్టలోని మందుగుండు సామగ్రిని చూస్తూనే, తాయిలం కోసం ఎగబడే పిల్లల్లా ఆ బుట్ట మీద పడ్డారు కుర్రకారు.

మతాబాల వెలుగులతోనూ, టపాసుల ధ్వనులతోనూ ఆ వీధి మారుమ్రోగిపోయింది.

క్రింద....డ్రయినేజ్‌లో—

డ్రిల్ చేయగలిగినంత మేరా భూమికి రంధ్రం చేసి, ఆ పైన డ్రిల్లింగ్ సాధ్యంకాక....ఆ రంధ్రంలో చిన్న సైజు బాంబు నొకదాన్ని ఫిట్ చేసి వుంచారు లాల్, శంభుమిత్ర.

బయట నుండి టపాసుల శబ్దం వినిపించగానే ఆ బాంబు వత్తిని ముట్టించారు.

వారికి తెలుసు....వీధి బయట ప్రేలుతున్న టపాసుల శబ్దంలో యీ బాంబు శబ్దం కలిసిపోతుందని.... ముఖ్యంగా జానీ కాల్చే ఆ రెండు పెద్ద సీమటపాసుల శబ్దంలో!

రెండు చెవులనూ మూసుకుంటూ కొంతదూరం ముందుకు పరుగెత్తుకుపోయారు వారు.

సరిగ్గా ముట్టించిన ముప్ఫయి సెకనుల తరువాత కర్ణ భేరీలు బ్రద్దలయ్యేలా శబ్దం చేస్తూ ప్రేలిందా బాంబు.

పెద్ద పెద్ద పెచ్చులు ఊడి డ్రయినేజ్ లో పడ్డాయి. నేల విచ్చుకొని పెద్ద రంధ్రం ఏర్పడింది. భూగర్భం నుండి మ్యూజియం భవనంలోకి మరో సొరంగ మార్గం తయారయ్యింది.

విప్పారిన ముఖాలతో ఆ సొరంగ మార్గం వంక చూశారు వారు.

అదే సమయంలో ....

ఒక్క క్షణంలో ....ఎలక్ట్రిక్ పోల్ మన్న వైర్లను కత్తిరించాడు.... టెర్రస్ పై నిలబడ్డ ఆ వ్యక్తి.

ఒక్కసారిగా ఆ ప్రదేశాన్ని అంధకారం అలుము కుంది. అదే క్షణంలో సలీమ్ చేతిలో నున్న టెలిస్కోప్ రైఫిల్ సైలెంట్ గా రెండుసార్లు మ్రోగింది.

రెండు కిలోమీటర్ల దూరంలో నున్న టార్గెట్ ను సైతం ఖచ్చితంగా ఛేదించగల శక్తివంతమైన రైఫిల్ అది. దాని గురించి చెప్పే ప్రసక్తే లేదు.

ఒక గార్డు నుదుటిలో నుండి దూసుకుపోయిందొక గుండు. మరో గార్డు గొంతును చిన్నాభిన్నం చేసింది మరో గుండు. అంతే! విగతజీవులై నేల వ్రాలిపోయారు వారు.

మరుక్షణం కిటికీలో నుండి బయటకు వచ్చి టెర్రస్ మీదుగుండా మేడ అంచుకు చేరుకున్నాడు సలీమ్.

పాకెట్ లో నుండి చిన్న హుక్ లాంటి పరికరాన్ని పైకి తీశాడు. ఎస్ ఆకారంలో వుంది అది. వంకీ తిరిగిన దాని క్రింది కొనక్కునికి అరంగుళాల పొడవున్న లెదర్ బెల్టు ఫిక్స్ చేయబడి వుంది.

బస్సుల్లో నిల్చున్న ప్రయాణీకులు పట్టుకోవడానికి వీలుగా పైనున్న ఐరన్ రాడ్స్‌కు వ్రేలాడుతుంటాయి అలాంటి బెల్టులు.

అతడు చేతులకు రబ్బర్ గ్లౌస్ తొడుక్కున్నాడు. అతని వీపుపై టెలిస్కోప్ గన్ వ్రేలాడు తూంది. ఎలక్ట్రిక్ పోల్ వంక పరీక్షగా చూశాడతడు.

ఆ పోల్ నుండి మ్యూజియం టవర్ పైకి పోతున్న దొంగ ఎలక్ట్రిక్ వైర్. కొద్ది క్షణాల క్రితంవరకూ ఆ పోల్ నుండి మ్యూజియంకు విద్యుత్‌ను సరఫరా చేసిన తీగ అది. ఎలక్ట్రిక్ కనెక్షన్‌ను తప్పించివేయటం వలన.... ఇప్పుడది సాధారణ లోహపు తీగ మాత్రమే!

ఆ తీగను పట్టుకొని బలంగా లాగి చూశాడు. రెండు కాళ్ళనూ పైకెత్తి వ్రేలాడి చూశాడు.

"నో ప్రాబ్లమ్! ఇట్స్ ఓ.కే!" సంతృప్తిగా తలాడిస్తూ ప్రక్కనున్న వ్యక్తితో అన్నాడతడు.

అక్కడ... రోడ్డుపై....

ఎప్పుడయితే ఎలక్ట్రిక్ వైర్లు కత్తిరింపబడి, అంతటా చీకటి అలుముకుందో....

ఆ క్షణం నుండీ అనూహ్యమైన సంఘటనలతో ఆ ప్రదేశమంతా అల్లకల్లోలంగా మారిపోయింది.

అంతవరకూ భక్తుల మధ్య బుద్ధిమంతుల్లా నడుస్తున్న సలీం అనుచరులు ఒక్కసారిగా నిశాచరుల్లా, పిశాచాల్లా విజృంభించారు.

ఎవరెవరివో చేతులు మొరటుగా తమ అవయవాలను తాకేసరికి కెవ్వుమన్నారు కొందరు ఆడవాళ్ళు. మెడల లోనూ చెవులకూ ధరించిన బంగారు నగలను బలవం

తంగా త్రెంచేసరికి, చర్మం కోసుకుపోయి, చెవి తమ్మెలు తెగిపోయి బాధగా ఆర్తనాదాలు చేశారు మరి కొందరు ఆతివలు.

గింజుకుంటున్న తమను వాటేసుకొని, ఎగరేసి చాప చుట్టలా భుజాన వేసుకొని ఎవరో దుండగులు ఎత్తుకు పోతూండడంతో.... భయవిహ్వలురై రక్షించమని కేకలు పెట్టారు కొందరు కన్నెపిల్లలు.

అడ్డుగచ్చిన మగాళ్ళను చావబాదుతున్నారు దుండగులు. త్రొక్కిసలాట ప్రారంభమయింది.

అంతవరకూ ఆ ఊరేగింపుకు ఇరుప్రక్కలా బాడీ గార్డ్సులా నిలబడి నడుస్తూ, మరోప్రక్క జాగ్రత్తగా మ్యూజియంను వాచ్ చేస్తున్న పోలీసులు, లాఠీలనుపట్టుకొని రంగంలోకి దిగారు.

మ్యూజియం గార్డ్సు కూడా, పహారాను ఆపి, ఉత్సుకతతో ఆ మారణకాండను చూడసాగారు.

చీకటి! కన్ను పొడుచుకున్నా కనిపించని కారు చీకటి! ఎవరు, ఎవరిని కొడుతున్నారో, అర్థం కాని పరిస్థితి. కేకలు, ఆక్రందనలతో ఆ ప్రదేశమంతా మార్మోగిపోతూంది.

ఇప్పుడందరి దృష్టి ఆ కొట్లాటమీదే వుంది. పోలీసులు, గార్డ్సు కూడా తాత్కాలికంగా మ్యూజియం మాటను మరచిపోయారు.

పైన.... కిందపై....

చుట్టూ ఒక్కసారి చూసి, తమను ఎవరూ గమనించటం లేదని ధృవపరచుకున్నాక....

చేతిలోనున్న కొక్కాన్ని.... మ్యూజియంకు కనెక్ట్ చేయబడిన ఎలక్ట్రిక్ వైరుకు తగిలించాడు సలీం. ఆ

కొక్కానికి వేలాడుతున్న బెల్టును రెండు చేతులతో గట్టిగా పట్టుకున్నాడు. గుండెలనిండా ఊపిరి పీల్చుకొని ఒక్కసారిగా ముందుకు దూకాడు.

అంతే!

రోప్ వే గుండా సాగిపోయే ట్రాలీలా రివ్వున గాలిలో ముందుకు దూసుకుపోయాడతడు.

శరీరంలోని శక్తినంతటినీ, చేతులలో కేంద్రీకరించి, గాలిలో అలా రోప్ కు వ్రేలాడుతూ ప్రయాణించడమంటే మాటలేం కాదు. ఆ ఫీట్ చేయడానికి గుండెల్లో తెగువ వుండాలి.

ఆ ఫీట్ చేయటంలో ఎక్స్‌పర్టు కాబట్టే. సలీంను ప్రత్యేకంగా ఆ ఎస్సైన్‌మెంట్ కు వినియోగించాడు బలరామ్!

కేవలం రెండు నిముషాలలో మ్యూజియం పైనున్న టవర్‌ను చేరుకున్నాడు సలీమ్.

పోలీసుల కళ్ళు కప్పగలిగాడు. మ్యూజియం గార్డ్సును ఏమార్చగలిగాడు. కాని ఆ వీధిలో ఒక మూలనున్న చెత్తకుండీ ప్రక్కన కూర్చున్న భిక్షగాని దృష్టిలో నుండి మాత్రం తప్పించుకోలేకపోయాడతడు.

కొద్దిక్షణాల క్రితం....

ప్రక్కవీధిలోని పార్కులో పొదచాటు నుండి.... వైర్‌లెస్‌సెట్ ద్వారా మాట్లాడినది ఆ భిక్షగాడే!

'పెద్ద చేపను పట్టడానికి చిన్న చేపను వేసినట్లు, చిన్న కల్లోలాన్ని సృష్టించి, అటు పోలీసులనూ, ఇటు గార్డ్సునూ ఏమార్చి, వారి దృష్టి అటు మరల్చి, యెంచక్కా మ్యూజియంను దోచుకో బోతున్నారు వీరు....

అందరి ఎటెన్షనూ ఇటు మరల్చి అటు హాయిగా, తీరిగ్గా తమ పనులను చక్కబెట్టుకుంటున్నారు.' అనుకున్నాడు ఆ భిక్షగాడు.

....అంతే! మరుక్షణం ఉలిక్కిపడ్డాడు.

—ఏమిటి తను అనుకున్నది?

'అందరి ఎటెన్షన్‌నూ ఇటు మరల్చి, అటు హాయిగా, తీరిగ్గా తమ పనులను చక్కబెట్టుకుంటున్నారు.'

ఏదో యథాలాపంగా అనుకున్న తన మాటలలోని గూఢార్థం అర్థమయ్యేసరికి, విపరీతమయిన ఆందోళనకు గురైంది అతని అంతరంగం.

నిజమే!

తను యింతవరకూ ఒక్క కోణంలో నుండే ఆలోచిస్తున్నాడు. నిజాం నగల దోపిడీకి సంబంధించినంత వరకూ శత్రువుల ప్లాన్స్ యేమిటో స్పష్టంగా తెలుస్తున్నాయి.

బట్, వాట్ అబౌట్ దట్ హెరాయిన్?

దాని పంపిణీ మాటేమిటి?

మ్యూజియం వీధిలోనే, ఆ నిమజ్జనోత్సవంలోనే, హెరాయిన్ పంపిణీ జరగాల్సి వుంటే, అక్కడ ఆ అల్లరి సృష్టించబడి వుండేది కాదు.

ఆ అల్లరి సృష్టించబడింది....నిజాం నగల దోపిడీకి. మరి నిజాం నగల దోపిడీని ప్లాన్ చేసింది....?

పోలీసుల దృష్టిని ఇటు కేంద్రీకరింపచేసి ఇంకో చోట, ఏ టెన్షన్‌నూ లేకుండా హాయిగా ఆ నూరుకోట్ల రూపాయల విలువచేసే హెరాయిన్‌ను పంపిణీ చేసుకొనేందుకా?'

—ఆ ఆలోచన మనసులో మెదిలాక ఒక్కక్షణం కూడా అక్కడ నిలువలేకపోయాడు ఆ భిక్షగాడు.

వడి వడిగా నడుచుకుంటూ ఆ వీధిలోనుండి వెళ్ళిపోయాడతడు.

# 8

గోతిలోనుండి బయటకు వచ్చాడు లాల్. అంతవరకూ దుర్గంధభూయిష్టమైన మురికి కూపంలో మ్రగ్గిపోవటంవలన, చల్లని గాలి మెల్లగా ముఖానికి తగిలేసరికి, ప్రాణం లేచివచ్చినట్లనిపించింది అతనికి.

ఒక్కసారి హాయిగా గుండెలనిండా గాలి పీల్చుకున్నాడు. అంతే! మరుక్షణం అతని మనసులో మొలకెత్తిందొక చిన్న అనుమానం.

తను ప్లాన్ ప్రకారం, తాము చేసిన సొరంగమార్గం సరిగ్గా మ్యూజియం మెయిన్ హాల్‌కు కుడివైపు నున్న స్టోర్ రూమ్‌లోకి చేరుకోవాలి.

విరిగి పాతబడిన సామాగ్రితో, బూజులు పట్టి ముక్కు కంపుకొట్టే ఆ గదిలోకి అంత చక్కని గాలి ఎలా వస్తూంది?

అనుమానంగా చుట్టూ కలియచూశాడు.

చీకటి! అంతటా, ఆవరించుకున్న కాటుకలాంటి కటిక చీకటి!

కళ్ళు చికిలించుకొని చూశాడతడు.

అస్పష్టంగా కనిపిస్తోన్న క్రీనీడలను బట్టి, తామున్నది గదిలో కాదని, మ్యూజియం బయటనున్న ఆవరణలోనని గ్రహించటానికి అతడికి ఎంతో సేపు పట్టలేదు.

అయినా సందేహాన్ని నివృత్తి చేసుకోవడానికి చేతిలో నున్న పెన్ టార్చ్‌ను ఒక్కసారి వెలిగించా

డతడు.

అదే అతడు చేసిన తప్పు.

ఏదో క్రొత్త వాసన సోకేసరికి, ముక్కు పుటాలను ఎగుర వేస్తూ, నేలను వాసన చూస్తూ.... వారివైపే వస్తూంది ఆ బ్లడ్ హౌండ్.

ఎప్పుడయితే టార్చ్‌లైట్ వెలుగు దాని కళ్ళల్లో పడిందో, భయంకరంగా మొరుగుతూ ముందుకు దూకిందది.

నాలుగడుగుల ఎత్తులో కోరలు చూస్తూ, బ్లాక్ పాంథర్ లా వచ్చి పడుతున్న ఆ బ్లడ్ హౌండ్‌ను చూసే సరికి.... లాల్‌కు ఏం చేయాలో తోచలేదు.

జేబులోనుండి రివాల్వర్ ను తీసి, దానిని క్షణంలో అంతం చేయవచ్చు. కాని రివాల్వర్ మ్రోతను విని గార్డ్సు వచ్చే ప్రమాదం వుంది,

ఏం చేయాలో నిశ్చయించుకోలేక డెస్పరేట్ గా ముందుకు పరుగెత్తాడతడు.

పది అడుగులు వేసేసరికి, గోడ ప్రక్కగా కన్పించింది ఓ నీటిగొట్టం. చటుక్కున దాన్ని అందుకొని పైకి ప్రాకడం ప్రారంభించాడతడు.

ఆ క్షణంలో....తన మిత్రుడూ, సహచరుడూ శంభు మిత్ర యింకా అక్కడే ఉన్నాడన్న విషయం కూడా గుర్తుకు రాలేదు అతనికి.

డ్రిల్లింగ్ మెషిన్‌ను గట్టున పెట్టి, రెండు చేతులనూ నేలకు ఆన్చి, గోతిలో నుండి తన భారీశరీరాన్ని మెల్లగా పైకి లేపుతున్నాడు శంభుమిత్ర.

అదే సమయంలో పెద్దపులిలా కోరలు చూస్తూ అతని మీద పడింది ఆ బ్లడ్ హౌండ్. ఆ అదటుకు అతడు

గోతిలోనికి జారిపోయాడు. అతనితోపాటు ఆ బ్లడ్ హౌండ్ కూడా.

కోరలు సాచి, అతని కుడి జబ్బను పట్టి విసురుగా లాగింది బ్లడ్ హౌండ్. రక్తం ఓడుతూ పట్టెడు కండ ఊడి వచ్చింది.

భరించలేని బాధతో ఆర్తనాదం చేశాడతను. గుహలా నోరును తెరుస్తూ మరోసారి అతని మీదకు దూకిందది.

అక్కడ.... మ్యూజియంలో....

టవర్ పైనుండి, మెట్లగుండా క్రిందకు దిగాడు సలీమ్. మ్యూజియం లోపలకు, తిన్నగా మెయిన్ హాలుకు తీసుకు వెళ్తాయి ఆ మెట్లు. చివరి మెట్టును చేరాక ఆగాడతడు.

ఎదురుగా మూసి ఉన్న తలుపులు సాక్షాత్కరించాయి అతనికి. వాటికి పెద్ద గోద్రెజ్ తాళం వ్రేలాడుతూంది.

అతడు నిదానంగా రైఫిల్ బారెల్ ను ఆ తాళం కీ హోల్ లో ఉంచి ట్రిగ్గర్ ను నొక్కాడు.

అంతే!

చిన్నగా శబ్దం చేస్తూ విడిపోయింది ఆ తాళం. మెల్లగా తలుపులను పక్కకు త్రోసాడతడు. కిర్రున శబ్దం చేస్తూ తెరుచుకున్నాయవి.

అడుగు ముందుకు వేయబోతూ అప్రయత్నంగా ఆగి పోయాడతడు.

ఏదో శబ్దం లీలగా వినిపించసాగింది అతనికి. చెవులు రిక్కించాడతడు. ఎవరో బరువుగా ఊపిరి పీలుస్తున్న ధ్వని. నక్కి, నక్కి వస్తున్నట్లుగా, మెత్తని పాదాల సవ్వడి.

అతడు చటుక్కున గోడచాటుకు దాక్కొని, తల మాత్రం కాస్త సాచి, లోపలకు తొంగిచూశాడు.

అంతకు కొద్దిక్షణాల క్రితం....

నీటి పంపును పట్టుకొని, పది అడుగులు పైకి ప్రాకే సరికి, పంపుకు కుడిప్రక్క రెండడుగుల దూరంలో పెద్ద వెంటిలేటర్ కనిపించింది లాల్‌కు. చేయి సాచి, వెంటిలేటర్‌ను అందుకున్నాడతడు.

అది పాతకాలంనాటి మోడల్‌లో కట్టడిన వెంటిలేటర్. దాని మధ్య అడ్డంగా ఇనుప వూచలేం లేవు. రెండు రెక్కల తలుపులు మాత్రం వేసి వున్నాయి. అవి కూడా గొళ్ళెం పెట్టి లేవు.

వాటిని మెల్లగా తెరిచాడతడు.

యింత నిర్లక్ష్యంగా, కనీసం గొళ్ళెం కూడా పెట్టకుండా వీటిని ఇలా వదిలేసారేమిటి చెప్మా అనుకుంటూ ఆశ్చర్యంగా లోనికి చూశాడు.

చీకటి!

కారు చీకటి!

చేతిలోని టార్చ్‌ను నొక్కి, లోపలకు ఫోకస్ చేశాడు.

విరిగిన కుర్చీలు, చిత్రపటాలు, బూజుపట్టిన ఇతర సామాగ్రి.... చిందర వందరగా పడివున్నాయి ఆ చిన్న గదిలో.

తమ ప్లాన్ ప్రకారం, తాము చేసిన సొరంగ మార్గం చేరాల్సిన స్టోర్ రూమ్ అదేనని గ్రహించడానికి అతనికి యెంతో సేపు పట్టలేదు.

'అంటే ఈ గదికి ఎడమవైపున వుంటుందన్నమాట మెయిన్ హాల్!' అనుకున్నాడతడు మెల్లగా వెంటి

లేటర్ గుండా ఆ గదిలోకి ప్రవేశిస్తూ.

అడ్డుగా పడివున్న సామాన్లను తప్పించుకుంటూ, సవ్వడి చేయకుండా, అడుగులను తూచి తూచి వేస్తూ తలుపులను సమీపించాడు.

ఆ తలుపులకు అవైపున తాళం వేయబడి వుంది. వాటి వంక పరీక్షగా చూశాడతడు.

సగం వరకూ చెక్క, ఆపైన ఫ్రేములకు అద్దపు పలకలు అమర్చబడ్డ పాతకాలంనాటి తలుపులవి.

ఒక్క దెబ్బతో ఆ అద్దపు పలకలను బద్దలుకొట్టవచ్చు. కావాలంటే కాస్త కష్టపడి ఆ తలుపులనే విరగ్గొట్టవచ్చు కాని, కాస్త శబ్దాన్ని కూడా చేసి, లేనిపోని రిస్కులను కొని తెచ్చుకోవడం ఇష్టంలేకపోయింది అతనికి.

జేబులోనుండి చిన్న పట్టకారును పైకితీశాడు. అద్దం పలకలు పడిపోకుండా, ఫ్రేం అంచులకు చిన్న, చిన్న పూతిక మేకులు దిగగొట్టబడి వున్నాయి. అన్నింటికన్నా దిగువగా నున్న అద్దపు పలక చుట్టూ వున్న మేకులను పట్టకారుతో నెమ్మదిగా ఊడదీశాడు. తరువాత ఆ అద్దపు పలకలను కూడా తీసి, జాగ్రత్తగా క్రింద వుంచాడు.

గాజాపలక తీయబడిన స్థానంలో ఏర్పడిన ఖాళీగుండా కుడిచేతిని బయటకు జొనిపాడు. ఆ తలుపులకు వేయబడ్డ తాళం అతని చేతికి అందింది.

సన్నగా పుల్లలా వున్న సాధనాన్ని ఆ తాళం కీహోల్లో నుంచాడు. అతని చేతివేళ్ళు చురుగ్గా కదలాడుతున్నాయి. కేవలం రెండు క్షణాల్లో 'క్లిక్'మంటూ ఆ తాళం విడిపోయింది.

మెల్లగా తలుపులను తెరచి ఆ గది బయటకు

నడిచాడు.

ఒకటి.... రెండూ.... మూడు.... నాలుగు....

ఒక్కొక్క అడుగే లెక్కపెట్టి వేస్తున్నట్లుగా మెల్లగా నడిచేయకుండా ఎత్తి,ఎత్తి అడుగులను వేస్తున్న అతను చటుక్కున ఆగిపోయాడు.

ఏదో శబ్దం లీలగా వినిపించింది అతనికి. చెవులను రిక్కించాడు.

ఎవరో బరువుగా ఊపిరి పీలుస్తున్న ధ్వని. అడుగు ముందుకు వేయబోయి, ఛటుక్కున ప్రక్కకు తప్పుకున్న అలికిడి.

'సంబడీ ఈజ్ దేర్!' అనుకున్నాడు అతడు అనుమానంగా.

అంతే!

ఎక్కడ వున్నవాడు అక్కడ వున్నట్లుగానే నేల మీదకు జారిపోయి మెల్లగా ప్రాకుకుంటూ ప్రక్కనున్న స్తంభం చాటుకు చేరుకున్నాడు.

తలను మాత్రం కాస్త బయటకు సాచి తొంగి చూశాడు.

కనుపించటానికి ఏముంది అక్కడ?

కారుచీకటి తప్ప?

# 9

ఎక్కడ?

ఎక్కడ ఆ నూరుకోట్ల రూపాయల విలువచేసే హెరాయిన్ పంపిణీ చేయ ఁడుతూంది?

చాందినీ చౌక్‌లోని దేవీ నిమజ్జన ఉత్సవంలో కాదని తేలిపోయింది. అయితే మరి యెక్కడ?

'నవమి'కి తాను అన్వయించుకున్న అర్థం ప్రకారం...

ఈ లోకే, ఎక్కడో దేవీ నవరాత్రి ఉత్సవాల్లోనే ఆ హెరాయిన్ పంపిణీ జరిగితీరాలి.

బట్.... వేర్?—తీవ్రంగా ఆలోచించసాగాడా బిత్తగాడు.

అతని మనోఫలకంపై ఢిల్లీలో ఎక్కడెక్కడ దేవీ నవరాత్రి ఉత్సవాలు జరుపబడతాయో ఆ ప్రదేశాలన్నీ సినిమా రీళ్ళలా కదలసాగాయి.

'ఓల్డు సిటీ....కరోల్ బాగ్, రెడ్ ఫోర్టు, జనపథ్ పాలిక్కబజార్....' ఒక్కొక్క పేరునే మననం చేసుకుంటున్నాడతడు.

'పాలం ఎయిర్ పోర్టు!' అనుకుంటూ టక్కున ఆగిపోయాడు.

ఢిల్లీ మొత్తంమీద దేవీ నవరాత్రి ఉత్సవాలు ఘనంగా జరిగేది పాలం ఎయిర్‌పోర్టు ఏరియాలోనే. ఇన్‌స్పెక్టర్ సంతోష్ హత్య కావింపబడిన గోడౌన్ ఉన్నది ఆ ఏరియాలోనే! అతని ఫోన్‌కాల్ ప్రకారం ఆ గోడౌన్‌లోనే ఆ హెరాయిన్ స్టాక్ చేయబడింది.

అంటే! ఆ హెరాయిన్ యింకా ఆ ఏరియాలోనే ఉందా?

నిజానికి తమ దృష్టి మొదటగా ఆ యేరియామీదే పడివుండేది. కాని, ఈ నిజాం నగలనుండి తమ ఎటెన్షన్ అంతా చాందినీ చౌక్‌వైపు మరలింది.

కాదు! శత్రువులు తమ దృష్టిని అటు మరలింపజేశారు? అదే నిజమయితే....అక్కడ....ఆ ఏరియాలోని దేవీ, నిమజ్జనోత్సవంలోనే ఆ హెరాయిన్ పంపిణీ జరగాలి!'

తాను గాలిలో బాణం వదులుతున్నానని అతనికి

తెలుసు. కాని. మరో మార్గం కనిపించలేదతనికి.

ఒక నిశ్చయానికి వచ్చినట్లు పార్కు బయటకు నడిచాడతడు. జరిగినదంతా కొద్ది క్షణాల క్రితమే వైర్ లెస్ సెట్ ద్వారా రిపోర్టు చేసి వస్తున్నాడతడు.

పార్కు బయట రోడ్డుకు ఓ ప్రక్కగా పార్కు చేయబడ్డ స్పోర్ట్సుకారును సమీపించాడు. తలుపును తెరిచి, స్టీరింగ్ ముందు కూర్చుని, కారును స్టార్టుచేశాడు.

ఒక చింకిపాతల బిక్షగాడు ఖరీదైన స్పోర్ట్సుకారును డ్రయివ్ చేయటం చూస్తే ఎవరైనా ముక్కున వ్రేలేసుకుంటారు అనుమానిస్తారు.

కాని, ఇప్పుడతనేమీ పట్టించుకొనే స్థితిలో లేడతడు. అతని సారధ్యంలో....శరవేగంతో పాలం ఎయిర్ పోర్టు ఏరియావైపు దూసుకుపోతూంది ఆ స్పోర్ట్సు కారు.

అక్కడ... మ్యూజియంలో ...

'ఎంతసేపు ఇలా చీకటిలో యెదురుచూడటం?' అనుకున్నాడు సలీం అసహనంగా.

'కనుపించని శతృవుకు భయపడి, ఇలా చీకటిలో దాక్కొని ఉంటే, ఈలోగా బ్లడ్ హౌండు అరుపులకు గార్డ్సు రియాక్టయి, వెతకటం ప్రారంభిస్తే....! తాము త్రవ్విన సొరంగం దారి కంటబడితే....!' — ఆపైన ఆలోచించలేక అసీజీగా కదిలాడు లాల్.

అతని అనుమానం అక్షరాలా నిజమైంది.

'సొరంగం, దాని ప్రక్కనే పడి ఉన్న డ్రిల్లింగ్ మిషన్, సొరంగంలోనుండి వినవస్తున్న బ్లడ్ హౌండ్ అరుపులు....'—శతృవులు మ్యూజియంలో ప్రవేశించారని క్షణంలో గ్రహించారు ఆ గార్డ్సు.

విషయం పోలీసుల వరకూ ప్రాకింది.

అంతే!

మరుక్షణం నుండి గార్డ్సు కేకలతో, పోలీసుల విజిల్సుతో ఆ మ్యూజియం ఆవరణ మారుమ్రోగిపోయింది.

ఆ కేకలు, ఈలలు వినిపించగానే త్రుళ్ళిపడ్డారు.... సలీమ్, లాల్. 'ఇక తెగించాలి' అనుకున్నారు వారు ఎవరికి వారే!

చేతిలోని టార్చిని నేలమీద ఉంచి, స్విచ్‌ను ఆన్ చేసి, తను ఛటాక్కున స్తంభం చాటుకు తప్పుకున్నాడు లాల్.

అతని ఎత్తు ఫలించింది.

టార్చ్ వెలిగిన మరుక్షణం సలీమ్ చేతిలోని గన్ గర్జించింది. అయితే అక్కడ లాల్ లేకపోవటంతో వెనుకనున్న అద్దాల బీరువాను ధ్వంసం చేశాయి ఆ తుపాకి గుళ్ళు.

ఆ దేక్షణంలో చేతిలో సిద్ధంగా ఉంచుకున్న డాగర్‌ను తుపాకీ ప్రేలిన స్థలం వైపు బలంగా విసిరాడు లాల్.

అతని గురి తప్పలేదు.

సూటిగా వెళ్ళి. సలీం భుజంలో దిగబడిందా బాకు.

'అమ్మా' అంటూ బాధగా అరుస్తూ నేలపై కూలబడ్డాడతడు.

ఆదేక్షణంలో....లాల్ చేతిలోని రివాల్వర్ నిప్పులు గ్రక్కింది.

తన రివాల్వర్‌కు సైలన్సర్ లేదనీ, అది మ్రోగిన మరుక్షణం గార్డ్సుకు తమ ఉనికి తెలిసిపోతుందని అతనికి తెలుసు. 'కాని తప్పదు. తను తొందర పడకుంటే, అటువైపునున్న శత్రువు తన ప్రాణాలను తీసేట్టున్నాడు'

అనుకున్నాడతడు రివాల్వర్‌ను ప్రయోగిస్తూ.

కాని, సలీం నేలమీద కూలబడటం వలన, ఆ రివాల్వర్ బుల్లెట్ వెనుకనున్న గోడకు తగిలింది.

క్రిందపడ్డ సలీమ్ ఖాళీగా కూర్చోలేదు. గన్‌ను సిద్ధంగా పట్టుకున్నాడు. భుజానికయిన గాయంలోనుండి రక్తం కారుతూంది. భుజం విపరీతమయిన సలుపు పెడుతూంది. అయినా పళ్ళ బిగువున ఆ బాధనంతటినీ ఎలాగో సహిస్తున్నాడతడు.

ఎప్పుడయితే లాల్ రివాల్వర్ ప్రేల్చాడో మరుక్షణం ఆ శబ్దాన్ని బట్టి గన్‌ను గురిపెట్టి ట్రిగ్గర్ నొక్కాడు అతడు.

ఈసారి అతని గురి తప్పలేదు.

లాల్ కాలర్ బోన్‌లోనుండి దూసుకు పోయిందా తుపాకీ గుండు. భరించలేని బాధతో ఆర్తనాదం చేస్తూ వెనక్కు విరుచుకు పడిపోయాడు లాల్. చేతి వేళ్ళ పట్టు సడలి, అతని చేతిలోని రివాల్వర్ నేలపైకి జారిపోయింది.

శబ్దాన్ని బట్టి తన శత్రువు నేలకూలాడని గ్రహించాడు సలీమ్. రివాల్వర్ నేలమీదపడి 'ఖంగు'న మ్రోగిన శబ్దాన్ని విన్నాక, శత్రువు నిరాయుధుడని తేలాక నిర్భయంగా లేచి నిలబడ్డాడు.

జేబులోనుండి పెన్ టార్చ్‌నుతీసి వెలిగించాడు. నిజాం నగలు వుంచబడ్డ గ్లాస్ కేస్ యెక్కడుందో అతనికి తెలుసు. చక, చకా అడుగులు వేసుకుంటూ అటువైపు నడిచాడతడు.

హాలుకు కుడివైపున వుందొక ప్రత్యేకమైన గది. అత్యంత విలువైన పురాతన వస్తువులు అందులో వుంచ

బడతాయి.

ఆ గది ముందు ఆగాడు సలీమ్.

ఆ గది తలుపులకు పెద్ద తాళం వ్రేలాడుతూంది. తుపాకీని ప్రేల్చి క్షణంలో ఆ తాళాన్ని విడగొట్టాడు అతడు. తలుపులను మెల్లగా తెరిచాడు. టార్చ్‌ను లోపలకు ఫోకస్ చేశాడు.

గది మధ్యనున్న పెద్ద గ్లాస్ కేస్‌లో నీట్‌గా పేర్చబడి వున్నాయి నిజాం నగలు. వాటి మధ్య చుక్కల్లో చంద్రునిలా మెరిసిపోతూంది అపూర్వమైన జాకబ్ డైమండ్!

ఒక్క పరుగున ఆ కేస్‌ను సమీపించి ఆత్రంగా దానిపై చేయి వేశాడతడు.

అంతే!

చెవులు చిల్లులుపడేలా వినిపించిందొక సైరన్ మోత! గుప్పుమంటూ ఆ గదిలోని లైట్లు వెలిగాయి.

జరిగిందేమిటో అర్థంకాక క్షణకాలంపాటు నిశ్చేష్టుడైపోయాడు సలీమ్.

## 10

అఘ మేఘాలపై, రాకెట్‌లా దూసుకొంటూ పోయి ఎయిర్ పోర్టు ఏరియాను చేరుకున్నాడు ఆ భిక్షగాడు.

కాని....ఆ ఏరియా అంతా నిర్మానుష్యంగా వుంది. పెళ్ళివారు ఖాళీచేసిన విడిది యింటిలా కళావిహీనంగా వుంది. పందిళ్ళూ, షామియానాలూ, ఒకటి, రెండు విద్యుద్దీపాలూ మాత్రం....అక్కడ దేవీ నవరాత్రోత్సవాలు జరిగాయన్నదానికి సాక్ష్యాలుగా నిలిచి వున్నాయి.

'అంటే....ఊరేగింపు వెళ్ళిపోయిందన్నమాట!' అనుకున్నాడతడు తలను పంకిస్తూ.

ఉత్సవం యొక్కడ, యే ప్రాంతంలో జరిగినా నిమజ్జనం మాత్రం ఢిల్లీ నగర శివార్లలో ప్రవహిస్తున్న యమునా నదిలో జరుగాల్సిందే!

అయితే....కనీసం అర్థరాత్రి వరకైనా జరగాల్సిన ఊరేగింపును ఇంత అర్థాంతరంగా ఆపేసి, అంత హడావుడిగా యమునా తీరానికి తరలి వెళ్ళిపోయారెందుకు?

'అంటే తన అనుమానమే నిజం కాబోతున్నదా?' ఆలోచనలో పడ్డాడతడు.

హెరాయిన్ పంపిణీ.... ఇక్కడే ...! ఎయిర్‌పోర్టు ఏరియాలోనే జరిగేటట్లుంటే, ఇంత తొందరగా ఊరేగింపును ముగించి, యమునా నదీ తీరానికి పరుగులు తీయాల్సిన అవసరం లేదు.

అదీ గాక....పోలీసులనూ, భక్తులనూ ఏమార్చి విద్యుద్దీపాలతో వెలిగిపోయే ఈ ఊరేగింపులో రిస్క్ తీసుకోవడం కంటే, నిర్మానుష్యమైన యమునా నదీతీరాన చీకటిలో ఆ చీకటి వ్యాపారాన్ని పూర్తిచేసుకోవటం వారికి సులువు.

సో! తన అనుమానమే నిజమైతే ఆ హెరాయిన్ పంపిణీ ఖచ్చితంగా యమునానది తీరంలోనే జరగాలి!' అనుకున్నాడతడు.

దెన్ ....ఎలా జరుగుతుంది?

ఒకసారి తనే బలరామ్ స్థానంలో వుంటే....ఏం చేసేవాడో ఊహించుకున్నాడు....అతడు.

అంతే!

మంచులా విడిపోయింది అతని మనసును పట్టిపీడిస్తున్న అతని సందేహం!

మెదడు పొరలలో తటిల్లతలా మెరిసిందొక ఆలో

చన. సన్నని చిరునవ్వుతో అతని పెదవులు విచ్చుకున్నాయి.

ఏక్సిలేటర్‌ను పాదంతో బలంగా అదిమాడు. వింటిని విడిచిన బాణంలా కారు సర్రున దూసుకుపోయింది.

ఒక చేతితో స్టీరింగ్‌ను కంట్రోల్ చేస్తూ .... మరో చేతితో జోలెలోనుండి వైర్‌లెస్ సెట్‌ను బయటకుతీశాడు.

కాంటాక్టు చేయబడ్డ వ్యక్తి లైన్‌లోనికి రాగానే మెల్లగా చెప్పటం ప్రారంభించాడతడు....

అక్కడ....

మ్యూజియంలో....

విద్యుత్ సరఫరా నిలిపివేయబడ్డ మ్యూజియంలో— ఆ గ్లాస్ కేసును తాకేసరికి ఎలక్ట్రిక్ అలారమ్స్ ఎలా మ్రోగినట్లు? మ్యూజియంలో అంతా అంధకారంలో మగ్గిపోతూండగా ఒక్క ఈ గదిలోని లైట్లు మాత్రం ఎలా వెలిగినట్లు?'

— ఏం జరిగిందో, ఎలా జరిగిందో అర్థంకాని అయోమయ స్థితిలో వున్నాడు సలీమ్.

అంతలో....అతని వెనుక చిన్న అలికిడి అయినట్లనిపించింది. గిరుక్కున వెనుతిరగబోయాడు అతడు.

కాని, అంతలో అతని వెన్నుకు బలంగా గుచ్చుకొందొక ఇనుప గొట్టం. అది రైఫిల్ బారెల్ అని గ్రహించడానికి సలీంలాంటి ప్రొఫెషనల్ క్రిమినల్‌కు ఎన్నో సెకన్లు పట్టలేదు.

తను కదిలిన మరుక్షణం ఆ రైఫిల్ పేలుతుందని, ఆ గుండు తన వెన్నును చీల్చుకుంటూ, గుండెలలో నుండి దూసుకుపోతూందని....అతనికి వేరే మాటలతో చెప్పా

ల్సిన పని లేకపోయింది.

బుద్ధిగా చేతులను పైకెత్తి కదలకుండా నిలబడ్డాడతడు.

"అది బుద్ధిమంతుల లక్షణం సలీమ్,

ఇక, నీ సందేహాలకు సమాధానం చెబుతాను విను.

ఈ గదికి ప్రత్యేకంగా బ్యాటరీ పవర్ యేర్పాటు చేశాం. మ్యూజియం అంతటా మీ దయావలన పవర్ సప్లై పోయినా, ఈ గదిలో మాత్రం పవర్ సప్లై యథాతథంగా వుంది. కాకుంటే, ఎలాగూ నిజాం నగల కోసం మీరు ఈ గదికి వస్తారని తెలుసు కాబట్టి, మీకు స్వాగతం పలకడానికి ఈ గదిలోని లైట్లను ఆఫ్ చేసి, చీకటిలో కాచుకుకూర్చున్నాను."

గంభీరంగా వినవచ్చిన గొంతును పోల్చుకునేసరికి, సలీమ్ ముఖం తెల్లగా పాలిపోయింది.

తన వెనుక నిలబడినది....ఢిల్లీ పోలీస్ కమీషనర్ అని తెలిశాక, అతని కర, చరణాలు పనిచేయుడం మానేశాయి.

'డామిట్!

ఇతర పోలీస్ అధికార్లకు ఈ పనిని ఎంట్రస్టు చేస్తే ఆ విషయాం యెలాగూ తమ మాఫియా రింగ్‌కు తెలిసిపోతుందని, తనే స్వయంగా వచ్చి కాపు కాసాడన్న మాట....దుర్మార్గుడు!'

—మనసులోనే తిట్టుకుంటూ నిస్సహాయంగా పళ్ళు నూరాడతడు.

ఆదే సమయంలో....

బూట్లను టక టక లాడించుకుంటూ ఆ గదిలోనికి ప్రవేశించారు పోలీసులు.

"టేక్ హిమ్ అవుట్!

అక్కడ మెయిన్ హాలులో మరో వ్యక్తి గాయమై పడివున్నాడు. వాడిని కూడా!" గంభీరమైన కంఠంతో ఆజ్ఞను జారీచేశాడు పోలీస్ కమీషనర్.

# 11

యమునానదీ తీరానికి కాస్త దూరంలో రోడ్డు ప్రక్కనున్న పొదలమాటున కారును పార్క్ చేసి క్రిందకు దిగాడు భిక్షు గాడు.

ఒకసారి చూపులను ముందుకు సారించాడు.

చీకటితెరల మధ్య బద్ధకంగా వళ్ళు విరుచుకుంటున్న శ్యామలాంగనలా వుంది యమునా నది.

తీరం వెంబడి విశాలంగా వ్యాపించిన ఇసుకతిన్నలపై జనం గుంపులుగా నిలుచుని వున్నారు. కాస్త దూరంలో ఆగివున్న ఉత్సవ రథం. మిణుకు మిణుకు మంటున్న దీపపు కాంతిలో అస్పష్టంగా కనిపిస్తూన్న దేవి విగ్రహం.... వారు దేవీ నవరాత్రోత్సవ బృందం అని సులువుగా పోల్చవచ్చు.

'అయితే యింత వేగంగా మరే ఉత్సవ బృందం కూడా యమునా తీరానికి చేరుకోరు కాబట్టి ఆ కన్పి స్తున్న బృందమే తనకు కావాల్సిన పాలం ఎయిర్ పోర్టు ఏరియా ఉత్సవ బృందం అయివుంటుంది' అనుకున్నాడతడు, ముందుకు అడుగు వేస్తూ.

ముందుకు నడిచేకొద్దీ వారు మరింత స్పష్టంగా కన్పి స్తున్నారు.

అంతవరకూ ఆడి పాడి అలసిపోయిన వేష గాళ్ళూ, వాయిద్య గాళ్ళూ ఉత్సవ రథం ముందు ఇసుకలో చేర బడి విశ్రాంతి తీసుకుంటున్నారు.

పెద్ద పెద్ద ఇత్తడి పళ్ళేరాలలో నున్న ప్రసాదాన్ని కూడా వచ్చిన భక్తులకు పంచుతున్నారు కొందరు కార్యకర్తలు.

ఉత్సవ రథం నుండి దేవీ విగ్రహాన్ని దించి నదిలో నిమజ్జనం చేయడానికి తోడ్కొని తీసుకువెళ్తున్నారు యువకులు.

“విగ్రహం చాలా బాగుంది భాయి!” అన్నాడా భిక్షగాడు వారితో పాటుగా తనూ నడుస్తూ.

‘కొలువంతా తీరాక, తీరా నీట కలిసే ముందా దీని అందం నీ కంటబడింది ముసలాడా!’ అంటూ ఎకసెక్కాలాడుతూ... ‘అయినా బలరామ్ బాపూజీ ప్రత్యేకంగా తయారుచేయించి విరాళమిచ్చిన విగ్రహమా.... మజాకానా. అందంగా ఉండకపోవటానికి’ అన్నాడో కార్యకర్త.... ఆ భిక్షగాణ్ని ఓ వెర్రివాణ్ని చూసినట్లు చూస్తూ.

తన అనుమానం నిజమైనందుకు మనసులోనే సంతోషిస్తూ, ముఖంలో ఏ భావమూ బయటపడకుండా జాగ్రత్త పడుతూ.... నిర్వికారంగా వారి వెంట నడిచాడు ఆ భిక్షగాడు.

మొలలోతువరకు వెళ్ళాక. మరో మూడు అడుగులు ముందుకు వేసి ఆగారు వారు. అక్కడ సుమారు గుండెల వరకూ వస్తూంది నీరు.

భిక్షగాడు ఒక్కసారి చుట్టూ కలియజూశాడు. నది మధ్య వారికి కాస్త దూరంలో మెల్లగా కదులుతూందొక నల్లని ఆకారం.

అది పడవ అని గ్రహించగానే అతని భృకుటి ముడి పడింది.

'అర్థరాత్రిపూట అంకమ్మ శివాలులా ఇంత రాత్రి పూట యమునా నదిలో పడవను నడుపుతూంది యెవరు?' అనుకున్నాడతడు దానివంకే సాలోచనగా చూస్తూ.

ఒక్కసారిగా గొంతెత్తి, పెద్దగా జయ జయ ధ్వానాలను చేస్తూ, మెల్లగా భక్తిప్రపత్తులతో ఆ దేవి విగ్రహాన్ని ఆ పావన నదీజలాలలో నిమజ్జనం చేశారు వారు.

జరిగే తంతునంతా ఓ వంక చూస్తూనే మరో వంక ఓరకంటితో ఆ పడవనే గమనించసాగాడు ఆ భిక్షుగాడు.

విగ్రహాన్ని నీటిలో ముంచిన మరుక్షణం ఆ పడవలో నుండి నాలుగు ఆకారాలు మెల్లగా చప్పుడు చేయకుండా నీటిలోకి జారుకోవడం అతని కంటబడింది.

నీటివాలుకు కొట్టుకు వస్తున్న యేవో నల్లని గుండ్రటి వస్తువుల్లా వారి తలలు మాత్రం నీటిపైన కన్పిస్తున్నాయి. వారు ఈదుకుంటూ తమవైపే వస్తున్నారని గ్రహించి సాలోచనగా తల పంకించాడతడు.

విగ్రహాన్ని నీటిలో నిమజ్జనం చేశాక, తాము కూడా భక్తితో మూడుసార్లు నీటిలో తలారా మునిగి, ఆ తరువాత ఒడ్డుకు నడిచారు ఆ ఉత్సవ కార్యకర్తలు.

వారితోపాటుగా తాను కూడ నీటిలో మునిగాడా భిక్షుగాడు. అయితే మూడోసారి మునిగాక, మరి నీటిలో నుండి పైకి లేవలేదతడు.

అనామకుడయిన అతడిని గమనించినవారు లేరు! అతని గురించి పట్టించుకునేవారూ లేరు!

నీటిలో చక్కర్లు కొడుతున్న అతనికి విగ్రహాన్ని

సమీపిస్తున్న ఆ నలుగురు వ్యక్తులు కనిపించారు. వారు పడవలో నుండి వచ్చిన మనుషులు.

వారు స్విమ్మింగ్ సూట్లను ధరించారు. తలలకు హెల్మెట్స్‌లాంటివి పెట్టుకున్నారు. వీపుపై ఆక్సిజన్ సిలిండర్స్‌ను పెట్టుకున్నారు. ఇద్దరి చేతులలో వాటర్ గన్స్ ఉన్నాయి.

“హో! వీరన్నిటికీ సిద్ధపడే వచ్చారన్న మాట!” అనుకున్నాడతడు.

తన అనుమానం నిజం కాదేమోనన్న శంక యేమైనా అతని మనసులో మిగిలివుంటే, స్విమ్మింగ్ సూట్లను ధరించి, మాడ్రన్ వెపన్స్‌ను చేపట్టి వస్తున్న వారిని చూశాక........ఆ అనుమానం కాస్త పటాపంచలై పోయింది.

‘స్విమ్మింగ్ సూట్లనూ ఆక్సిజన్ సిలిండర్స్‌నూ ధరించినవారు యెంతసేపైనా నీటిలో ఉండగలరు. అందునా వారి చేతులలో వాటర్ గన్స్ కూడా వున్నాయి.

ఈ స్థితిలో నిరాయుధునిగా నీటిలో వారిని ఎదుర్కోవడమంటే ప్రాణాలపై ఆశను వదులుకోవడమే!

అయితే ఏం చేయాలి!

ఎలా వారిని అడ్డుకోవాలి?’ ఆలోచించసాగాడతడు.

అంతలో వారు విగ్రహాన్ని సమీపించారు.

అప్పుడు స్ఫురించిందొక ఆలోచన అతనికి.

‘నీటిలోనంటే వారిని యెదుర్కోవడం కష్టం! కాని, నీటి బయట?

అంటే....ఎక్కడ?

నీటిలో నుండి ఆ విగ్రహాన్ని బయటకు తీసి, ఆ పడవ

తోనికే చేరుస్తారు వారు. మరి ఆ పడవనే చేజిక్కించుకుంటే! కోటలో పాగా వేసినట్లే!

ఇక్కడ... నీటిలో వుంటే విగ్రహాన్ని తేవాలి కాబట్టి నలుగురు వచ్చారు కాని ఆ పడవలో ఎవరు వుంటే ఒకరో ఇద్దరో వుంటారేమో!'

ఆ ఆలోచన స్ఫురించాక ఒక్క క్షణం కూడా వృథా చేయలేదతడు. వేగంగా ఈదుకుంటూ ఆ పడవను సమీపించాడు.

అతని అంచనా నిజమయ్యింది. ఆ పడవలో ఒకే ఒక వ్యక్తి కూర్చుని వున్నాడు.

జలభూతంలా ఒక్కసారిగా ఆ నీటిలో నుండి పైకి లేచిన ఆ భిక్షుగాడ్ని చూసి అదిరిపడ్డాడా వ్యక్తి. అతడు తేరుకోనీలోగానే అతడిమీదకు లంఘించాడా భిక్షుగాడు. అరచేతిని కత్తిలా బిగించి మెడపై బలంగా మోదాడు.

అంతే!

అచేతనంగా పడిపోయాడా వ్యక్తి. పెట్టుడు గడ్డాన్ని మీసాన్ని పీకిపారేసి, చకచకా ఆ వ్యక్తి బట్టలను ఊడదీసి. వాటిని తాను ధరించాడతడు. ఆ వ్యక్తి తలపైనున్న కేప్ ను తీసి తాను పెట్టుకున్నాడు.

తరువాత అతని శరీరాన్ని ఎత్తి నీటిలోకి జారవిడిచాడు. 'ఎంత లేదన్నా, అతనికి తెలివిరావడానికి మరో రెండు గంటలు పడుతుంది. నీటిలో మునిగిన అతడు అంతవరకూ బ్రతికివుంటాడా?' అనేమీ ఆలోచించే స్థితిలో లేడతడు.

అదే సమయంలో ఆ విగ్రహాన్ని మోసుకుంటూ మిగిలిన నలుగురు వ్యక్తులూ బోటును చేరుకున్నారు. అందరూ

ఎకాఎకి బోటును స్టార్టు చేశాడతడు.

సర్రున దూసుకుపోసాగిందా బోటు.

విగ్రహాంవంక చూస్తూ హాయిగా నవ్వుకుంటున్నారు వారు.

అంతలో యేదో ఇంజన్ రొద వినిపించేసరికి ఉలిక్కిపడ్డారు వారు. నల్లని జీమూతంలా ఎదురుగా వస్తూన్న పెద్ద మోటార్ బోటు వంక ఆందోళనగా చూశారు వారు.

"పోనీ భాయ్! వేగంగా పోనీ!" కంగారుగా అరిచాడొకడు.

వారి బోట్ టక్కున బ్రేకులు వేసినట్లు ఆగిపోయింది, "ఏం జరిగింది భాయ్?" కంగారుగా అడిగాడు మరో వ్యక్తి.

"ఏం జరుగలేదు ఫ్రెండ్స్! నేనే ఇంజన్ను ఆఫ్ చేశాను" కూల్ గా సామాధానం యిస్తూ వారివంక తిరిగాడతడు.

అతని చేతిలోని రివాల్వర్ వారివంక ఆకలిగా చూస్తోంది.

అతనివంక నిశ్చేష్టులై చూశారు వారు.

అదే క్షణంలో....ఆ మోటారుబోటు వారి బోటు ప్రక్కగా వచ్చి ఆగింది. దాని డెక్ పై రైఫిల్స్ను బారు చేసి నిలబడివున్న పోలీసులను చూడగానే....తప్పించుకుందామన్న ఆశ వారిలో నశించిపోయింది.

మోటార్ బోట్ ముందుసీట్లో దర్జాగా కూర్చున్న సి. బి. ఐ. చీఫ్ కరుణాకర్ వంక ఆనందంగా చూశాడతడు.

ఆ నలుగురూ యేమీ ప్రతిఘటించకుండానే పోలీసు

లకు లొంగిపోయారు.

'ఎదిరించి ప్రాణాలను కోల్పోవడం కన్నా. ప్రతి ఘటించే బలుసాకును తినైనా ప్రాణాలను నిలుపుకోవడం మిన్నని' అనుకున్నారు వారు.

విగ్రహంతో సహా ఆ నలుగురూ మోటార్ బోటులోకి చేర్చబడ్డారు.

విగ్రహం అడుగుభాగాన్ని జాగ్రత్తగా ఊడదీసాడతడు. తెల్లని పొడరున్న చిన్న చిన్న పోలిథిన్ పేకట్లు జల జల మంటూ ఆ విగ్రహంలో నుండి జారి పడ్డాయి.

అంతా విప్పారిన నేత్రాలతో వాటి వంకే చూస్తున్నారు.

"వెల్ డన్ రాంకుమార్!

నాకు తెలుసు. నీవు సాధించి తీరతావని...." ప్రశంసాపూర్వకంగా అతని భుజాన్ని తట్టారు సి. బి. ఐ. చీఫ్ కరుణాకర్.

పెట్టుడు గడ్డాన్ని, మీసాన్ని తీసేసినా, భిక్షుగాని వేషపు గురుతులుగా యింకా మిగిలిపోయిన పెట్టుడు కనుబొమలను తీసుకుంటున్న రాంకుమార్ ఆ పొగడ్తల భారాన్ని మోయలేక తలదించుకున్నాడు.

"నిజాం నగల చోరీకి ప్రయత్నించిన దొంగలు కమీషనర్ చేత జిక్కారు. నూరు కోట్ల విలువచేసే హెరాయిన్ మనచేత చిక్కింది.

కాని, దీని కంతటికీ మూలకారకుడైన బలరామ్ మాత్రం హాయిగా ఉన్నాడు. నేరస్థుడని తెలిసికూడా అతనిని ఏం చేయలేకపోతున్నాం!"—బాధగా తల విదిలిస్తూ అన్నాడు కరుణాకర్.

'సాక్ష్యాలనుబట్టి శిక్షలను విధించే చట్టం అమలులో నున్న న్యాయవ్యవస్థగల ఈ దేశంలో....

న్యాయాన్ని చట్టాన్ని....ఆఖరికి ప్రభుత్వాన్ని కూడా గుప్పిటలో పెట్టుకోగల బలరామ్‌లాంటి మాఫియా గ్యాంగ్ లీడర్లు...నర వ్యాఘ్రాల్లా ఈ జనారణ్యంలో స్వేచ్ఛగా సంచరిస్తూనే వుంటారు' అనుకున్నాడు రాజకుమార్, ఒక వేడి నిట్టూర్పు విడుస్తూ!

—: అయిపోయింది :—

సీరియల్




(గత సంచిక తరువాయి)

"మనోజ్ ...." విరూపాక్షరావు అడ్డు తగిలాడు.

"అడ్డురాకు. నోరు మూసుకుని, చెవులప్పగించి విను! నీ అనుచరుల బృందగానం వింటే నువ్వు గుండె ఆగి చస్తావ్. ఆ బృందగానంతో పాటు ఇతర వివరాలన్నీ, అయిదు నిమిషాల క్రితమే నా శ్రేయోభిలాషి చేతికి చేర్చాను. నేను గంటలోగా క్షేమంగా అతడ్ని కలుసుకోకపోతే, అతన్ని తిన్నగా క్రైంబ్రాంచి అధికారుల్ని కల్సుకుని కథ చెప్తాడు. అంచేత కేవలం డబ్బుతో మాత్రం నువ్వు యిక్కడికి రావాలి! అర్థమైందా?"

"నువ్వు చెప్తోందంతా నిజమే అని తేల్చుకున్నాక, నీకు ఎంతో కొంత యివ్వడానికి ప్రయత్నిస్తాను ..." విరూపాక్షరావు బింకంగా అన్నాడు.

"చెప్పిందంతా నిజమే అని చిటికెలో నిరూపిస్తాను. ఆదలా వుంచు. ఎంతో కొంత కాదు; అడిగినంతా యిస్తావ్! ఇదిగో, నీ శిష్యుడు పోతరాజు నీతో మాట్లాడు తాడు...." అంటూ మనోజ్ టెలిఫోన్ని పోతరాజు దగ్గరగా తీసుకెళ్ళాడు. రిసీవర్ని, కిల్లకిలా పడున్న పోత రాజు నోటికీ, చెవికీ సర్ది పట్టుకున్నాడు. పోతరాజు వెంటనే ప్రారంభించాడు.

"బాస్....బాస్....అతనడిగింది ఇచ్చేసి మమ్మల్ని తీసికెళ్ళండి! ఆలస్యం చేయకండి...."

"..... ..... ....."

"బాసు....బాస్, సందేహం లేదు. మళ్ళా వాళ్ళ చేతుల్లో ఇరుక్కోడం మనకి ప్రమాదం. ప్రాణాలకోసం మేం అంతా కక్కేయాల్సి వుంటుంది....! బాస్.... త్వరగా...."

"..... ..... ....."

పోతరాజు వొంగి నించున్న మనోజ్ని మెరుస్తున్న కళ్ళతో చూశాడు. "బాస్ నీతో మాట్లాడుతాడు...."

"యస్?" రిసీవర్ని తన చెవికి ఆనించుకుంటూ అన్నాడు మనోజ్.

"ఇస్తాను. అడిగింది ఇస్తాను. ఆ తరవాత మోసం చేయవుగా!" విరూపాక్షరావు కంఠం సందేహిస్తూ అడిగింది.

"విరూపాక్షరావ్, మోసం నీ ఇంటి పేరు! ప్రశ్నలు అడుగుతూ బేరాలు చేస్తూ వాగ్దానాలు చేయించే స్థితిలో నువ్వు లేవు! అది గుర్తుంచుకో, ఇందాకా నే నిచ్చిన యే హెచ్చరికని నువ్వు నిర్లక్ష్యం చేసినా, నీ శిష్యుల్ని రాబందులు తన్నుకుపోతాయ్! ఇంకా నలభై నిమిషాలు

కూడా లేదు! క్విక్!" అంటూ మనోజ్ రిసీవర్ని క్రేడిల్ మీద పడేశాడు. నవ్వుతూ పోతరాజునీ, జాకీనీ చూశాడు.

వాళ్ళ కళ్ళల్లో ఏదో ఆశ్చర్యం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. ఇందాకటి కంగారు కొద్దిగా తగ్గినట్టు వాళ్ళ చూపులు చెప్తున్నాయి. మనోజ్ మరో సిగరెట్ వెలిగించాడు....

•  •  •

టవర్ క్లాక్ సమీపంలో, రోడ్డువారగా కారు ఆగింది.

ఇంజన్ని ఆఫ్ చేసి, డోరు తెరుచుకుని అతను దిగాడు. వెనుక డోర్ తెరిచి, సీటుమీదున్న నల్లటి సూట్ కేస్ ని ఇవతలికి లాగాడు. రెండు డోర్లూ మూసి తాళం వేసి పళ్ళమధ్య ఇరుక్కున్న ఆరిపోయిన పైప్ ని తీసి బోనెట్ మీద టకటక కొట్టి బూడిదని రాల్చేశాడు.

ఖాళీ చేసిన పైప్ ని కోటుజేబులో పడేసుకుని రోడ్డమ్మట నడక ప్రారంభించాడు. డిక్కీలో నక్కి దాక్కున్న హనుమాన్ టకటక శబ్దాన్ని విని వుంటాడు.

చేతిని కిందికి లాగుతున్న సూట్ కేసుని మరో చేతిలోకి మార్చుకుంటూ అతను బరువుగా అడుగులేస్తున్నాడు. అతను తటాలున ఆగాడు. అతని గుండె దడదడ కొట్టుకుంది. వెనుక మెత్తగా అడుగుల చప్పుడు!

అతను మెల్లగా తలతిప్పి వెనక్కి చూశాడు. రోడ్డు మీద ఎవ్వరూ లేరు. దూరంలో తన కారు నల్లగా అవుపిస్తోంది. అడుగుల చప్పుడుని తను ఊహించుకున్నాడు! ధైర్యంగా నిట్టూరుస్తూ అతను నడక ప్రారంభించాడు. రోడ్డు నిర్మానుష్యంగా వుంది. ఏ వాహనాలు తిరగడం

లేదు. అతను మళ్ళీ ఆగాడు. దూరం నుంచీ ఏదో చప్పుడు లీలగా వినిపించింది. అతను తిరిగిచూడలేదు. అది తన కారు డిక్కీ మూసుకున్న చప్పుడని అతనికి తెలుసు! హనుమాన్ అలర్ట్‌గా వున్నాడు....

కాసేపట్లో రోడ్డుకి ఎడమవైపున్న గేటు ముందు అతను ఆగాడు. బరువుగా వున్న సూట్ కేస్ తనని కింద పెట్టేయమని చెప్తోంది. నుదుర్ని కమ్మిన చెమట తుడుచుకుని, అతను గేటుమీద చెయ్యి వేశాడు. అతని వొళ్ళు వొక్కసారి జలదరించింది. శరీరంమీద వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. మెడమీద యేదో చల్లగా తాకింది....

"విరూపాక్షరావ్, సూట్ కేసుని నెత్తిమీద పెట్టుకుని, రెండు చేతుల్తో పట్టుకో; రైల్వే పోర్టరులా. కదలకుండా నుంచో!" వెనకనుంచీ సన్నటి కంఠం స్పష్టంగా హెచ్చరించింది. మెడ దగ్గరగా సేఫ్టీ కాచ్ రిలీజ్ అయిన చప్పుడు అతనికి వినిపించింది.

అప్రయత్నంగా గేటుమీదున్న చేతిని తీసి. సూట్ కేసుని తలమీద పెట్టి పట్టుకున్నాడతను. వెనుక నుంచీ యేదో చెయ్యి అతని కోటు జేబుల్నీ, పాంటు జేబుల్నీ తడువుతోంది.

"ఆల్ రైట్. కాలితో గేటుని తోస్తూ కదులు!" వెనుక నుంచీ హెచ్చరించింది మనోజ్ కంఠం.

రివాల్వర్ని జేబులో వేసుకోనందుకు సంతోషిస్తూ విరూపాక్షరావు సూట్ కేసు మోస్తూ ముందుకి కదిలాడు. రివాల్వర్ కొన మెడమీంచీ వీపు వెనుక భాగంలో, గుండె సరిహద్దుల్లోకి పాకి, ఆగింది.

రెండు నిమిషాల్లో మనోజ్ అతన్ని గుమ్మం దాటించి

హాల్లోకి, అక్కణ్నుంచీ గదిలోకి తోలుకెళ్ళాడు. తిరగేసిన బెంచీల్లో ఇరుక్కున్న తన శిష్యుల్ని వెంటనే గుర్తించలేక పోయాడతను.

"నెత్తిమీది బరువుని టేబుల్ మీదికి దించి, చేతుల్ని వెనక్కి పెట్టుకో!" మనోజ్ ఆజ్ఞాపించాడు.

"మనోజ్, నీకు కావాల్సింది తెచ్చాను. నన్ను విసిగించకు!" సూట్ కేస్ ని టేబుల్ మీద పెడుతూ విసుగ్గా కసిరాడు విరూపాక్షరావు.

"మాట్లాడకు! చెప్పింది చెయ్!"

గేటుదగ్గర అతని జేబులోంచీ తీసుకున్న తాళంచెవిని విరూపాక్షరావు చేతిలో పెట్టాడు మనోజ్.

"విరూపాక్షరావ్. నీ సూట్ కేసుని నీ స్వహస్తాలో తెరు! తాళం తెరిస్తే పేలేలాగా యేదేనా యేర్పాటు చేశావేమో చూద్దాం!" మనోజ్ నవ్వుతూ అన్నాడు.

"పిచ్చిగా మాట్లాడకు" విరూపాక్షరావు కోపంగా ప్రారంభించాడు.

"నోరు మూసుకో! తాళం తెరు!"

విరూపాక్షరావు కిక్కురుమనకుండా తాళం తెరిచాడు. నిండుగా పేర్చిన వంద రూపాయల నోట్లకట్టల్ని తలవాల్చి చూశాడు మనోజ్.

"ఆల్ రైట్! చేతుల్ని వెనుక పెట్టుకో!"

విరూపాక్షరావు బుసకొడ్తూ చేతుల్ని తన వెనక్కి పోనిచ్చాడు. అతని రెండు మణికట్లకీ యేదో చల్లగా, గట్టిగా తగిలింది. క్లిక్కుమన్న చప్పుడైంది.

"మనోజ్, ఏమిటిది?" విరూపాక్షరావు కోపంగా అరిచాడు; తన చేతుల్ని బంధించినవి బేడీలని గ్రహించి.

మనోజ్ అతని ముందుకి జరిగి నవ్వుతూ చూశాడు.

విరూపాక్షరావు మొహం కందగడ్డలా వుంది. చెమట బిందువులుగా మెరుస్తోంది. కళ్ళల్లో ఎర్రజీర అతని ఆగ్రహానికి గ్రాఫులా వుంది.

"విరూపాక్షరావ్, నువ్వు ఆరితేరిన ఘటమని నాకు తెలుసు. నాలాంటి అమెచూర్స్‌ని అవలీలగా బోల్తా కొట్టించగలవు! నువ్వు నా హెచ్చరికని అలక్ష్యం చేశావు ..."

విరూపాక్షరావు అర్థంకానట్టు చూశాడు.

"కారు డిక్కీలో నీ తోక—హనుమాన్‌ని దాచి తెచ్చావ్! ఆ అపరాధానికి శిక్ష బేడీల రూపంలో నీ చేతుల్ని తగులుకుంది!" మనోజ్ చూపులు సూదుల్లా విరూపాక్షరావు కళ్ళలోకి గుచ్చుకున్నాయి.

విరూపాక్షరావు కనుబొమలు పైకి లేచాయి. క్షణంలో రెప్పలు వాలిపోయాయి. అయితే డిక్కీని చప్పుడు చేసింది హనుమాన్ కాదన్నమాట! అతనిలో ఆశ్చర్యంగా ఆలోచనలు సాగుతున్నాయి.

"విరూపాక్షరావ్, నీ శిష్యులిద్దర్నీ, నీ పర్సనల్ ఫిజిషియన్నీ చూడవూ?" మనోజ్ కంఠం వెటకారంగా అతన్ని హెచ్చరించింది.

అతను తలెత్తాడు. బెంచీల్లోపల బల్లుల్లా అతుక్కున్న పోతరాజూ, జాకీ ఆత్రంగా అతన్నే చూస్తున్నారు. వాళ్ళ కళ్ళల్లో భయం, ధైర్యం రెండూ అవుపిస్తున్నాయి. విరూపాక్షరావు చూపులు కుర్చీలో అచేతనంగా కూచున్న డా॥ సంజీవరావువేపు తిరిగాయి. అతని మొహంమీద ఎండిపోయిన ఎర్రటి చారికలు భయంకరంగా వున్నాయి. డా॥ సంజీవరావు అతన్ని రెప్ప వేయకుండా చూశాడు.

"రావుగారూ, విగ్రహంలా నుంచోకండి. అతనికి కావాల్సింది పారేసి, ఇక్కణ్నుంచీ పంపేయండి!" వణికే కంఠంతో ఆత్రంగా అన్నాడతను.

తన అనుచరుల్ని మరోసారి మౌనంగా చూశాడు విరూపాక్షరావు. అతని మొహం బిగుసుకుపోయింది. దెబ్బ తిన్న వాలకంతో మనోజ్‌ని తదేకంగా చూశాడతను.

"పాతిక లక్షలు. ఎందుకో, వాళ్ళని—మమ్మల్ని వదిలెయ్!" అన్నాడతను ఆగ్రహాన్ని దిగమింగుతూ.

మనోజ్ చిన్నగా నవ్వాడు. "పాతిక లక్షలు ఒకటో వరకు మాత్రమే! రెండో దాన్ని మరచిపోతున్నావ్!"

"ఏమిటది? డోంట్ వేస్ట్ టైమ్!" విరూపాక్షరావు ఉరుముతూ చూశాడు.

మనోజ్ అతని యెదురుగా టేబుల్ మీద కూచుని, కాళ్ళని వూగించాడు. విరూపాక్షరావుని తదేకంగా చూశాడు.

"డా॥ సంజీవరావు సప్లై చేసిన సైనైడ్‌ని మా వదిన పాలగ్లాసులో కలిపినట్టు పోలీసు రాజా, జాకీ వొప్పుకున్నారు. గీతని మానభంగం చేసి, తలగడా నొక్కిపట్టి హత్య చేసినట్టూ, అదంతా మా అన్నయ్యే చేసిన విధంగా చిత్రించినట్టూ యుగళగీతం పాడుతూ అంగీకరించారు. అలాగే అమాయకంగా నీ కోసం సాక్ష్యం పలికిన బలహీనుల్ని సంహరించినట్టూ వాళ్ళు వొప్పుకున్నారు. చచ్చిపోయిన శాస్త్రీ అడ్వొకేట్ అన్నారావుని హతమార్చిన విషయం కూడా వాళ్ళు ప్రమాణ

పూర్వకంగా చెప్పారు.

ఒక్క ముక్కలో చెప్పాలంటే, ఎవరెవర్ని ఎవరెవరు ఎప్పుడు ఎలా చంపారో వాళ్ళు—పాపం—చాలా విశదంగా వివరించారు. కానీ, అడ్వొకేట్ కరుణాకర్ భార్యనీ, గీతనూ చంపి, ఆయన జెయిలుపాలయ్యేలా నాటకం యెందుకు ఆడబడిందో వాళ్ళు చెప్పలేకపోయారు...." మనోజ్ ఆగి, సిగరెట్ వెలిగించాడు.

విరూపాక్షరావు మొహంమీది గాంభీర్యత మాయమైపోయింది. అతను తన చూపుల్ని పోతిరాజు వైపు తిప్పాడు. ఆ చూపుల్లో ప్రత్యక్షమవుతున్న క్రోధం, ఆవేశం మనోజ్ చూపుల్నుంచీ తప్పించుకోలేకపోయాయి.

"బాస్....అయామ్ సారీ.... కరెంట్ ఇస్త్రీ పెట్టెతో మమ్మల్ని సాఫీ చేయబోయాడతను .... చెప్పక తప్పలేదు........" పోతిరాజు సంజాయిషీ యిచ్చాడు.

పాము బుసలా విరూపాక్షరావు నిట్టూర్చాడు. చూపుల్ని మనోజ్ వైపు తిప్పాడు.

"నీ రెండవ కోరిక ...."

"కోరిక కాదు: కండిషన్!" మనోజ్ నవ్వుతూ అన్నాడు. "ఇంతకాలం జరిగిన హత్యలూ అన్యాయాలూ—నీ పథకమే అని తేలింది. చాలా బలమైన కారణం వుంటేగానీ యిలాంటి దారుణ చర్యని ఎవరూ ప్లాన్ చేసి అమలు జరపరు! మా అన్నయ్యకి నువ్వు చాలా, చాలా పెద్ద శిక్ష విధించావు. ఎందుకు?"

విరూపాక్షరావు పెదిమలు చివర్లో కొద్దిగా కది

లాయి. "మనోజ్, నా మనుషులు నీ టార్చర్ని భరించలేక యేదేదో వాగేస్తున్నారు. ఆ వాగడం నీకు నచ్చేలా వాగేస్తున్నారు! అనవసరంగా నువ్వు నన్ను అనుమానిస్తున్నావు నిజం...."

"విరూపాక్షరావ్, అనవసరంగా మాట్లాడితే అలసిపోతావ్! నాకు చాలా చాలా తెలుసని నీకు తెలీదు. నీ డాబుసరీ, హుందా, ఐశ్వర్యం అంతా చూసి, నిజాన్ని యెదుర్కొనే గుండె నిబ్బరం నీలో వుందని అపోహపడ్డాను!" మనోజ్ వెటకారంగా అన్నాడు.

"మనోజ్!"

"విరూపాక్షరావ్, నిద్ర నటించొద్దు; నీ రహస్యాలన్నీ నా గుప్పిట్లో వున్నాయి. గుప్పిట తెరిస్తే నీ గుట్టు రట్టయి, నీ ఆట కట్టవుతుంది. అంచేత మేల్కొని ఆలోచించు! నాశనమైపోయిన నా అన్నయ్య జీవితం యింక బాగుపడదు. చచ్చిపోయిన మా వదినా, గీతా తిరిగి రారు. అలాగే అన్నారావూ, అతని తల్లీ నీ చర్య నాకెంతో నష్టాన్ని కలిగించింది. ఆ నష్టాన్ని పూడ్చడానికే నేను నిన్ను చదివింపులు చేయమన్నాను. ఆ పాతిక లక్షలు ఆ నష్టాన్ని కొద్దిగా పూడ్చగలవు తతిమ్మా దాన్ని నువ్వు మరో విధంగా పూడ్చాలి...."

"ఏ విధంగా?...." విరూపాక్షరావు అడ్డు తగిలాడు.

"మా అన్నయ్యని యిలా సర్వనాశనం యెందుకు చేశావో నాకు తెలియాలి. అది నువ్వు చెప్తావ్!"

విరూపాక్షరావు నమ్మలేనట్టు చూశాడు. కనిపించని బోను కోసం వెతికే ఎలుకలా అతని కళ్ళు మనోజ్ మొహంలోకి చూశాయి.

"అంతేనా?"

"అంతే! ఆ విషయం తెలుసుకోడానికే ఇంత కాలం నేను వేటాడాను. నా అన్వేషణ నన్ను నీ దగ్గరకు చేర్చింది. ఏ కారణం నీ చేత యింత ఘోరం చేయించిందో తెలుసుకోవాలన్న కోరిక నాలో బలంగా కలిగింది. ఏమిటది?"

విరూపాక్షరావు రెప్ప వేయకుండా చూశాడు. "చెప్పే నీ మాట నిలబెట్టుకుంటావని గ్యారంటీ యేమిటి?"

మనోజ్ సిగరెట్ పీకని కింద పడేశాడు. నవ్వుతూ అతన్ని చూశాడు. "గ్యారంటీ యేమీ లేదు. గ్యారెంటీ కోసం నువ్వు నాతో బేరం చేయలేవు కూడా! నువ్వు యిచ్చిన డబ్బుతో, చెప్పబోయే 'నిజం'తో తృప్తిపడి నా దారిన నేను పోతాను. విరిగిపోయిన పాలని పూర్వ స్థితికి తీసుకురాగలనన్న నమ్మకం నాకు లేదు! మా అన్నయ్య జీవితాన్ని మునుపట్లా చేయలేను. ఎవ్వరూ కాలాన్ని వెనక్కి తిప్పలేరు! నా శ్రమకి పారితోషికం లభించాక, నిన్నూ, అన్నయ్యనూ మరచిపోయి నా దారిన నేను పోతాను. శాంతిగా జీవితం గడపాలని నాకుంది. కేసులూ, కోర్టులూ—ఈ రొచ్చులో దిగే కోరిక నాకు లేదు!"

విరూపాక్షరావు తటపటాయించాడు. "మనోజ్, మీ అన్నయ్యకు ద్రోహం చేసినవాళ్ళని అంతం చేయాలని నాతో అన్నావు. ఆ ప్రతీకార వాంఛ యేమైంది? దాన్నంతా ఎందుకు మరచిపోతున్నావ్?"

"పాతిక లక్షల కోసం....!" మనోజ్ నవ్వుతూ అన్నాడు.

విరూపాక్షరావు అతని కళ్ళల్లోకి వెతుకుతూ

చూశాడు. రెండు క్షణాల తర్వాత అతని కళ్ళు నవ్వాయి ఆ నవ్వు అతని పెదాలమీదికి పాకింది.

"మనోజ్, నువ్వు తెలివైనవాడివి. కంగ్రాట్స్;" అన్నాడు నవ్వుతూ. మనోజ్ ప్రశ్నార్థకంగా చూశాడు.

"డబ్బు విలువ నీకు తెలిసినంతా మీ అన్నయ్యకు తెలీదు!" విరూపాక్షరావు మెల్లిగా అన్నాడు.

"వాట్?"

"యస్!" విరూపాక్షరావు నవ్వుతూ అన్నాడు. "కరుణాకర్ డబ్బును గడ్డిపరకలా చూశాడు. డబ్బున్న, డబ్బు విలువ తెలిసిన నన్ను నిర్లక్ష్యం చేశాడు; అవమానించాడు!"

మనోజ్ మాట్లాడకుండా ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయాడు.

"నా మేనల్లుడు ఒక కేసులో యిరుక్కున్నాడు. పిల్లలు లేని నాకు వాడే సర్వస్వం. దురదృష్టవశాత్తూ వాడు చేసిన నేరం ఒక రకంగా తీవ్రమైందే. నా శ్రేయోభిలాషులైన నలుగురు లాయర్లు వాడికి ఉరి-శిక్షో, జీవితఖైదో పడుతుందన్నారు. వాడిని కోర్టులో డిఫెండ్ చేయడానికి చాలా చాకచక్యం కలిగిన లాయర్ కావాలన్నారు. అందరూ కరుణాకర్ని రికమెండ్ చేశారు. కేసుని స్వయంగా టేకప్ చేయడానికి వాళ్ళు జంకారు. నా కేసు వోడిపోవడం నాకు-గే వాళ్ళకీ యిష్టంలేదు...." విరూపాక్షరావు ఆగి, మళ్ళీ ప్రారంభించాడు.

"నా తరఫున వాళ్ళు కరుణాకర్ని కలుసుకున్నారు. కేసు వివరించారు. బోలెడంత ఫీజు ఆఫర్ చేశారు. కానీ

కరుణాకర్ తిరస్కరించాడు. అపరాధం చేసిన వ్యక్తి తరఫున తను వాదించనన్నాడు. అంతవరకూ తెర వెనకున్న నేను బైటపడి. స్వయంగా అతన్ని కలుసుకున్నాను. బ్రీఫ్‌కేస్‌లో నోట్లు పట్టుకెళ్ళాను. అతను యింకా బలంగా నిరాకరించాడు. ధనమదాంధుల కోసం తను ప్రాక్టీస్ పెట్టలేదన్నాడు. అతన్ని బతిమాలాను.

తప్పు చేసిన వ్యక్తి తప్పించుకోడం అనాదిగా జరుగుతోందనీ, కేసు తీసుకుని నా మేనల్లుడికి శిక్షపడకుండా చూడమనీ అర్థించాను...."

విరూపాక్షరావు ఆగాడు. జ్ఞాపకాలు అతని మొహాన్ని జేవురింపజేశాయి. కళ్ళు వజ్రాల్లా కఠినంగా అయ్యాయి. ఆనాటి అవమానం అతని మొహంమీద సుద్దతో రాసినట్టు కనిపిస్తోంది. మనోజ్ నోరు మెదపకుండా చూస్తున్నాడు.

"మనోజ్, జీవితంలో మొదటిసారి నేను మొదటివాణ్ణి అభ్యర్థించాను. జీవితంలో మొదటిసారి తిరస్కరించబడ్డాను. అయినా తమాయించుకుని కూడా తెచ్చిన రెండు లక్షల్నీ అతనిముందు పెట్టాను. డబ్బు తనని కొనలేదన్నాడతను గర్వంగా. డబ్బు సంపాదించగలిగింది చాలా తక్కువ అన్నాడతను ఎగతాళిగా. ఎడంచేత్తో అతను గిరాటేసిన నా బ్రీఫ్‌కేస్‌లోని నోట్లకట్టలు నా పాదాల చుట్టూ పడ్డాయి. వొంగి వాట్ని ఏరుకున్నాను. చివరిసారిగా అడిగాను.

"తను కేసు టేకప్ చేస్తే నా మేనల్లుడికి తప్పకుండా తగిన శిక్షపడేలా చూస్తానన్నాడతను ఎగతాళిగా నవ్వుతూ. నా డబ్బుని గిరాటేసి నా కోరికని నిర్లక్ష్యం చేసి, ఎగతాళిగా నన్ను చూసి నవ్విన మొట్టమొదటి

వ్యక్తిని ఆ రోజు మొట్టమొదటిసారిగా చూశాను.

"మౌనంగా అక్కణ్ణుంచీ వెళ్ళిపోయాను. 'డబ్బుతో న్యాయాన్ని కొనలేవు!' కరుణాకర్ డైలాగ్ నా గుండెల్లో చాలా రోజులు, అనుక్షణం మారుమ్రోగుతూ వుండిపోయింది. రెణ్నెల్ల తర్వాత నా మేనల్లుడికి యావజ్జీవ కారాగార శిక్ష పడింది. నెలతిరక్కముందే వాడు జైల్లో మరణించాడు. వాడు భరించలేక ఆత్మహత్య చేసుకున్నాడని నాకు తెలుసు!

"ఆ క్షణంనుంచీ, నాలో మీ అన్నపట్ల యేర్పడి నిద్రపోతున్న ప్రతీకారం మేల్కొని, పడగెత్తి బుస కొట్టడం ప్రారంభించింది. పగ నా రక్తంగా మారి ప్రవహించడం ప్రారంభించింది. డబ్బు న్యాయాన్ని కొనగలదని నిరూపించాలనుకున్నాను. కానీ వెంటనే రంగంలోకి దిగలేదు. మీ అన్నయ్య నన్నుగురించి పూర్తిగా మరిచిపోడానికి మూడేళ్ళ వ్యవధి ఇచ్చాను. తర్వాత బ్రహ్మాండంగా ప్లాన్ చేసి నాటకం నడిపాను. డబ్బుతో న్యాయాన్ని కొన్నాను!"

విరూపాక్షరావు ఆగి, సగర్వంగా చూశాడు. అతని మొహం చెమటతో మెరుస్తోంది. కళ్ళు రాక్షస సంతృప్తితో తళతళమంటున్నాయి. మనోజ్ అర్థమైనట్టు తలాడించాడు.

"ఎవరు చేశారో తెలీకపోయినా, తన విషయంలో డబ్బు న్యాయాన్ని కొనేస్తోందన్న సత్యం మీ అన్నయ్యకు తట్టివుంటుంది" విరూపాక్షరావు ముగించి నవ్వాడు.

మనోజ్ నిట్టూర్చాడు. "విరూపాక్షరావ్. చిన్న తప్పుకి పెద్ద శిక్ష—చాలా పెద్ద శిక్ష విధించావు నువ్వు!"

విరూపాక్షరావు తల అడ్డంగా ఆడించాడు. "అతని తిరస్కారం నన్ను గాయపరిచింది. అతని నిరాకరణ యువకుడైన నా మేనల్లుడిని, తల్లీ తండ్రీ ఇద్దరూ లేని నా మేనల్లుడిని బలితీసుకుంది! ఆ రెండింటికీ కలిపి, తగిన శిక్ష విధించాను! మనోజ్, నాకు నిన్ను చూస్తుంటే సంతోషంగా వుంది. ఏ డబ్బుని మా అన్నయ్య నిర్లక్ష్యం చేసి అగౌరవించాడో, ఆ డబ్బుని నువ్వు గౌరవించావు! నాకు తెలిసినట్టే డబ్బు విలువ నీకు తెలుసు! కంగ్రాట్స్!" అన్నాడతను నవ్వుతూ.

మనోజ్ నిలబడ్డాడు విరూపాక్షరావుని చూశాడు. "విరూపాక్షరావ్, ధైర్యంగా నిజం చెప్పినందుకు మెచ్చుకుంటున్నా. నన్ను కంగ్రాచ్యులేట్ చేసిన నిన్ను ఒకటి అడుగుతాను. దానికి నువ్వు అంగీకరిస్తే మన పని పూర్తవుతుంది. నీ దారి నీది; నా దారి నాది!"

"ఏమిటది?" విరూపాక్షరావు ఆశ్చర్యాన్ని దాచుకోలేకపోతూ అడిగాడు.

"గతాన్ని తవ్వడం దండగని నేను తెలుసుకున్నా. ఇంటిని కాల్చిందెవరో తెలుసుకోడంవల్ల లాభంలేదు. దాన్ని బాగుచేసుకోవాలి. నేను ఎలాగో మా అన్నయ్య శిక్షని తగ్గించడానికి ప్రయత్నిస్తాను. అందుకోసం ధారాళంగా వ్యయం చేస్తాను. ఆ ప్రయత్నంలో నువ్వు నాకు అడ్డుతగలనని హామీ ఇవ్వాలి. హామీ యిచ్చి మాట తప్పితే, అప్పుడుకూడా నేను నీ భాగోతాన్ని బహిరంగం చేస్తాను...."

విరూపాక్షరావు ఘొల్లున నవ్వాడు. "నేను అనుకున్న కసి తీర్చుకున్నాను. జీవితాంతం అతను జైల్లో మగ్గినా, జీవచ్ఛవంలా రోడ్లమీద బతికినా—నాకేం

అభ్యంతరం లేదు. నాకు రెండూ ఒకటే! నా దృష్టిలో, నన్ను అవమానించి రెచ్చగొట్టిన ఆ వ్యక్తి ఏనాడో మరణించాడు.

మనోజ్ తలపంకించాడు. "అయితే ఇంతకుముందు అప్పీలు వెళ్ళబోతున్న లాయర్ రంగనాథంని ఎందుకు బెదిరించావు?"

"అతను కానీ, మరొకడు కానీ లోపలికంటూ తవ్వుకుంటూ వెళ్ళి, నన్ను కెలకడం నాకు ఇష్టంలేదు. ఇప్పుడు నువ్వు అంతా తెలుసుకున్నావు. ప్రస్తుత పరిస్థితి వేరు! గతంతో, నాతో అవసరంలేదని నువ్వు పాతిక లక్షలు తీసుకుంటూ నిరూపిస్తున్నావ్!" విరూపాక్షరావు నవ్వుతూ అన్నాడు.

"విరూపాక్షరావ్, నువ్వు వచ్చిన పని అయ్యింది. ఇక నువ్వు వెళ్ళొచ్చు...."

"వాళ్ళు?" విరూపాక్షరావు అడుగగిలాడు ఆత్రుతగా. మనోజ్ నవ్వాడు. "వాళ్ళుకూడా. అన్నట్టు డిక్కీలో తలబొప్పికట్టి స్పృహలేకుండా పడున్న హానుమాన్‌ని కూడా నువ్వు తీసికెళ్ళొచ్చు..." అంటూ మనోజ్ వాచీ చూసుకున్నాడు.

తలుపు చప్పుడైంది.

విరూపాక్షరావు ఉలిక్కిపడి తలతిప్పి చూశాడు. అతని కళ్ళు విచ్చుకున్నాయి. ఆశ్చర్యంతో అతని నోరు తెరుచుకుంది.

క్రైమ్‌బ్రాంచ్ చీఫ్ ఆత్మారామ్ గదిలోపలికి వస్తున్నాడు. అతని వెనకే నలుగురు సీనియర్ పోలీస్ ఆఫీసర్లూ, అరడజనుమంది సాయుధ పోలీసులు గదిలోకి దూరారు. విరూపాక్షరావు కళ్ళు చిట్లించాడు. సాయుధ

పోలీసులు ఆరుగురూ బెంచీలకి అతుక్కున్న పోతరాజునీ, జాకీని చుట్టేసి అలర్టుగా నిలబడ్డాడు.

తన యెదురుగా నిలబడ్డ ఆత్మారామ్‌నీ, అతని కిరు వైపులా వున్న యిద్దరు ఇన్‌స్పెక్టర్లనీ వాళ్ళ చేతుల్లో ఇరుక్కుని తనవేపే చూస్తున్న రివాల్వర్లనీ విరూపాక్షరావు అయోమయంగా చూశాడు.

"విరూపాక్షరావ్, చాలా నేరాల వెనక మాస్టర్ మైండ్‌గా వ్యవహరించిన నిన్ను అరెస్టు చేస్తున్నా!" చీఫ్ ఆత్మారామ్ అన్నాడు.

విరూపాక్షరావు నమ్మలేనట్టు చూశాడు. "ఆఫీసర్... మీరు పొరపాటు చేయబోతున్నారు....నిష్కారణంగా.."

"అసరమైనదానికన్నా అధికంగా కారణాల్ని నువ్వే స్వయంగా చూపించావ్, విరూపాక్షరావ్!" చీఫ్ ఆత్మారామ్ నవ్వుతూ అన్నాడు.

"ఆఫీసర్, నా సంగతి...." ఎర్రటి కళ్ళతో నిప్పులు చెరుగుతూ ప్రారంభించాడు విరూపాక్షరావు.

"పూర్తిగా తెలుసు! నువ్వే వోపిగ్గా వివరించావ్. బెంచీలకి అతుక్కున్న నీ శిష్యులు చాలా కథలు చెప్పారు. పవర్ ఫుల్ మైక్రోఫోన్స్ సాయంతో పక్క గదిలోంచీ నాతో బాటు ఈ నలుగురు సీనియర్ పోలీసాఫీసర్లు విన్నారు. నువ్వు పలికిన ప్రతి అక్షరమూ రికార్డు చేయబడింది. నిన్నూ, నీ శిష్యులీ అరడజనుసార్లు ఉరితీయడానికి అవసరమైనన్ని సాక్ష్యాలు మీ ముగ్గురి స్టేట్‌మెంట్స్‌లో, డాక్టర్ స్టేట్‌మెంట్‌లో వున్నాయి! మనోజ్‌కి నువ్విచ్చిన నోట్లకట్టలూ సాక్ష్యం చెబుతాయి." అంటూ చీఫ్ ఆత్మారామ్ ఇన్‌స్పెక్టర్లవైపు చూసి సైగ చేశాడు.

ఇన్‌స్పెక్టర్ రాధానాథ్, మనోజ్ అందించిన తాళాలతో బేడీల్ని తీసేసి, తన చేతిలోని బేడీల్ని విరూపాక్షరావు చేతులకి తగిలించాడు. విరూపాక్షరావు నిష్ప్రాణాల్లా వున్న కళ్ళతో మనోజ్‌ని రెప్పవేయకుండా చూస్తూ వుండిపోయాడు. మొహమ్మీద చిరునవ్వు తాండ విస్తోంది. ఆ చిరునవ్వు వేడిగా విరూపాక్షరావు హృదయాన్ని కాల్చుతోంది.

కాసేపట్లో, నైలాన్ తాళ్ళనుండీ విడుదల చేయబడిన పోతరాజా, జాకీ బేడీలతో నిస్సహాయంగా నిలబడ్డారు. మనోజ్ కుర్చీలో కూచున్న డా॥ సంజీవరావు దగ్గరగా నడిచాడు. అతన్ని బంధించిన తాళ్ళని విప్పేశాడు. నవ్వుతూ అతన్ని చూశాడు.

"డాక్టర్! నాటకం పూర్తయ్యింది. మీ మొహానికి వున్న ఎర్ర రంగుని కడిగేసుకోండి. మీ కళ్ళజోడు పగలగొట్టినందుకు చింతిస్తున్నా. థాంక్స్ ఫర్ యువర్ కోఆపరేషన్!"

సంజీవరావు తలాడించాడు.

"ఇన్‌స్పెక్టర్, వీళ్ళని జాగ్రత్తగా తీసికెళ్ళి లాకప్‌లో భద్రపరచండి!" చీఫ్ ఆత్మారామ్ ఆజ్ఞాపించాడు.

• • •

గదిలో మనోజ్, ఆత్మారామ్ నలుగురు పోలీసాఫీసర్లూ, జయసింహా, అతని పక్కనే ఇందుశేఖా కూచున్నారు. టీ తాగడం ముగించి జయసింహా మనోజ్ వైపు నవ్వుతూ చూశాడు.

"మనోజ్, మాట నిలబెట్టావ్ కంగ్రాట్స్!"

"థాంక్యూ సర్. మీకూ ఆత్మారామ్‌గారికీ, ఇందు

లేఖకీ నేను ధన్యవాదాలు చెప్పుకోవాలి. ముఖ్యంగా ఆత్మారామ్‌గారికి. నాకు తెలీకుండా ఆయన నన్ను ఫాలో అయ్యారు. సరైన క్షణంలో తెర వెనుకనుంచీ రంగప్రవేశం చేశారు. ఆయన చాకచక్యం నన్ను ఆశ్చర్యంలో ముంచేసింది!" మనోజ్ ఆత్మారామ్‌వైపు చూస్తూ అన్నాడు.

"ఇటీజ్ నథింగ్! నా ఆఫీసులోంచీ ఆధారాలు సంపాయిస్తానంటూ నువ్వు వెళ్ళేక, సమర్థులైన యిద్దరు వ్యక్తుల్ని నిన్ను నీడలా ఫాలో కమ్మని ఆర్డరిచ్చాను. సమయం చూసి సెట్‌లోకి దూకాం!" అంటూ ఆత్మారామ్ కరోనా సిగార్ వెలిగించాడు. పొగ ఊదుతూ మనోజ్ వైపు చూశాడు.

"మనోజ్, డబ్బుతో, పలుకుబడితో చుట్టూ కంచు కోటలు కట్టుకున్న విరూపాక్షరావు విషవలయాన్ని విచ్ఛిన్నం చేయడంలో నువ్వు ఊహించని విధంగా విజయం సాధించావు. నువ్వే లేకపోతే చట్టం అతన్ని ఇంత త్వరగా బంధించి వుండేది కాదేమో! హృదయ పూర్వకంగా నిన్ను మెచ్చుకుంటున్నా. అన్నట్టు త్వరలో, మీ అన్నయ్య స్వేచ్ఛా వాయువుల్ని పీలుస్తాడు!"

"థాంక్యూ సర్!" మనోజ్ వినయంగా అన్నాడు.

తలుపు చప్పుడైంది. నూరీ డ్రెస్‌లో వున్న రంజన గదిలోకి వస్తోంది. తన తండ్రి జయసింహా పక్కనే కూచుని తలవాల్చి అతని చెవిలో యేదో చెప్పింది. జయసింహ మొహం విప్పారింది. నవ్వుతూ అందర్నీ కలయ జూస్తూ అతను లేచి నిలబడ్డాడు.

"మీ అందరికీ ఒక శుభవార్త! మనోజ్‌కీ, నా

మిత్రుడు స్వర్గీయ అన్నారావు కూతురు ఇందులేఖకీ నా ఆధ్వర్యంలో, నా ఇంట్లో వివాహం జరుగుతుంది!" జయసింహా సగర్వంగా ఎనౌన్స్ చేశాడు.

అందరూ చప్పట్లు కొట్టారు. ఒళ్ళు మరిచిపోయి ఉత్సాహంతో చప్పట్లు చరుస్తున్న మనోజ్‌ని ఇందులేఖ చిరునవ్వుతో వోరగా చూడసాగింది.

—: సమాప్తం :—

ఆంధ్ర అపరాధ పరిశోధక సాహితీ ప్రక్రియను అద్భుతంగా రూపొందించిన సాహితీశిల్పి కీ. శే. టెంపోరావుగారికి

ఈ నవల అంకితం.

—వి. యస్. రావ్

# కిరాయి హంతకుడు

## పాణిబాబు

మంత్రిగారు వేదిక పైకి ఆహ్వానింపబడ్డారు.

ఒక్కసారిగా చప్పట్లతో మారుమ్రోగిపోయింది ఆ ప్రాంతం.

ముందువరసలో కూర్చున్న మంత్రిగారు లేచి వేదిక పైకి వెళ్ళారు. అక్కడ నిల్చుని సభకు నమస్కరించారు. ఆ తర్వాత మొదలైంది పూలదండల కార్యక్రమం.

ఒకరి వెనుక ఒకరు వచ్చి పూలదండలు వేయసాగారు. నలుగురి తర్వాత మెడలో దండలన్నీ తీసి బల్లపై వుంచారు మంత్రిగారు. ఉపన్యాసం మొదలు పెట్టడానికి మైకు ముందుకు వచ్చారు.

అప్పుడే స్టేజీపైకి వస్తున్న యువకుడిని చూసి విసుగ్గా మొహం పెట్టారు. అయితే అతని చేతిలోని దండ చూసేసరికి ఆ విసుగు మాయమయింది.

పూలదండ కాదది. రూపాయల దండ. మామూలు

రూపాయలు కాదు. వంద రూపాయలతో నిలువెత్తు దండ.

వస్తూనే మంత్రిగారి కాళ్ళకు నమస్కరించాడా యువకుడు. ఒక్కసారిగా నాలుగంగుళాలు విస్తరించింది మంత్రిగారి ఛాతి. తన చేతిలో దండ మంత్రిగారి మెడలో వేసి చెప్పాడు.

“మీ ఉపన్యాసం పూర్తి అయ్యేవరకు ఈ దండ తీయకండి సార్! ప్లీజ్.”

“ఏం? ఎందుకు తీయకూడదు?”

“మీ ఉపన్యాసాన్ని వీడియో తీస్తున్నాం సార్! అటు చూడండి.”

చూశారు మంత్రిగారు. నిజంగానే వీడియో తీస్తున్నారు. మంత్రిగారి ఆనందం మరో మెట్టు పైకెగసింది.

ఆ యువకుడు వేదిక దిగిపోయాడు.

మంత్రిగారు విజృంభించి ఉపన్యసించసాగారు. కాని పది నిముషాలు కూడా సాగలేదు ఆయన వాగ్ధాటి. మెడపై యేదో చురుక్కుమంది. మరు నిముషంలో మొదలునరికిన చెట్టులా కూలబడ్డారు మంత్రిగారు. రూపాయల దండలో వున్న సైనేడ్ పిన్ను ఆయన ప్రాణాలు తీసింది.

అక్కడికి పదడుగుల దూరంలో వున్నాడు ఆ దండ వేసిన యువకుడు. సభలో గందరగోళం మొదలవగానే అతని పెదవులపై వెలిసింది ఒక చిరునవ్వు. వెంటనే అక్కడి నుండి దూరంగా వెళ్ళిపోయాడు.

## 2

రామశర్మ భవనం చీకటి సముద్రంలో స్నానం చేస్తున్నట్లు వుంది. లోపల ఎక్కడో వెలుగుతున్న దీపాలు ఆ చీకటిని పారద్రోలలేక పోతున్నాయి.

గేటు ముందు కూచున్న గూర్ఖా బద్ధకంగా ఆవులించాడు. జేబులో నుండి బీడీ తీసి నోట్లో పెట్టుకున్నాడు.

సరిగ్గా అదే సమయంలో అక్కడికి వచ్చాడొక యువకుడు. ప్రహారీగోడ వెంబడి నడుస్తూ గూర్ఖా వెనుక వైపుకు వచ్చాడు. చాలా నిశ్శబ్దంగా మెల్లగా అడుగులు వేస్తూ వచ్చాడతను.

అగ్గిపుల్ల గీసి బీడీ వెలిగించాడు గూర్ఖా. ఆ వెలుగు అతడిని తాత్కాలికంగా గ్రుడ్డివాడ్ని చేసింది. అప్పుడు కదిలాడా యువకుడు. లేడిపైకి దూకే పులిలా, కాటందుకోబోయే పాములా, అమితమైన వేగంతో కదిలాడు.

ఆఖరి నిముషంలో అతడ్ని గుర్తించాడు గూర్ఖా. కాని అప్పటికే చాలా ఆలస్యమైపోయింది.

"ఫట్" ఒకే ఒక్క దెబ్బతో మెడ ఎముక విరిగిపోయింది.

చిన్న అరుపు కూడా వెలువడకుండానే గూర్ఖా నోరు శాశ్వతంగా మూతబడిపోయింది. అతని శరీరాన్ని దాటుకుని లోపలకు ప్రవేశించాడా యువకుడు. ప్యాంటు జేబులో నుండి ఒక చిన్న సెంటు బాటిల్ బయటకు తీశాడు. ఆ భవనపు అనుపానులు బాగా తెలిసినవాడిలా ముందుకు కదిలాడు.

గుర్రుమంటూ వినబడిందొక శబ్దం. మెరుపులా అటు

చూశాడు. చీకటిలో నుండి దూసుకువచ్చింది ఆ కుక్క. డాబర్ మెన్ జాతికుక్కది. అంత చీకటిలో కూడా దాని కోరలు మెరుస్తున్నాయి. భీకరంగా నోరు తెరుచుకుని పరిగెత్తుకొచ్చింది.

కంగారుపడలేదా యువకుడు. ఒక్కడుగు కూడా వెనుకకు వెయ్యలేదు. దగ్గరకు రానిచ్చి చేతిలో స్ప్రే బాటిల్ ఆ కుక్క పైకి విరజిమ్మాడు. రాకాసిలా దూసుకువచ్చి అతని పైకి ఎగిరిందది. పూర్తిగా నెరవేరలేదు దాని ప్రయత్నం. సగంలో వుండగానే వెనక్కి పడిపోయింది. తిరిగి లేవలేదు.

చిన్న చిరునవ్వు వెలసింది ఆ యువకుడి పెదవుల పైన. లిక్విడ్ క్లోరోఫామ్ కు స్పిరిట్ తగుపాళ్ళలో జోడిస్తే కుక్కలేం ఖర్మ సింహాలే నిద్రపోతాయి. చేతిలో సెంట్ బాటిల్ జేబులో పెట్టుకున్నాడు. వాటర్ పైప్ పట్టుకుని పైకి ఎక్కాడు. పైన కిటికీ అంచు చేరగానే లోనికి దూకేశాడు.

ఆ గదిలో బెడ్ పై పడుకుని వున్నాడు రామశర్మ. రాష్ట్రంలో అత్యధిక సర్క్యులేషన్ గల తెలుగు వెలుగు పత్రిక ఎడిటర్. తన స్వార్థం కోసం అధికార పార్టీకి కొమ్ముకాస్తూ ప్రజలను తప్పుదోవ పట్టిస్తున్న మేధావి.

అతని తలప్రక్కనే వుంది ఒక ఐరన్ సేఫ్. దాన్ని తెరవగలిగితే లక్షల సొమ్ము తన సొంతం అవుతుందని ఆ యువకుడికి తెలుసు. అయినా అటు చూడలేదతను. సూటిగా రామశర్మ వైపు కదిలాడు.

సైలెన్సర్ బిగించిన రివాల్వర్ రామశర్మ నుదుటిని తాకించాడు. ట్రిగ్గర్ బలంగా ప్రెస్ చేశాడు.

రామశర్మ తలను ఛేదించుకుంటూ బుల్లెట్ లోపలికి పోయింది. ఆ వేగానికి అక్కడితో ఆగక తలగడ నుండి దూసుకుపోయి పరుపులో తిష్ట వేసింది. చిన్నగా జర్క్ ఇచ్చాడు రామశర్మ. నిద్రలోనే తనకు తెలియని ఏవో లోకాలకు వెళ్ళిపోయాడు.

తృప్తిగా నిట్టూర్చాడా యువకుడు. కాంట్రాక్టు ప్రకారం డబ్బు తీసుకున్నందుకు పని పూర్తి చేశాడు. ఇక తిరిగిపోవడమే తరువాయి. ఐరన్ సేఫ్ వైపు అసలు చూడలేదా యువకుడు. వేట ముగించుకున్న మృగరాజులా తాపీగా వెనుదిరిగాడు.

## 3

"ఇంతమంది పోలీస్ అధికార్లు వుండి ఒక్కడిని పట్టుకోలేకపోయారు. మీకు సిగ్గుగా లేదూ. ఒక రాష్ట్ర మంత్రిని రక్షించలేకపోయాం. ఒక పత్రికా ఎడిటర్ని రక్షించలేక పోయాం. ఇక మామూలు ప్రజలను ఎలా రక్షిస్తాం?"

మండిపడుతున్నారు పోలీస్ కమీషనర్. అక్కడ నిలబడ్డ పోలీస్ ఆఫీసర్స్ తల వంచుకుని నిలబడ్డారు.

"అలా బొమ్మల్లా నిలబడ్డారేం? మాట్లాడండి. మంత్రి గారిని హత్య చేసింది యెవరు?" అరిచాడాయన కోపంగా.

ఒక ఇన్స్పెక్టర్ ముందుకు వచ్చి చెప్పాడు. "ఆ నాటి కార్యక్రమమంతా వీడియో తీయబడింది సార్. ఆ దండ వేసిన వ్యక్తి అందులో కనిపించాడు. వెంటనే అతని కొరకు వెతికాం. కాని ...."

"కాని దొరకలేదు. అంతేగా. న్యూస్ పేపర్లు చూస్తున్నారా, మన డిపార్టుమెంట్ను ఎలా దుమ్మెత్తి పోస్తు

న్నారేమో? చదువుతున్నారా?" మధ్యలోనే అందుకున్నారు కమీషనర్.

"ఆచూకీ దొరికింది సార్! అతనెవరో తెలిసింది."

"తెలిసిందా? ఎవరు?"

"నల్లముత్తు సార్! రెండేళ్ళ క్రితం మద్రాస్ నగరంలో ఉరితీయబడ్డ నల్లముత్తు!" కూల్ గా చెప్పాడా ఇన్‌స్పెక్టర్.

తక్కున తెరుచుకుంది కమీషనర్ గారి నోరు. ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి ఆయన కళ్ళు.

నల్లముత్తు చిన్న పిల్లలను కిడ్నాప్ చేసి హత్యలు చేసే హంతకుడు. రెండు సంవత్సరాల క్రిందట తమిళ నాడు ప్రభుత్వం అతనిని ఉరితీసింది.

ఆ నల్లముత్తు ఇప్పుడు, ఇక్కడ ప్రత్యక్షమై మంత్రిని హత్య చెయ్యడమేమిటి? వాడు చంపేది, చంపగలిగేది చిన్నపిల్లలను మాత్రమే.

అయినా చచ్చినవాడు తిరిగిరావడమేమిటి? హత్యలు చెయ్యడమేమిటి?

"మద్రాస్ పోలీస్ డిపార్టుమెంటును కాంటాక్టు చేశాం సార్. నల్లముత్తును ఉరితీసినట్లు వాళ్ళు ధృవీకరించారు."

పోలీస్ డిపార్టుమెంటు పరువు వీధిన పడబోతుందని అర్థమైంది కమీషనర్ గారికి. ఎవరు సాల్వ్ చెయ్యగలరు తలాతోకా లేని ఈ కేసును? ఎవరు కాపాడగలరు తమ డిపార్టుమెంటు పేరు ప్రతిష్ఠ?

సరిగ్గా అదే సమయంలో తెరుచుకుంది ఆ గది తలుపు. లోపలికి వచ్చి సెల్యూట్ చేశాడు ఇన్‌స్పెక్టర్ రవి.

"సారీ సార్! చిన్న ఇన్‌ఫర్మేషన్ కొరకు వెళ్ళాను.

అందుకే లేటయింది" అన్నాడు.

"ఏమిటది?" ఆతృతగా అడిగారు కమీషనర్.

అడగకపోయినా అదే ప్రశ్న అక్కడున్న అందరి ముఖాలలో కనిపించింది.

"వీడియోలో కనబడిన వ్యక్తి నల్లముత్తు కాదు సార్! నల్లముత్తులా మేకప్ చేసుకున్న ఆ మనిషి ఒక ముఖ్యమైన విషయం మర్చిపోయాడు. నల్లముత్తు కుడిచేతికి ఆరు వేళ్ళుండాలి. కాని వీడియోలోని వ్యక్తి చేతికి మామూలుగా ఐదు వేళ్ళే వున్నాయి."

"ఈజిట్?"

"యస్ సార్! నల్లముత్తు రికార్డు అంతా చదివాను. అతని కుడిచేతికి ఆరు వేళ్ళు వుండాలి. కాబట్టి ఈ హత్య చేసింది చనిపోయిన నల్లముత్తు కాదు."

"మరి ఎవరు....ఎవరు చేశా రీ పని?"

"చేయించినవాళ్ళు తెలీదు సార్! చేసినవాడు తెలుసు. రామశర్మను హత్య చేసినా, లక్షలున్న ఐరన్ సేఫ్ ముట్టలేదంటే ఆ వ్యక్తి ప్రొఫెషనల్ కిల్లర్ అని తెలుస్తోంది. ఈ రెండు హత్యలు చేసిన మనిషి ఒక్కడే అయివుండాలి. ఇంత తెలివిగా, ప్లాన్డ్‌గా మర్డర్లు చెయ్యగల వ్యక్తి ఒక్కడే వున్నాడు. నా ఊహ నిజమయితే ఆ మనిషి...."

ఒక్క క్షణం ఆగి చెప్పాడు రవి.

"అగ్నిపుత్ర."

తమ తలలపై డైనమైట్ పేలినట్లయ్యింది అక్కడున్న వారందరికీ.

అగ్నిపుత్ర....ది డేరింగ్ డెకాయిట్. మెర్సిలెస్

కిల్లర్. డబ్బు యిస్తే కన్నతల్లి రొమ్ములు కూడా నరికివేసే కసాయివాడు.

## 4

ఆ నైట్ క్లబ్ లోపలకు ప్రవేశించాడు శివుడు. నాలుగు మూలలు కలయ చూశాడు.

కోలాహలంగా వుంది అక్కడ. ఏ మూల నుండో చక్కటి సంగీతం వినబడుతోంది. తినేవాళ్ళు తింటూ, తాగేవాళ్ళు తాగుతూ చాలా హుషారుగా వున్నారు.

అక్కడ వున్న ప్రతి మనిషి ఉన్నతాధికారి. పగలంతా బిజినెస్ గొడవలతో, డబ్బు సంపాదనలో మునిగి తేలే ఈ మనుష్యులకు ఈ మాత్రం రిలాక్సేషన్ చాలా అవసరం. లేకపోతే దేశంలో గుండెనొప్పి చావులు ఎక్కువై పోతాయి.

ఒక కార్నర్ సీటులో కనిపించాడు ఆ మనిషి. ఆ వ్యక్తిని చూస్తూంటే పాముల మధ్య నిలుచున్నట్లు అనిపించింది శివుడికి. గుండె వేగం పెరిగి శరీరంలో రక్తం వేగంగా పరుగులు తీయసాగింది.

శివుడు ఒక దొంగ. జేబుదొంగతనాలు చేస్తూంటాడు. ముఖ్యంగా ఆడవాళ్ళ మంగళసూత్రాలు కత్తిరించడంలో నేర్పరి. అంతేకాదు, శివుడిలో యింకో స్పెషాలిటీ ఉంది. పోయిన వస్తువులను గాని, కావల్సిన మనుష్యులను గాని వెతకడంలో శివుడికి మంచి ప్రజ్ఞ వుంది.

మూడురోజుల క్రిందట ఒక ధనవంతుడు ఒక పని అప్పగించాడు. ముందు భయపడ్డా అతను ఇస్తానన్న డబ్బుకు ఆశపడి ఒప్పుకున్నాడు శివుడు.

వణుకుతున్న శరీరాన్ని అదుపు చేసుకుంటూ ముందుకు నడిచాడు శివుడు. తిన్నగా వెళ్ళి ఆ వ్యక్తి ముందు నిల్చు

న్నాడు. తల పైకెత్తి సూటిగా చూశాడా వ్యక్తి.

“నమస్తే సాబ్!” శివుడి కంఠంలో వణుకు స్పష్టంగా వినిపించింది.

“ఏం శివుడూ! మంగళసూత్రాల బిజినెస్ సరిగా జరగటంలేదా?”

“అదికాదు సాబ్!” నసిగాడు శివుడు.

“మరి? నా జేబును కన్నం వేద్దామనుకొంటున్నావా....?”

“అయ్యో! అయ్యో!” లబ లబ లాడిపోయాడు శివుడు. “నా గొయ్యి నేనే తవ్వుకుంటానా సాబ్!” ఏడుపు గొంతుతో చెప్పాడు.

“కూర్చో! కూర్చొని విషయం కక్కు. ఎందుకు నన్ను వెదుక్కుంటూ వచ్చావు?” అడిగాడా వ్యక్తి.

కూర్చున్నాడు శివుడు. ఒక గ్లాసులో విస్కీ ఇచ్చాడా వ్యక్తి. ఒక గుక్కలో అదంతా ఫినిష్ చేసి ముందుకు వంగి చెప్పాడు శివుడు.

“అగ్నిపుత్రా! ఒక ధనవంతుడికి మీరు ఒక పని చేసి పెట్టాలి. దానివల్ల మీకు లక్ష రూపాయల వరకూ వస్తుంది.”

“పని వివరాలు చెప్పు!” తాపీగా అడిగాడు అగ్నిపుత్ర.

“అతని భార్యని హత్య చెయ్యాలి. అయితే అది హత్యలా కాకుండా యాక్సిడెంట్‌లా వుండాలి. లేదా ఆత్మహత్యలా వుండాలి.”

“ఎవరా వ్యక్తి?” అడిగాడు అగ్నిపుత్ర.

“మీరు ఈ పని చెయ్యడానికి వొప్పుకుంటే, వివరాలు చెప్తాను సాబ్!”

"ఆ వ్యక్తిని రేపు నా దగ్గరకు తీసుకురా!"

"కుదరదు సాబ్! మీకు మధ్యవర్తిగా నన్ను వుండమన్నాడు" కంగారుగా చెప్పాడు శివుడు.

"అయితే నాతో కాంట్రాక్టు కుదరదు. పని జరగాలంటే ఆ వ్యక్తి నన్ను కలవాలి" స్థిరంగా చెప్పాడు అగ్నిపుత్ర.

"అదికాదు సాబ్! అతను సంఘంలో చాలా పరువు ప్రతిష్టలు గల మనిషి. పైగా కోటీశ్వరుడు."

నవ్వాడు అగ్నిపుత్ర. "నాచేత హత్యలు చేయించే వాళ్ళంతా అలాంటివాళ్ళే" చెప్పి మళ్ళీ నవ్వాడు.

"కాని సాబ్!...." ఏదో చెప్పబోయాడు శివుడు.

"చూడు శివుడూ! ఇన్ని మాటలు అనవసరం. పని సక్రమంగా జరగాలంటే నాకు అతని భార్య వివరాలన్నీ కావాలి. కాబట్టి అతన్ని కలవడం అవసరం."

"నేను మీకు అన్ని వివరాలూ ఇస్తాను సాబ్!"

"ఏం? నాతో బిజినెస్ చేసేటంత గొప్పవాడివి అయ్యావా?" కటువుగా ప్రశ్నించాడు అగ్నిపుత్ర.

తడబడిపోయాడు శివుడు. ఏం మాట్లాడలేక పోయాడు.

"చెప్పు! ఆ వ్యక్తి యెవరు? హు యీజ్ దట్ మాన్?"

"బలరామ్ గారు సాబ్" చెప్పేశాడు శివుడు.

ఆశ్చర్యంతో చిన్నగా విసిల్ వేశాడు అగ్నిపుత్ర.

బలరామ్ చాలా ధనవంతుడు. అతడు చెయ్యని వ్యాపారం లేదు. సిటీలో పేరుగల వ్యక్తి. అలాంటివాడు భార్యను హత్య చెయ్యించాలనుకుంటున్నాడా?

"బలరామ్ అయితే తప్పకుండా కలవాలి. వెళ్ళు.

వెళ్ళి బలరామ్‌తో చెప్పు. అగ్నిపుత్ర నిన్ను కలవాలంటున్నాడని. బొమ్మలా అలా నిలబడకు. వెళ్ళు!" గద్దించాడు.

శివుడు మారు మాట్లాడకుండా లేచి అక్కడ నుండి బయటపడ్డాడు.

# 5

తన ఎదురుగా కూర్చున్న అగ్నిపుత్రను పరీక్షగా చూశాడు బలరామ్.

పోస్టుగ్రాడ్యుయేషన్ చేసే యువకుడిలా వున్నాడు. కాని రాష్ట్రంలో ఎన్నో హత్యలు చేసిన హంతకుడిలా లేడు. నడిరోడ్డులో పట్టపగలు ఓ సినిమాతార ముఖాన యాసిడ్ చల్లిన కసాయివాడతను. డబ్బుకోసం ఓ మనిషి చర్మం ఒలకమన్నా వెనుదీయని దుర్మార్గుడతను.

"చెప్పండి మిస్టర్ బలరామ్! నేను మీకు చెయ్యవలసిన పని వివరంగా చెప్పండి" అడిగాడు అగ్నిపుత్ర.

"అదే సాబ్! నేను చెప్పాను గా?" మధ్యలో అందుకున్నాడు శివుడు.

"చూడు శివుడు! నువ్వు నోర్మూసుకో. లేదా నీ నాలుక తెగ్గోసి, ఫ్రైచేసి నీచేతే తినిపిస్తాను" గద్దించాడు అగ్నిపుత్ర.

బలరామ్ ఒక్కసారి ఇబ్బందిగా కుర్చీలో కదిలాడు. ఆ తర్వాత చెప్పాడు.

"నా భార్యను హత్యచేయ్యాలి అగ్నిపుత్రా. కాని అది హత్య అని యెవ్వరికి తెలియకూడదు."

"ఆస్తికొరకు ఈ పని చేయిస్తున్నారా?"

"ఆ అవసరం నాకు లేదు. పది తరాలకు సరిపడ్డ ఆస్తి నాది. డబ్బుకోసం హత్యలు చేయించవలసిన పరిస్థితి

కాదు వాడి."

"సరే! కారణాలు నాకు అనవసరం. మీ భార్య అలవాట్లు చెప్పండి. క్లబ్ కు వెళుతుందా? స్విమ్మింగ్ చేస్తుందా? ఆమె క్రమం తప్పకుండా చేసే పనులను చెప్పండి?"

"ఆమె చాలా సనాతన భావాలు వున్న యువతి అగ్నిపుత్రా! ఇంటినుండి బయటకు వెళ్ళదు. కాని నీవు చెపితే షాపింగ్ కొరకు ఆమెను బయటకు పంపుతాను. నీవు యాక్సిడెంట్ చేసి చంపేయవచ్చు" చెప్పాడు బలరామ్.

"కాని అలాచేస్తే అనుమానం వస్తుంది. మిమ్మల్నే అనుమానిస్తారు."

"వద్దు" భయంగా చెప్పాడు బలరామ్ "ఇంకో మార్గం ఆలోచించు."

ఆలోచనలోపడ్డాడు అగ్నిపుత్ర. బలరామ్ భార్యను ఎలా చంపాలి అనికాదు అతను ఆలోచించేది. అసలు చంపడానికి అతనెప్పుడూ ఆలోచించడు బలరామ్‌నుండి ఎంత రాబట్టాలి అని ఆలోచిస్తున్నాడు.

"హత్య అని అనుమానం రాకూడదు వచ్చినా మీపై నిందపడకూడదు. అంతేనా!" అడిగాడు అగ్నిపుత్ర.

"ఔను!" ఒప్పుకున్నాడు బలరామ్.

"ఈ హత్యచేస్తే నాకు వచ్చే డబ్బు ఎంత?" సడన్ గా విషయం మార్చాడు అగ్నిపుత్ర.

"లక్షరూపాయలు" చెప్పాడు పలరామ్.

నవ్వాడు అగ్నిపుత్ర. ఆ నవ్వులో హేళన స్పష్టంగా కనిపించింది బలరామ్‌కు.

"మూడు లక్షలు ప్లస్ ఖర్చులు" అన్నాడు అగ్ని

పుత్ర.

గుండె ఆగిపోయింది బలరామ్‌కు. ఒక ఆడదాన్ని చంపడానికి మూడు లక్షలా? పాతిక రూపాయలు ఇస్తే పాతిక మర్డర్లు చేసేవాళ్ళున్నారు ఈ దేశంలో.

బలరామ్ ఆలోచనలు గ్రహించాడు అగ్నిపుత్ర.

"డాక్టర్‌ని బట్టి ఫీజు వుంటుంది మిస్టర్ బలరామ్. యేదో ఒక పద్ధతిలో చంపమంటే నేను అంత డబ్బు తీసుకోను కాని మీరు చెప్పింది ప్లాన్‌డ్ మర్డర్. ఎవ్వరికి అనుమానం రాకుండా చంపాలి" చివరిమాట ఒత్తిపలుకుతూ చెప్పాడు అగ్నిపుత్ర.

ఆయోమయంలో పడ్డాడు బలరామ్.

"సరే ఒక పని చెయ్యండి బలరామ్. రెండు లక్షలు చేసుకోండి. వాటికి ఖర్చులు కలపండి" తిరిగి చెప్పాడు అగ్నిపుత్ర.

"ఖర్చులా! ఏం ఖర్చులు?" అడిగాడు బలరామ్.

అంతవరకు మాట్లాడకుండా కూర్చున్న శివుడు చెప్పాడు.

"ఆయుధాలకు కాని, ఏదైనా ఊళ్ళు వెళ్తే దారి ఖర్చులు కాని బలరామ్ సాబ్!"

"ఇక ప్లాన్ వినండి. మీరు గమనించకపోయినా మీ భార్యకు ఒక అలవాటుంది" చెప్పాడు అగ్నిపుత్ర.

"ఏమిటది?" కనుబొమ్మలు ముడివేస్తూ అడిగాడు బలరామ్.

"ప్రతీ శనివారం గుడికి వెళ్ళడం. అవునా?" అడిగాడు అగ్నిపుత్ర.

"అవును. పిడుగులు పడ్డా, ఉప్పెన వచ్చినా ప్రతీ శనివారం గుడికి వెళ్తుంది."

"అలాగే ఈ శనివారం కూడా గుడికి వెళ్తుంది. ఆయితే ఈసారి ఒక విశేషం వుంది. ఆ గుడికి శనివారం స్వామీజీ వస్తున్నారు. హిందూమతాన్ని ఉద్ధరించ డానికి కంకణం కట్టుకున్నారాయన. ఆతడు వచ్చే సమ యానికి మీ భార్యని గుడికి పంపాలి. నేను సరిగ్గా వాళ్ళ మధ్య పడేటట్లు హాండ్ బాంబ్ విసురుతాను. ఆ బాంబ్ వల్ల చనిపోయిన వాళ్ళలో మీ భార్య వుంటుంది. అందరి అనుమానం హిందూమత ద్వేషులపైకి పోతుంది" వివరంగా చెప్పాడు అగ్నిపుత్ర.

"మై గాడ్. గర్భగుడిలోకి బాంబ్ విసురుతావా? జరిగేపనేనా?" గొంతుక తడారిపోతుండగా అడిగాడు బలరామ్.

"జరగదు. గర్భగుడిలో బాంబు విసిరితే నేను దొరికి పోవడం ఖాయం. నేను చెప్పేది అది కాదు" అగి శ్రోతలవైపు చూశాడు అగ్నిపుత్ర.

వాళ్ళిద్దరు యేదో హారర్ సినిమా చూస్తున్నట్లు చూస్తున్నారు. భయం, ఆతృత కలగలిపి వాళ్ళ కళ్ళల్లో కనిపిస్తున్నాయి.

"గుడి చుట్టూ ప్రహారీ గోడ వుంది. గోడపైన నిల బడితే సరిగ్గా యెదురుగా వుంది ఒక పెద్ద సిమెంట్ మందిరం. అక్కడ స్వామీజీ ఉపన్యసిస్తారు. ఆధ్యా త్మిక భావాలున్న మీ భార్య ఆ ఉపన్యాసం వినడానికి అక్కడ ఆగుతుంది. సరిగ్గా ఆమెమీద పడేలా బాంబు విసురుతాను. హిందూమతం నశించాలి అని అరచి గోడ దూకి పారిపోతాను. ఇంక కలలో కూడా మీ భార్యను మీరు హత్య చేయించారని యెవ్వరూ నమ్మరు."

బలరామ్‌కు మతిపోయినట్లయ్యింది. అండర్ వరల్డులో

అగ్నిపుత్రకు అంత పేరు ఎలా వచ్చిందో అతనికి అర్థమయ్యింది. తన గురించి శివుడు చెప్పగానే తన భార్య అలవాట్లు వాకబు చేశాడు. అద్భుతమైన పథకం రూపొందించాడు.

"కాని చాలామంది చచ్చిపోతారు కదా?" తేరుకుని అడిగాడు బలరామ్.

సమాధానంగా విచిత్రంగా భుజాలు కదిపాడు అగ్నిపుత్ర.

"ఒక్క మనిషి కోసం యింతమందిని చంపడం అన్యాయం సాబ్! మత కలహాలు రేగితే ఇంకా కొన్ని వేలమంది చచ్చిపోతారు. నేనొప్పుకోను" శివుడు అరిచాడు.

"అబ్బా! నీ కమీషన్ నీకు యిస్తాలేవయ్యా! ఊరికే అరవకు" విసుక్కున్నాడు బలరామ్.

అయితే అగ్నిపుత్ర విసుక్కోలేదు. మెరుపులా శివుడిని సమీపించాడు. మరుక్షణం అతని చేతిలోని చిన్న నైఫ్ శివుడి బెల్లిలో దిగిపోయింది. వెనుకకు లాగి మళ్ళీ పొడిచాడు. ఈసారి గుండెల్లో.

కాళ్ళు చేతులు కట్టేసిన పందిలా అరిచాడు శివుడు. సాలెపురుగు గూట్లో చిక్కిన ఈగలా తన్నుకున్నాడు. అతడికి నరం నరం తెగిపోతున్న బాధ కలుగుతుంది. నెలంతా కష్టపడ్డ సొమ్ము తను దొంగతనం చేస్తే బాధపడే ఉద్యోగులు కళ్ళముందు మెదిలారు. పవిత్రంగా చూసుకొనే తాళిబొట్టు పోగొట్టుకున్న ఆడవాళ్ళ దీనవదనాలు కనిపించాయి.

ఎవరు చెప్పారు? చేసిన పాపాలకు శిక్ష నరకంలో వేస్తారని?

# 6

రోడ్డుపై పడి వున్న శవాన్ని మరోసారి చూశాడు ఇన్‌స్పెక్టర్ రవి.

ఆ శవం ఒక జేబు దొంగది. క్రిమినల్స్ అలా చనిపోవడంలో ఆశ్చర్యంలేదు. వాటాలు తెగక అప్పుడప్పుడూ ఒకరినొకరు చంపుకుంటారు.

బలమైన కత్తిపోట్లు తగిలి చనిపోయాడు. వాడి పేరు శివుడు. చిన్న చిన్న దొంగతనాలు చేసి బ్రతుకుతుంటాడు. అలాంటివారు ఎందుకు చనిపోయాడు. అంటే ఏదో పెద్ద నేరంలో ఇరుక్కుపోయాడన్నమాట. ఏమిటది?

అక్కడ జరగవలసిన తతంగమంతా అసిస్టెంట్స్‌కు అప్పగించి జీపువైపు బయలుదేరాడు రవి.

జీపు దగ్గరే నిలుచుంది ఓ స్త్రీ. తన జీపుముందు నిలబడ్డ ఆ స్త్రీ వంక పరిశీలనగా చూశాడు ఇన్‌స్పెక్టర్ రవి. దేశంలో పేదరికానికి చిహ్నంలా వుందామె. తైల సంస్కారం లేని జుట్టుతో, చిరుగులు పడ్డ చీరతో, కన్నీటి చారలతో, మలినమయిన ముఖంతో ఉంది. రవిని చూడగానే ఆ స్త్రీ గబ గబా ముందుకు వచ్చింది.

“ఎవరమ్మా నువ్వు?” అడిగాడు రవి.

“ఆ చచ్చిపోయిన శివుడు లేడండి. అడు నన్ను వుంచుకున్నాడండి” ఏ మాత్రం సిగ్గూ, భయం లేకుండా చెప్పింది.

రవి అలాగే నిలబడ్డాడు. ఏదో క్లూ రాబోతోంది. అందుకే అసలు మాట్లాడలేదు.

ఆ స్త్రీ తిరిగి తనే చెప్పింది.

"శివుడు తాళిబొట్టులు, డబ్బులు దొంగతనం చేస్తా డండి, కాని మూడు రోజుల క్రితం చెప్పాడండి, ఒక బ్రహ్మాండమైన పని బలరామ్‌గారు ఇచ్చినారని."

"ఆగాగు! ఎవరు! ఎవరిచ్చారు పని?" ఆతృతగా అడి గాడు రవి.

"బలరామ్‌గారండి, పాలెస్ సినిమా హాలు ఆరిదే నండి. ఆయన ఇచ్చిన పని జేస్తే బోలెడు డబ్బు ఒస్తుం దంటండి. నాకు చాలా కొనిత్తానన్నాడు. ఇదిగో యిలా మద్దెలో వచ్చినాడు."

"సరేలే! నేను చూస్తాను. నువ్వెళ్ళు...." చెప్పాడు రవి.

అతనికి చాలా ఆశ్చర్యంగా వుంది. బలరామ్ లాంటి ధనవంతుడికి శివుడిలాంటి జేబుదొంగతో పని యేమిటి? ఏదో వుంది తిరకాసు.

ఒకప్రక్క మంత్రిగారి హత్యకేసు తేలలేదు. దాని వెనుకే జరిగిన రామశర్మ హత్యకేసు అంగుళం కూడా కదలలేదు. రాష్ట్రంలో పోలీసు డిపార్టుమెంటును పత్రి కలు దుమ్మెత్తిపోస్తున్నాయి.

పులిమీద పుట్రలా ఇప్పుడు ఈ హత్య. మామూలు పరిస్థితులలో ఒక జేబుదొంగ హత్య యెవరూ పట్టించు కోరు. కాని యిప్పుడు పరిస్థితులు మామూలుగా లేవు.

శివుడివంటి లోఫర్ హత్య వెనుక పెద్ద పెద్ద పేర్లు వినిపిస్తున్నాయంటే ఖచ్చితంగా యేదో ఘోరం జరగ బోతోంది. తమ తలల పైకి మళ్ళీ యేదో రాబోతోంది. కసిగా జీపు స్టార్టు చేశాడు రవి.

ఇంటికి వెళ్ళి యూనిఫామ్ వదలి మఫ్టీలో బయలు దేరాడు. బలరామ్ సంగతి తేల్చేయాలనిపించింది రవికి.

పోలీస్ యూనిఫాంలో వెళ్ళితే ఒక్క విషయం కూడా బయటకు రాదన్నది అనుభవం నేర్పిన పాఠం. అందుకే మఫ్టీ లో బయలుదేరాడు.

సరాసరి బలరామ్ యింటికి వెళ్ళాడు. అయితే లోపలకు వెళ్ళలేదు. వీధిలో రెండు మూడుసార్లు తిరిగాడు. ఆ వీధిలో బలరామ్ గూర్చి పూర్తి వివరాలు యెవరు చెబుతారు? ఏం చెయ్యాలో తెలీలేదు రవికి. వీధి చివర వున్న కిళ్ళీ షాపులో సిగరెట్స్ కొన్నాడు. అక్కడే వున్న తాడుకు సిగరెట్ వెలిగించి గుండెలనిండా రెండు దమ్ములు లాగాడు.

అతను వీధిలో పచార్లు చేస్తుండటం గమనించిన కిళ్ళీ షాపు ఓనరు అడిగాడు.

"ఎవరు కావాలి బాబు."

ఉలిక్కిపడ్డాడు రవి. తనను గమనిస్తున్నాడన్న మాట. వీధిలోనికి క్రొత్తవాళ్ళు యెవరు వచ్చినా వీడికి తెలుస్తుందా?

సడన్‌గా వచ్చింది ఫ్లాష్‌లా ఒక ఐడియా. శివుడి గుర్తులు చెప్పి అడిగాడు. వెంటనే అందుకున్నాడు కిళ్ళీ షాపు ఓనరు. మాట్లాడడానికి మనుష్యులు దొరికి చాలా కాలమయిన వాడిలా గబగబా మాట్లాడ సాగాడు.

"అతని పేరు నాకు తెలీదు బాబు. ఒకటి రెండు సార్లు బలరామ్ అయ్యగారి వద్దకు వచ్చాడు. నా షాపులో సిగరెట్లు కొన్నాడు. అందుకే గుర్తుంది."

"బలరామ్‌గారికి పెళ్ళయిందా?" విషయాన్ని పక్కకు మళ్ళించాడు రవి.

"ఇప్పుడేమిటి బాబు! ఎప్పుడో అయ్యింది. ఆ అమ్మ చాలా మంచిది. ఎంతసేపు పూజలు పునస్కారాలేగాని

ఇంకో పూసు ఎత్తదు. అలాగని మొగుడికి యేమైనా తక్కువ చేస్తుందా? లేదు. బలరామ్ గారికి సంబంధించిన ప్రతి విషయం స్వయంగా చూసుకుంటుంది. డబ్బున్న ఆడకూతుళ్ళలో అలా భర్తకు సేవచేసే వాళ్ళు ఎవరు? మీరే చెప్పండి?"

అర్థమయ్యింది రవికి. ఇది ఊకదంపుడు బాపతు కేసు. ఇటువంటి వాళ్ళకు మాట్లాడటమే కావాలి. ఏ విషయమైనా సరే మాట్లాడాలి అంతే.

"అయినా బలరామ్ గారికి తృప్తిలేదు. మహాలక్ష్మి వంటి భార్యను వదలి దానికూడా, దీనికూడా పడతాడు" తిరిగి తనే చెప్పాడు కిళ్ళీషాపు ఓనరు.

"అయ్యో! తప్పుకదూ?" సానుభూతి వ్యక్తం చేశాడు రవి.

"అదీ, అలా చెప్పండి బాబు. ఆ మహా ఇల్లాలు గుమ్మం దాటి బయటకు రాదుకదా? వారానికి ఒక్కరోజు మాత్రం గుడికి..ఇదిగో ఇలా వెళ్తుంది. మామూలు రోజులలో అస్సలు బయటకు రాదు. అలాంటి అమ్మను విడాకులు అడిగాడట."

"ఎందుకు?" కుతూహలంగా అడిగాడు రవి.

"ఎందుకేమిటి బాబు. ఒక మాయలాడిని మరిగాడు. దాన్నే పెళ్ళిచేసుకుంటాడట. ఈ అమ్మకు పిల్లలు పుట్టడంలేదట. దానికైనా పుడతారని ఆశట. సిగ్గు లేకపోతే సరి" ధుమధుమలాడాడు కిళ్ళీషాపు ఓనరు.

"మరి విడాకులు ఇచ్చేస్తాడా?"

"ఇస్తే గొడవ యేమిటి స్వామి? అయినా యెలా యిస్తుంది? ఆ తల్లి మహాపతివ్రత. ఇంకో పెళ్ళి కావాలంటే చేసుకోమంది. కాని విడాకులు ఇవ్వనంది" మరో

తీరం రావడంతో అటు తిరిగాడు కిళ్ళీషాపు ఓనరు. అక్కడనుండి బయలుదేరాడు రవి.

చాలా విషయాలు తెలిసాయి. కాని శివుడి హత్య కేసులో పనికిరావు. బలరామ్ ఇంకో ఆడదాని వలలో పడ్డాడు. భార్యకు విడాకులు యివ్వాలనుకుంటున్నాడు. ఆవిడ యివ్వనంటుంది. అప్పుడు యేమగాడైనా ఏం చేస్తాడు? ఊహు.........మామూలు మగాడు కాదు. బల రామ్‌లాంటి మిలియనీర్. బయటకు గెంటుతాడా? హత్య చేస్తాడా?

హత్య చేయడానికే శివుడిని పిలిపించాడా? మరి శివుడిని ఎవరు చంపారు? ఊహు....కాదు. శివుడు హత్య చేయడానికి పనికిరాడు. ఆడవాళ్ళ దగ్గర నగలు కొట్టెయ్యడం మినహా వాడు ఏం చెయ్యలేడు అనుకుంటుండగా సీ గుర్తుకు వచ్చింది. శివుడికి వున్న మరో స్పెషాలిటీ. హంటింగ్ డాగ్‌లా జాడలు పసిగట్టగలడం. కావాలనుకున్న వస్తువులనుగాని, మనుష్యులనుగాని, చాలా తేలికగా కనిపెట్టగలగడం.

యస్! ఇప్పుడు తన ఆలోచనలు కరెక్టుగా సాగుతున్నాయి. మరో హంతకుడిని వెదకడానికి శివుడి అవసరం కలిగిందన్నమాట బలరామ్‌కు. తాను చంపకుండా మరో మనిషి సాయం కోరాడంటే బలరామ్ ఈ హత్య చాలా రహస్యంగా చేయించదలచాడు. తన పరువు మర్యాదలకు భంగం కలగకుండా చూసుకోవాలనుకుంటున్నాడు.

ఎవరా హంతకుడు? శివుడు వెదికి పట్టవలసినంత రహస్యంగా తిరిగే మనిషి. మూడో కంటికి తెలియకుండా

సీట్ గా చంపగల వ్యక్తి ఎవరు? తన ఆలోచనలు యెక్కడకు తీసుకు వెడుతున్నాయో గ్రహించేసరికి ఉలిక్కిపడ్డాడు రవి. తను లాగిన తీగతో డొంకంతా కదలబోతుంది.

రాష్ట్రవ్యాప్తంగా పోలీస్ డిపార్టుమెంట్ ను ఎలర్టు చెయ్యాలి. గత మూడు రోజులలో శివుడి కదలికలు కూపీ లాగాలి. వేగంగా పోలీస్ కమీషనర్ ఆఫీసుకు కదిలాడు రవి.

## 7

ఆమె నవ్వుతూ ఆహ్వానించింది.

“పోలీస్ ఆఫీసర్ మా యింటికి వచ్చారంటే యేదో విశేషమే వుండాలి” సోఫా చూపిస్తూ చెప్పింది.

“చిన్న పని వుండి వచ్చాను” అన్నాడు రవి సోఫాలో కూర్చుంటూ,

ఆమెను పరిశీలనగా చూశాడు. ఆమెకు ఇరవై ఏళ్ళుంటాయి. పదహారేళ్ళ అమ్మాయిలా వుంది. చాలా అందంగా వుంది. ఆమెను రవి ఇదివరకు చూడలేదు. సిటీలో బ్యూటీ పార్లర్ నడుపుతుందామె. అదిమాత్రం తెలుసు.

“ఏదో పని వుందన్నారు” కాస్త తటపటాయించి అడిగింది.

“మీ పేరు” అడిగాడు రవి.

“స్ట్రీజ్. నా కోసం వస్తూ నా పేరు తెలుసుకోకుండా వచ్చారా?”

“మీ పగడాల పెదవుల మీదుగా విందామని?”

“ఓ గాడ్! పోలీస్ ఆఫీసర్ అందం గురించి మాటాడుతున్నారే?” గుండెలపై చెయ్యి వేసుకుంటూ అంది.

ఆ ఫోజు ఆమె అందాన్ని రెట్టింపు చేసింది.

"భలేవారండి! ఎంత పోలీసులమైనా మేమూ మనుషులమే. కాకపోతే యూనిఫారంలో కాస్త ఇరుకై పోతాము."

ఆమె నవ్వింది. నవ్వుతూనే చెప్పింది.

"సరే సార్! నేనే చెప్తాను. నా పేరు కాంతి ప్రియ."

"ఇప్పుడు నేను వచ్చిన పని చెప్తాను. బలరామ్ గురించి మీతో మాట్లాడదామని వచ్చాను."

"బలరామ్‌కు యేమయింది?" ఆదుర్దాగా అడిగింది కాంతిప్రియ.

"అవుతుందేమో అని అనుమానం. బలరామ్‌కు కాదు మిసెస్ బలరామ్‌కు" చెప్పాడు రవి.

"వాడూ్యయు మీన్?"

"చెప్తాను. బలరామ్‌తో మీకు ఎంతకాలం నుండి పరిచయం?"

"సుమారు పది నెలలుగా."

"ఎలాంటి పరిచయం?" తిరిగి అడిగాడు రవి.

"మామూలు స్నేహమే."

"బలరామ్, మీరు వివాహం చేసుకోవాలనుకుంటున్నారని విన్నాను."

"అఫ్‌కోర్స్! కాని ఇప్పుడు కాదు. బలరామ్ తన మిసెస్‌కు విడాకులు ఇచ్చింతర్వాత" చెప్పింది కాంతి ప్రియ!

"బలరామ్ తన భార్యకు విడాకులు యివ్వడానికి అంగీకరించారా?"

"ఆయన భార్య రేణుకాదేవి డైవర్స్ ఇవ్వడానికి

ఒప్పుకోవడంలేదు."

"మరి, ఇప్పుడు ఏం చేద్దామనుకుంటున్నారు?" అడిగాడు రవి.

"నేను చేసేదేముంది? అదంతా ఆయన తలనొప్పి. గడువు దాటకుండా సమస్య పరిష్కరించాల్సింది బలరామ్."

"గడువు ఏమిటి?" ముందుకు వంగి కూర్చుంటూ అడిగాడు రవి.

ఒక్క క్షణం చెప్పాలా, వద్దా అని సందేహించింది శాంతిప్రియ. అది గమనించాడు రవి.

"చెప్పండి శాంతిప్రియ. మీరు చెప్పే విషయం ఎంత చిన్నదైనా ఒక్కోసారి మా పరిశోధనలో పనికి రావచ్చును."

"కాని ఇదంతా మీరు ఎందుకు అరాతీస్తున్నారు?" అడిగింది శాంతిప్రియ.

"చెప్తాను. ముందు మీరు మీ గడువు సంగతి చెప్పండి."

"బలరామ్ నన్ను పెళ్ళి చేసుకుంటానన్నారు. అంత డబ్బున్న యువకుడు కోరి పెళ్ళిచేసుకుంటానంటే యే ఆడది కాదంటుంది. కాని రేణుక ఆయనకు విడాకులు ఇవ్వనంది. ఇదే సమయంలో నాకు అమెరికాలో ఒక సంస్థ నుండి మోడల్ గా అవకాశం వచ్చింది. నిజంగా అది గోల్డెన్ చాన్స్. అమెరికా వెళ్ళడానికి నాకు నెల రోజులు గడువు యివ్వబడింది."

ఊపిరి పీల్చుకోవడానికన్నట్లు ఆగింది శాంతిప్రియ. పొడవైన గోళ్ళవంక చూసుకుంటూ తిరిగి చెప్పింది.

"ఆ నెల రోజులు నేను బలరామ్ గారికి ఇచ్చాను.

కు నెలరోజులలో ఆయన విడాకులు తీసుకుంటే ఆయనను వివాహం చేసుకుంటాను. లేదా అమెరికా వెళ్ళి మోడల్ గా నూతన జీవితాన్ని ఆరంభిస్తాను."

ఆమెకేసి ఒకసారి తీక్షణంగా చూసి టేబుల్ పై వుంచిన హేట్ తలపై పెట్టుకున్నాడు రవి. బలంగా అడుగులు వేస్తూ అక్కడనుండి బయటకు కదిలాడు.

"ఇదంతా మీరు యెందుకు అడిగినట్లు?" కంగారుగా అడిగింది శాంతిప్రియ.

గుమ్మంవరకు వెళ్ళిన రవి గిర్రున వెనక్కి తిరిగాడు. తిరుగుతూనే చెప్పాడు.

"మీ నెలరోజుల గడువు ఒక నిండు ప్రాణాన్ని బలిగొనబోతుంది శాంతిప్రియా."

# 8

గదిలో చిరాకుగా పచార్లు చేస్తున్నాడు బలరామ్. ఎవరిపైనో, ఎందుకో తెలియని కసిగా వుందతనికి. ప్రపంచంలో అంతా సుఖంగా వున్నట్లు తనొక్కడే అష్టకష్టాలు పడుతున్నట్లు అనిపించింది.

టీపాయ్ పై పెట్టిన రమ్ము సీసానుండి గ్లాసులోనికి వంచుకున్నాడు. దాన్ని అలానే గొంతులోకి పంపించాడు. వెచ్చటి ద్రవం లోనికి పోతుంటే మనసు హాయిగా అనిపించింది.

తలుపు చప్పుడయ్యింది. గ్లాసు మరోసారి నింపుకుంటూనే అటు చూశాడు బలరామ్. రేణుకాదేవి లోపలకు వచ్చింది.

బలరామ్ భుజాలవరకు వచ్చే ఎత్తులో వున్నదామె. ఎత్తుకు తగ్గ లావుతో నిండు చీరతో సాంప్రదాయబద్ధంగా వున్నదామె. ఆమెలో చూడవలసింది అవయవ

సంపదకాదు. పచ్చి శృంగారాన్ని అసలుకాదు. ఒక పరిపూర్ణ స్త్రీత్వాన్ని మాత్రమే చూడాలి. ఆమెలో కేవలం మాతృత్వాన్నే చూడగలగాలి. ముఖ్యంగా ఆమె కళ్ళు. అవి అప్పుడే లోకాన్ని చూస్తున్న పసి పాప కళ్ళలాగా ప్రశాంతంగా వుంటాయి. అర్ధరాత్రి నిద్రలో లేపినా ఆమె మోము అంతే అమాయకంగా వుంటుంది.

"ఇంకా సినిమాహాలుకు వెళ్ళలేదా? ఇక్కడ యేం చేస్తున్నారు?" లోపలకు వస్తూ అడిగింది రేణుక.

"మనశ్శాంతి వెతుక్కుంటున్నాను" కసిగా అన్నాడు బలరామ్.

"మీకు అంత కష్టాలు యేమొచ్చాయి?"

"నీవు నా మెడకు తగులుకోవడమే పెద్ద కష్టం. ఆ తర్వాతురివి కదాని చేసుకున్నాను చూడు అదే నేను చేసిన పెద్ద తప్పిదం."

"ఇప్పుడు నావల్ల మీకు యేం లోటు జరిగింది?" అడిగింది రేణుక.

"ఏం లోటా? అసలు నీవల్ల నేను సుఖపడిం దేమిటి? కనీసం నన్ను తండ్రిని చెయ్యలేకపోయావు."

ఒక్కక్షణం రేణుక ముఖం మ్లానమయింది. మరు క్షణంలో సర్దుకుని అక్కడ నుండి బయటకు నడవ బోయింది.

"ఆగు!" గద్దించాడు బలరామ్. "నేను చెప్పిన విషయం యేం చేశావు?"

"ఏ విషయం?" అడిగింది రేణుక.

"మన విడాకుల సంగతి. ఇక నీతో కలసి బ్రతకడం నావల్ల కాదు."

"మీరు చెప్పిన పని చెయ్యడం నావల్ల కాదని చెప్పానుగా!"

"ఏం? ఎందుకని?" ప్రశ్నించాడు బలరామ్. అతనికి ఆమెను చూస్తూంటే చాలా కసిగా ఉంది.

"నేను విడాకులు యివ్వడం యెందుకు? మీకు కావాలంటే మళ్ళీ పెళ్ళి చేసుకోండి. నేను యిలాగే బ్రతికేస్తాను. మీ ఆనందానికి నేను అడ్డు రాను" ఖండితంగా చెప్పింది రేణుక.

అంతే! బలరామ్ ఆవేశం కట్టలు తెంచుకుంది. ఒక్క ఉదుటున వచ్చి ఆమె గొంతు రెండు చేతులతో బిగించాడు.

"రాక్షసీ! నిన్ను చంపేస్తాను...." అరిచాడు బలరామ్.

"చంపెయ్యండి. మీ చేతులలో చావనైనా చస్తాను గాని, ముగుసు వదిలివేసిన దానిలా మాత్రం బ్రతకను."

ఆమెను వెనక్కు విసిరికొట్టాడు బలరామ్.

"వెళ్ళు! వెళ్ళిక్కడ నుండి" పిచ్చిగా అరుస్తూ టీపాయ్ పైన వుంచిన రమ్ బాటిల్ యెత్తి గటగటా త్రాగడం మొదలుపెట్టాడు. రమ్ అది. పందెపు గుర్రాలకు పట్టించే అతి ఘాటైన లిక్కర్. "రా"గా తీసుకోవడంవల్ల వెంటనే తన ప్రభావాన్ని చూపించింది.

ఖాళీబాటిల్ విసిరికొట్టాడు బలరామ్. "ఈ రోజు గుడికి వెళ్ళావు కదా? అక్కడితో నీ పని ఆఖరు" నిషాతో ఎర్రబడ్డ కళ్ళు గుండ్రంగా తిప్పుతూ అన్నాడు. విసురుగా మంచంపై పడి మత్తులో మునిగిపోయాడు.

మౌనంగా అతనివంక చూసి అక్కడి నుండి బయటకు నడిచింది రేణుకాదేవి.

# 9

బలరామ్ మత్తు వదిలి లేచేసరికి సాయంత్రమయి
పోయింది.

విపరీతంగా త్రాగడంవలన హ్యాంగోవర్ వచ్చింది.
తలలోని నరాలు చిట్లిపోతాయా అన్నంత బాధ కలుగు
తోంది.

వాష్ బేసిన్ వద్దకు నడిచాడు. చల్లని నీళ్ళతో ముఖం,
మెడ కడుక్కున్నాడు. స్టాండుపై నున్న టవల్ తో
తుడుచుకుంటూండగా జ్ఞాపకం వచ్చిందతనికి.

ఈ రోజు శనివారం. శ....ని....వారం. శనివారం
సాయంత్రం ఈ పాటికి రేణుక గుడికి వెళ్ళివుంటుంది.
ఇంకొక గంటలో రేణుక మరణవార్త అందుతుంది.
పూర్ రేణుక! తను కోరినట్లు విడాకులు యిచ్చివుంటే
హాయిగా బ్రతికి వుండేది.

కొన్ని సంవత్సరాలు కలిసి బ్రతకడంవల్ల ఆమెపై
మనసులో ఏ మూలో వున్న ప్రేమ పెల్లుబికింది. అది
ఒక్కక్షణం మాత్రమే. మరుక్షణం నీరెండలో త్రాచు
పాములా మెరిసే శాంతిప్రియ అందం గుర్తుకు వచ్చిం
దతనికి. మనసులోని సంఘర్షణవల్ల తలనొప్పి అధిక
మయ్యింది.

తలుపు గెంటుకుని నౌఖరు లోపలకు వచ్చాడు.

"అయ్యగారూ! మీ కోసం డాక్టరుగారు వచ్చారు"
అన్నాడు.

"హాల్లో కూర్చోబెట్టు. వస్తాను" విసుగ్గా చెప్పాడు
బలరామ్.

"మధ్యాహ్నం మీ కోసం ఒక అమ్మాయిగారు
వచ్చారండి. మీరు నిద్రపోతున్నారని చెప్పానండి. మీకు

మా ఉత్తరం యిమ్మన్నారు" అంటూ ఒక ఉత్తరం ఇచ్చాడు.

తీసుకున్నాడు బలరామ్. ఆత్రంగా విప్పాడు. శాంతిప్రియ రాసిన ఉత్తరం అది. గబగబా చదవడం మొదలుపెట్టాడు.

"డియర్ బలరామ్,

మిమ్మల్ని ప్రేమించి, పెళ్ళి చేసుకుని, మీ కోసం పిల్లల్ని కని, ఒక గృహిణిలా నిశ్చింతగా బ్రతకాలనుకున్నాను. తెగిన గాలిపటంలా వున్న నా బ్రతుకు మీ నీడలో చక్కబడుతుందనుకున్నాను. కాని మీ మీదే ఆశలు పెట్టుకుని బ్రతికే ఆ అమాయకురాలి సంగతి ఆలోచించలేకపోయాను. నా కొరకు మీరు మీ భార్యను హత్య చేసే పరిస్థితికి వచ్చారు.

ఆశ్చర్యం నటించకండి. ఇన్స్పెక్టర్ రవి నాకంతా చెప్పారు.

కార్లలో తిరగాలని రోజుకో చీర కట్టాలని, కోటివాళ్ళలా దర్జాగా వుండాలని వయసులో వున్న ఏ ఆడపిల్లయినా కలలు కంటుంది. అలాగే కమ్మని కలలో తేలియాడే నాకు మీరు పరిచయం కావడం మహాద్భాగ్యంగా అనిపించింది.

బలరామ్! నేను ఊహల్లో తేలియాడే ఆడపిల్లను. ఒప్పుకుంటాను. కాని హంతకురాల్ని కాదు. అవును బలరామ్. నావల్ల ఒక నిండు ప్రాణం బలయిపోకూడదు. నేను అమితంగా ప్రేమించే మనిషి నా వలన హంతకుడు కాకూడదు.

అందుకే నేను ఒక నిర్ణయం తీసుకున్నాను. వెంటనే అమెరికా వెళ్ళిపోతున్నాను. నా కొరకు వృథాప్రయత్నాలు మానండి. నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోవడానికి సిద్ధంగా లేను.

ఇట్లు,

ఎప్పటికీ మీకు ఏమీ కాని-మీ

శాంతిప్రియ."

కళ్ళు తిరుగుతున్నట్టయింది బలరామ్‌కు. ప్రపంచమంతా గాఢాంధకారం అలుముకున్నట్లయింది. చేతులలో ముఖం దాచుకుంటూ అలాగే కూర్చుండిపోయాడు.

సడన్‌గా డాక్టర్ రామారావు వచ్చి కూర్చున్నట్లు నౌకరు చెప్పడం గుర్తుకు వచ్చింది. అలాగే డాక్టర్ వద్దకు నడిచాడు.

ఆయన తమ ఫేమిలీ డాక్టర్. ముఖ్యంగా రేణుక ఆయన చేతుల్లోనే పెరిగింది.

"కమాన్ బలరామ్! రేణుక గుడికి వెళ్తూ నా దగ్గరకు వచ్చింది. ఆమెకు విడాకులు యిస్తానన్నావట కదా. అందుకు నీకు యే అడ్డు లేకుండా కాగితాలు రాసి యిస్తానంది. తన పేర వున్న ఆస్తి నీ పేర మార్పు చేసిందట" సూటిగా విషయంలోనికి వచ్చాడు డాక్టర్ రామారావు.

బలరామ్ యేమీ మాట్లాడలేను. అలాగే శిలలా నిలబడ్డాడు. మాట్లాడడానికి అతని కంఠనాళాలు సహకరించడం లేదు మనస్సులో జరుగుతున్న భీకర యుద్ధానికి ప్రతీకగా నుదుటిపై నరాలు ఉబ్బి కనబడుతున్నాయి.

"నీవు యిప్పుడు చాలా పెద్దవాడివి బలరామ్,

సిటీలో పేరొందిన బిజినెస్ మాగ్నెట్‌వి. కాని చిన్నతనంలో నేను ఇంజెక్షన్ చేస్తే యేడిచేవాడివి గుర్తుందా? అప్పటి కుర్రవాడిలానే భావించి చెప్తున్నాను" అగారాయన. వృధ్యాప్యం తెచ్చిన ముడతలు ఆయన ముఖంపై కనబడుతున్నాయి.

"రేణుకను కూడా నీలానే చిన్నతనం నుండి ఎరుగుదును. మా రెండు కుటుంబాల శ్రేయోభిలాషిగా ఒక మాట చెప్తాను. నీవు నడిరోడ్డులో నిలబడి పచ్చనోట్లు విసిరితే యెంతలేసి అందగత్తెలు నీ కాళ్ళముందు వాల్తారు కాని నీవు ఒక జన్మంతా తపస్సు చేసినా రేణుకవంటి భార్య దొరకదు."

జేబునుండి ఒక కాగితం తీసి యిచ్చి తిరిగి చెప్పారాయన.

"ఇదిగో నీ భార్య వ్రాసిన ఉత్తరం. తన బాధలు, వ్యధలు అన్నీ అందులో వ్రాసి వుంటుంది. ఇదే చివరి ప్రయత్నం, చదివి ఒక నిర్ణయానికి రా!"

వణుకుతున్న చేతులతో ఆ ఉత్తరం విప్పాడు బలరామ్. కాంతిప్రియ కలుగజేసిన షాక్ నుండి యింకా తేరుకోలేదతను. అందువల్ల భయపడుతూనే చదవడం మొదలు పెట్టాడు.

"శ్రీవారికి,

బహుశ యిదే చివరిసారేమో యిలా సంబోధించడం. కారణం మీకు తెలుసు. మీకు కంటకంలా అనిపిస్తూ ఇంకా మీతోనే బ్రతకాలనుకోవడం అవివేకమేమో? ఐనా యేదో మమకారం, యెంతైనా బావా మరదళ్ళం కదా?

కాని సాధారణంగా బావామరదళ్ళ మధ్య

వుండే చనువు మన మధ్య లేదు. నేను పూర్తిగా మా బామ్మ అదుపు ఆజ్ఞలలో ఆమె భావాలకు అనుగుణంగా పెరిగాను. అందుకే పెళ్ళికి ముందు మీతో మాట్లాడాలంటేనే సిగ్గుగా వుండేది. బెరుకుగా వుండేది. అందువల్లే మీరు మా ఇంటికి వచ్చినప్పుడు మీ ఎదుటపడేదాన్ని కాదు.

అసలు పెళ్ళిరోజు నుండి మీకు నేనంటే అసంతృప్తిగానే వున్నట్లుంది. మన తొలిరోజు.... అదే మన శోభనం రోజు గుర్తుందా? వయసు వచ్చినప్పటి నుండి మీతో యెంతో మధురంగా ఊహించుకునేదాన్ని. బామ్మ చెప్పే కథలలో రాజకుమారుడిలా అలరిస్తారని, మా నాన్న గారిలా లాలిస్తారని, నవ్వించి, కవ్విస్తారని, ఎన్నెన్నో ఊహించుకున్నాను.

కాని.... కాని.... ఆ రాత్రి తల్చుకుంటే ఇప్పటికి భయమేస్తోంది. మీరు ఒక్కమాట మాట్లాడలేదు. మీ సరదా, మీ కోరిక తీర్చుకోవాలన్న తొందర మీది. మీ ప్రయత్నంలో నా సిగ్గు, భయం బెరుకు మీకు అడ్డుగా తోచి వుండవచ్చును.

అంతా అయిన తర్వాత మీ కళ్ళలో అసంతృప్తి. మీ ముఖంలో చిరాకు గుర్తించి యెంత బాధపడ్డానో తెలుసా? మీరు నిద్రపోయాక తలగడలో తలపెట్టుకుని ఏడుస్తూ ఆ రాత్రి గడిపేశాను. అదిగో సరిగ్గా అప్పుడే గుర్తించాను. మన యిద్దరి భావాలలో, ఊహాలలో ఎంతో వైరుధ్యమున్నదని.

జీవితంలో ప్రతీ క్షణాన్నీ అనుభవించాలన్న

ఆతృత మీది. ఒక క్రమ పద్ధతిలో జీవితాన్ని గడపాలన్న ఆలోచన నాది.

నేను పెరిగిన వాతావరణం అలాంటిది. అక్కడికీ మీకు అనుగుణంగా నన్ను నేను మార్చుకోడానికి నేను చెయ్యని ప్రయత్నం లేదు.

దురదృష్టం! జీవితంలో ప్రతీ చిన్న సంఘటనా మన మధ్య దూరాన్ని పెంచింది. మిమ్మల్ని పేరు పెట్టి పిలవమనేవారు. మీ స్నేహితుల భార్యల్లా భర్తను పేరు పెట్టి పిలవడం, భుజాల పై చేతులు వేసి నడవడం నాకు చేతకాదు.

సరే, ఇప్పుడు అవన్నీ తవ్వుకోవడం అనవసరం. ఈ రోజు నేను చనిపోవడం ఖాయం కదా? ఎలా తెలిసిందని ఆశ్చర్యపడకండి. రెండు రోజుల నుండి మీరు నిద్రలో కలవరిస్తున్నారు. ఈ రోజు నా చావు తప్పదని.

మన పెళ్ళయిన తర్వాత, మన సంసార జీవితంలో మీ కోరిక యేదీ తీర్చలేని అభాగ్యురాలిని. కనీసం ఇదయినా తీరుస్తాను.

నాకూ ఒక ఆశ వుంది. చెప్పనా? మీరు నన్ను ప్రేమించాలని, ఒక భర్త భార్యను ప్రేమించేటంత కాకపోయి . పర్వాలేదు. ఇప్పటి మీద కాస్త దయతో, ఇంకాస్త ఆదరణతో చూస్తే చాలు. నాకు ఇంకో కోరిక కూడా వుంది. బహుశా తీరదేమో. అయినా చెప్పనా? నాకు.... నాకు.... బ్రతకాలని వుంది. మీ చల్లని ఆదరణలో చాలా కాలం బ్రతకాలని వుంది...."

అంతే! ఆ తర్వాత ఆ వుత్తరం చదవలేక పోయాడు

బలరామ్. కళ్ళలో పొంగిన నీటికి అక్షరాలు మసకబారి పోయాయి. బలరామ్ ముందు కూర్చొని అతని ముఖంలో మారుతున్న భావాలను గమనిస్తున్నారు రామారావు.

"అసలు రేణుకకు విడాకులు యివ్వాలని ఎందుకు అనుకున్నావు?" అడిగా రాయన.

"ఎంత కాలమైనా పిల్లలు పుట్టడం లేదని...." ఏడుపు గొంతుతో చెప్పాడు బలరామ్.

ఆశ్చర్యంగా చూశాడాయన బలరాం వంక. అది క్రమంగా కోపంగా మారింది.

"మూర్ఖుడా! పిల్లలు పుట్టంది రేణుకకు కాదు, నీకు. ఇంకో పెళ్ళి చేసుకుంటే పిల్లలు పుడతారనుకోవడం నీ భ్రమ. ప్రపంచంలో యే ఆడదానికి నీ వలన పిల్లలు పుట్టరు" ఆవేశంతో అరిచాడాయన.

"మీరే కదా! మా యిద్దరిని టెస్టు చేసి ఏ లోపం లేదని చెప్పారు" అడిగాడు బలరాం.

"అవును చెప్పాను. నీ భార్య నిజాన్ని చెప్పవద్దని బ్రతిమలాడితే, బుద్ధిలేక అలా చెప్పాను. కాని నీవు యింత దుర్మార్గుడవని తెలిస్తే చెప్పకపోదును."

మతిపోయినట్టయ్యింది బలరాంకు. నిజం తెలిస్తే తను బాధపడతాడని, ఇలా చెప్పించి వుంటుంది. అంత సున్నితమైన భావాలున్న అమ్మాయికి తనవంటి మూర్ఖుడు దొరకడమే రేణుక దురదృష్టం.

అహర్నిశలు తన సంతోషం కొరకు ఆలోచించే రేణుకను చంపించబోతున్నాడు. నిజంగా తనెంత క్రూరుడు? ఇప్పుడు ఈ చివరి నిముషాలలో, ఈ ఆఖరి క్షణాలలో రేణుకను కాపాడుకోవడం యెలా? ఆఖరికి తన కోసం చావుకు కూడా సిద్ధపడ్డ ఆ దేవతను కాపాడు

పోవడం ఎలా?

బలరాం కళ్ళ వెంబడి ధారగా కారుతున్నాయి కన్నీళ్ళు.

సరిగ్గా అదే సమయంలో తలుపువద్ద బూట్ల చప్పుడయ్యింది. ఇన్‌స్పెక్టర్ రవి ఠీవిగా లోపలకు వచ్చాడు.

అతన్ని చూడగానే ప్రాణం లేచివచ్చింది బలరాంకు. గబగబా ఎదురువెళ్ళాడు. కనీసం కూర్చోమని కూడా చెప్పకుండా, అగ్నిపుత్రకు తనకు మధ్య కాంట్రాక్టు వివరించాడు.

"ఇన్‌స్పెక్టర్! మీరే నా భార్యను రక్షించాలి. ఆమెతోపాటు సిటీలో కొన్ని వందలమంది చనిపోకుండా కాపాడాలి!" రవి చేతుల్ని పట్టుకుని అర్థించాడు.

అగ్నిపుత్ర ప్లాన్ వినగానే రవి అరచేతులు చెమటలు పట్టాయి.

ఆ పథకమే గాని అమలు జరిగితే ఎంత ప్రాణనష్టం, ఎంత ఆస్తి నష్టం జరుగుతుందో ఊహించడానికి కూడా భయపడ్డాడు రవి.

గిర్రున వెనక్కి తిరిగి ముందుకు పరిగెత్తాడు.

అతని జీప్ క్షణాలమీద వేగాన్ని అందుకుంది.

# 10

అగ్నిపుత్ర తన చేతిలో గ్రెనేడ్ వంక మరోసారి చూశాడు.

చిలగడదుంపలా వుందది. చేతిలో ఇమిడేలా వుంది. చివర ఒక వత్తి కనబడుతుంది. ఆ ఫ్యూజ్ లాగితే పేలిపోతుందది. దానిపై ఆధారపడి కొన్ని ప్రాణాలు వున్నాయి. నవ్వుతుంటూ దాన్ని తోలు సంచిలో

చేశాడు.

రివాల్వర్ బుల్లెట్స్ సరిచూసుకుని, ఎడమ చేతి ప్రక్కన వున్న హోల్స్టర్ లో పెట్టుకున్నాడు. అతని ఆత్మరక్షణకోసం అది.

వీధిలో సిద్ధంగా వున్న మోటార్ బైక్ యెక్కాడు. ఒక్క కిక్ తో దాన్ని స్టార్ట్ చేశాడు.

ఆ రోజే సర్వీసింగ్ నుండి వచ్చింది బండి. టాంక్ ఫుల్ గా వుంది. పని పూర్తయ్యేముందు ఈ యేర్పాట్లు తప్పనిసరిగా చూసుకుంటాడు అగ్నిపుత్ర.

అంతకు ముందురోజే బలరామ్ అతనికి సగం కేష్ అందించాడు. మిగిలినది పని పూర్తి అయిన మరుక్షణం యిచ్చేస్తాడు. ఉషారుగా బండిని పరుగెత్తించాడు.

ఎవరినైనా చంపడానికి వెళ్ళేటప్పుడు చాలా వుత్సాహంగా వుంటాడు అగ్నిపుత్ర. రాక్షసుడు కాదతను. కిరాతకుడు అసలే కాదు. అటువంటి పదాలు సరిపో వతనికి.

పదేళ్ళ వయస్సులో తిండి దొంగిలించడానికి మొట్ట మొదటిసారి హత్య చేశాడు. పట్టుబడి జైలు కెళ్ళాడు. అక్కడే రాటుదేలిపోయాడు. బయటకు వచ్చాక డబ్బు తీసుకుని హత్యలు చేసే కిరాయి హంతకుడిగా మారి పోయాడు.

ఇప్పుడు పోలీసులకు చేతినిండా పని కల్పించే స్థాయికి ఎదిగిపోయాడు.

పది నిముషాలలో గుడి ముందు వున్నాడు అగ్నిపుత్ర. అక్కడ నుండి కదిలి అటు ప్రక్కకు వెళ్ళాడు. బండి న్యూట్రల్ లో వుంచి స్టాండు వేశాడు. తిరిగిపోయే టప్పుడు బండి సిద్ధంగా వుంటుంది. ముందుకు నడిచా

దతడు. ఎత్తుగా వుంది ప్రహరీ గోడ. వెనక్కి వెళ్లాడు. మోటార్ బండిలో వున్న తోలుసంచి తీసి భుజానికి తగిలించుకున్నాడు. స్టడీగా నిలబడ్డాడు.

జింకలా ఒక్కసారి పరుగు అందుకున్నాడు. ప్రహరీ గోడను సమీపించగానే పక్షిలా గాల్లో ఎగిరాడు. అంచు చేతులకు అందగానే శరీరాన్ని పైకి లాక్కున్నాడు. మోకాళ్ళపై కూర్చుని ముందుకు చూశాడు.

ఎదురుగా వుంది ఒక మంటపం. దానిలో కూర్చుని వున్నారు స్వామీజీ. ప్రశాంతంగా వుంది ఆయన వదనం. శాంత గంభీరంగా వుంది ఆయన కంఠస్వరం. ఆయనలో తొణికిసలాడే ప్రశాంతతకు మృత్యువు కూడా ఎదుటపడడానికి భయపడుతుంది.

ఆయన ముందు కూర్చుని వున్నారు చాలామంది ప్రజలు. ఆయన నోటినుండి వెలువడే ప్రతిమాటా అత్యంత భక్తిశ్రద్ధలతో వింటున్నారు.

ఆ ప్రజాసమూహాన్ని జాగ్రత్తగా గమనించాడు అగ్నిపుత్ర. రేణుక కోసం వెతుకుతున్నాడతను. కాసేపటికి కనిపించింది రేణుక. ఒక ప్రక్కన ఒదిగి నిల్చుంది.

ఆమెను చూడగానే ప్రహరీగోడపై జాగ్రత్తగా నిల్చున్నాడు అగ్నిపుత్ర. నిల్చునే సమయంలోనే కనిపించాడు రవి. తనను గమనించి పరిగెత్తుకొస్తున్నాడు.

యూనిఫాంలో వున్న ఇన్‌స్పెక్టర్ అలా పరిగెత్తడం ఒకళ్ళిద్దరు వింతగా, ఆసక్తిగా చూస్తున్నారు. అతను తన దగ్గరకు రావాలంటే రేణుక ప్రక్కనుండే రావాలి. అది గమనించగానే ఒక క్రూరమైన దరహాసం అగ్నిపుత్ర పెదవులపై వెలిసింది.

"కమాన్ బ్లడీ పోలీస్ ఆఫీసర్. నీ శవాన్ని కాల్చ నక్కరలేదు. ముక్కలుగా మారిపోతావు" అనుకుంటూ భుజాన వున్న తోలుసంచి నుండి గ్రనేడ్ బయటకు తీశాడు. దాని సేఫ్టీ పిన్ను నోటితో లాగాడు.

# 11

అంగకు నాలుగు మెట్లు చొప్పున యెక్కేశాడు రవి. వేగంగా సిమ్మెంటు మందిరం చేరాడు. నిలబడి నాలుగు దిక్కులు చూశాడు.

ఆ ప్రజాసమూహాన్ని చూడగానే తన పొరపాటు అర్థమయ్యిందతనికి. రేణుక యెలా వుంటుందో తనకు తెలియదు. బలరామ్ వచ్చేవరకు ఆగడానికి లేదు. ప్రహరీగోడ వెంబడే తిరుగుతూ కాపలా కాస్తే కొంత వరకు ఫలితముండవచ్చును. యేదైనా జరగబోయే ఘోరాన్ని ఆపగలనన్న ధైర్యం లేదతనికి. అగ్నిపుత్ర యెంత జిత్తులమారో బాగా తెలుసు రవికి.

అంతేకాదు. తనెంత క్రిటికల్ పొజిషన్‌లో పడ్డాడో కూడా తెల్సిందతనికి. గుడిచుట్టూ వున్న ఇంత ప్రహరీ గోడ ఒక్కడు కాపలా కాయడం....కత్తిమీద సాము. అలాగని స్టేషన్‌కు కబురుపంపి సహాయం రప్పించుకోవడానికి సమయం చాలదు.

చుట్టూ జాగ్రత్తగా గమనించసాగాడు రవి.

స్వామీజీ హిందూమత ధర్మంగూర్చి ఉపన్యసిస్తున్నారు. వేదాంతాన్ని అనర్గళంగా బోధిస్తున్నారు. శ్రోతలు నాగస్వరానికి తలలూపే పాముల్లా అయిపోతున్నారు. సడన్‌గా అటుప్రక్క ప్రహరీగోడపై కనపడిందొక ఆకారం. ఆ సమయంలో గోడ యొక్క

అవసరం యెవరికి వుంటుంది, ఒక్క అగ్నిపుత్రకుతప్ప.

హోల్‌స్టర్ నుండి రివాల్వర్ బయటకు లాగుతూ పరిగెత్తాడు. సరిగ్గా అదే సమయానికి అగ్నిపుత్ర చేతికి తగిలించుకున్న తోలుసంచి నుండి యేదో బయటకు లాగాడు. అదేమిటో చూడకుండానే పసిగట్టాడు రవి.

"గ్రనేడ్."

వెంటనే మోకాళ్ళపై కూర్చుండిపోయాడు రవి. రెండు చేతులతో రివాల్వర్ స్టడీగా పట్టుకున్నాడు. పోలీస్ ట్రైనింగ్ సెంటర్‌లో అహర్నిశలు కష్టపడి నేర్చుకున్న రైఫిల్ షూటింగ్‌కు ఇది పరీక్షా సమయం.

తన ఒక్కడి గురిపై కొన్ని వందల ప్రాణాలు ఆధారపడి వున్నాయి. జీవితంలో మొట్ట మొదటిసారి దేవుడు గుర్తుకు వచ్చాడు.

సకల ప్రపంచాన్ని ఆవరించి వున్న ఓ నిర్గుణ స్వరూపుడా! ఏ రూపంలో వున్నా నా మొరాలకించు. జీవితంలో యేనాడు యేకోరికా కోరని నేను యిప్పుడు కోరుతున్నాను. నా గురి తప్పకుండా అనుగ్రహించు. ఇక్కడ వున్న యెంతోమంది ప్రాణాలను రక్షించే అవకాశం ఇవ్వు.

రవి కంటిముందు నుండి చుట్టూ వున్న జనం మాయమయ్యారు. ప్రహరీగోడ అదృశ్యమయ్యింది. అగ్నిపుత్ర మిగిలిన శరీరం కూడా మాయమయ్యింది. అగ్నిపుత్ర చెయ్యి ...గ్రనేడ్ పట్టుకున్న అతని చెయ్యి మాత్రమే కనపడసాగింది.

అగ్నిపుత్ర నోటితో పిన్నులాగి, గ్రనేడ్ ముందుకు విసరబోతున్నాడు. ట్రిగ్గర్ బలంగా ప్రెస్ చేశాడు రవి.

"ఢాం" పెద్ద శబ్దమయ్యింది.

అగ్నిపుత్ర కళ్ళముందు అగ్నిగోళాలు ప్రత్యక్షమయ్యాయి. సజీవంగా చితిపైకెక్కినట్లుంది. వేల సూదులు శరీరంలో గుచ్చుకున్నట్లయ్యింది. ఆ తర్వాత ఏం జరిగిందో అతనికి తెలియదు. అతని శరీరంలో సగ భాగం తుక్కయిపోయింది. మిగిలిన సగం చలన రహితంగా పడివుంది.

మొదటి రెండు క్షణాలు అక్కడి ప్రజలకు యేమీ అర్థంకాలేదు. బిగిసిపోయారు. తర్వాత పెనుకేకలతో అక్కడినుండి పారిపోసాగారు.

శరీరంలో శక్తి అంతా ఎవరో లాగేసినట్లు అయ్యింది రవికి. చెమటలు పట్టిన ముఖాన్ని అరచేతులతో రుద్దుకుంటూ అలాగే కూర్చుండిపోయాడు రవి. జీవితంలో మొదటిసారి హత్య చేసినా, అందువల్ల యెంతోమందిని రక్షించినందుకు ఆనందంగా వుందతనికి.

కాస్సేపటికి భుజంపై చెయ్యి పడటంతో తలపైకెత్తి చూశాడు. పోలీస్ కమీషనర్ నిల్చుని వున్నారు. ఆప్యాయంగా భుజం తట్టారాయన. చాలు. ఒక సిన్సియర్ పోలీస్ ఆఫీసర్‌కు పై అధికారినుండి అమాంతం ప్రోత్సాహం చాలు. ఆ గుడి ప్రాంగణం అంతా పోలీస్ కార్స్‌తో నిండిపోయింది.

బలరాం కళ్ళు రేణుకకోసం ఆత్రంగా వెదికాయి. కనిపించిందామె. గూటినుండి జారిపడ్డ పక్షికూనలా దీనంగా ఒక మూల ఒదిగి నిల్చుంది.

ఆమెను అలా చూసేసరికి బలరాం మనసు ఆర్ద్రమైంది.

మెల్లిగా దగ్గరకు నడిచాడు. ఆమె తలపై చెయ్యివేసి మృదువుగా తడిమాడు. ఆ స్పర్శ యెన్నో విషయాలు తెలియజేసింది రేణుకకు. ఆమె కళ్ళు ఆనందంతో తళుక్కున మెరిసాయి. అవి ఆకాశంలో మెరిసే నక్షత్రాలులా ఉన్నాయి.

—:అ యి పో యి ం ది:—

## క్రొత్త సీరియల్ ప్రారంభం!

సీరియల్-

# విహారికోయిల

## బొమ్మిడి అచ్చారావు

రాత్రి ఏడుగంటల నలభై అయిదు నిమిషాలయింది.

హైదరాబాద్ నుంచి ఢిల్లీ పోయే ఎయిర్ బస్ 'బే'లో సిద్ధంగా నిలబడి వుంది. మరో అరగంటలో టేకాఫ్ కాబోతున్నదని మైక్స్‌లో తియ్యటి కంఠ స్వరం చెపుతోంది.

సిద్ధార్థ అప్పటికే కాక్‌పిట్‌లోని తన సీట్లో కూచుని చెక్ లిస్టులోని అయిటమ్స్ అన్నీ వరసగా చెక్ చేసుకుంటున్నాడు. ఫ్యూయల్ లెవెల్ సరిచూసుకున్నాడు. డయల్స్ అన్నీ చూసి రీడింగ్స్ నోట్ చేసుకున్నాడు.

రెండువందల డెభ్భైఅయిదుమంది ప్రయాణీకులు ప్రయాణం చేయగల విశాలమయిన ఎయిర్ బస్ అది. దానికి నాలుగు ఇంజన్లున్నాయి. వాటిని పనిచేయించటానికి అప్పటికే గ్రౌండ్ పవర్ యూనిట్ సిద్ధంగా దగురన నిలబడి వున్నది. విమానం గ్రౌండ్‌లో వున్నంతసేపు దానికి కావలసిన పవర్ గ్రౌండ్ పవర్ యూనిట్ జనరేటర్ల ద్వారా సప్లై చేయబడుతుంది.

ఇంకా ఫ్లైట్ ఇంజనీర్ చక్రవర్తి, సీనియర్ పైలట్ సునీల్ కాక్‌పిట్‌లో ప్రవేశించలేదు. వాళ్ళకోసం ఎదురుచూస్తున్నాడు కోపైలట్ హోదాలో ఉన్న సిద్ధార్థ.

పాసింజర్లు ఒకరొకరు ఫార్మాలిటీస్ అన్నీ పూర్తి చేసుకుని లాంజ్‌లోకి చేరుతున్నారు. వాళ్ళ సామాన్లు కన్వేయర్ బెల్టుద్వారా ఓ ప్రక్కను చేరుకుంటున్నాయి. వాటిని ఆ ట్రక్‌లో లోడ్ చేసి విమానం దగ్గరకు తీసుకువెళ్తారు. తర్వాత ఆ సామాను విమానంలోకి సురక్షితంగా చేర్చబడుతుంది.

మనిషికి 20 కిలోల బరువును అనుమతిస్తారు. అంతకు మించిన బరువుకి ఎక్స్‌ట్రా ఛార్జి చేస్తారు.

కేటరింగ్‌కి సంబంధించిన వేన్ అప్పటికే విమానం దగ్గరకు చేరుకున్నది. ప్రయాణీకులకి డిన్నర్ ఫ్లైట్‌లో సర్వ్ చేస్తారు. అవికాక బిస్కెట్స్, వేఫర్స్, సాఫ్ట్ డ్రింక్స్ కూడా సర్వ్ చేయబడతాయి.

ఎయిర్ హోస్టెస్‌లు నలుగురు నవ్వుతూ, తుళ్ళుతూ వస్తూన్నారు. వాళ్ళతోబాటు యిద్దరు మేల్ స్టివార్డ్లు కూడా వున్నారు. వాళ్ళు నేవీబ్లూ పాంట్సు, వయిట్ షర్టు ధరించి వున్నారు. ఎయిర్ హోస్టెస్‌లు సిల్కు చీరల్లో దేవతల్లా మెరిసిపోతున్నారు.

వాళ్ళలో పొడవుగా తెల్లగా స్వచ్ఛతకు ప్రతిరూపంలా వుందో అమ్మాయి. ఆమె ముఖంలో చెరగని చిరునవ్వు, సహనం, సౌహార్ద్రత కనిపిస్తున్నాయి.

తెల్లటి యూనిఫాంలో వున్న పైలట్ సునీల్ ఆమెను పేరుపెట్టి పిలిచాడు "సుస్మితా!" అంటూ.

ఆమె చటుక్కున ఆగి వెనక్కి చూసింది.

"నేను నీతో ప్రయివేట్ గా మాట్లాడాలి. విమానం యెక్కాక మళ్ళీ అవకాశం రాకపోవచ్చు" అన్నాడు సునీల్.

సుస్మిత ఆగి చూసింది. ఆమె ముఖంలో యిప్పుడు చిరునవ్వు లేదు. గాంభీర్యత చోటు చేసుకుంది.

"ప్లేన్ మరో ఇరవై నిమిషాల్లో బయల్దేరబోతోంది. ఇప్పుడు కబుర్లతో సమయం వ్యర్థం చేస్తే ఎలా?" అంది సుస్మిత అసహనంగా.

సునీల్ విరగబడి నవ్వాడు. అతను డ్రింక్ చేసివున్నాడని గాల్లో తేలివచ్చిన ఆల్కహాల్ వాసన ఆమెకు చెప్పింది. కొద్ది నిమిషాల్లో బయల్దేరబోతున్న ఎయిర్ బస్ పైలట్ అతను. రూల్స్ కి వ్యతిరేకంగా డ్రింక్ చేసివున్నాడు. డ్యూటీలో ఆల్కహాలు సేవించి వుండటం నిషిద్ధం! దాదాపు మూడువందలమంది ప్రాణాలు అతని చేతిలో వున్నాయి.

విమానం టేకాఫ్ సమయంలో స్మోక్ చేయడానికి కూడా అనుమతించరు. అతడి చేతిలో ఎర్రగా వెలుగుతున్న సిగరెట్ వంక అతనివంక అసహనంగా చూసింది సుస్మిత.

అవతల పాసింజర్స్ కి సీట్సు చూపించాలి. వాళ్ళ అవసరాలు చూడాలి. వాళ్ళు తీసుకోవలసిన జాగ్రత్తల గురించి, ప్రెషర్ తగ్గినప్పుడు ఆక్సిజన్ మాస్క్ లు ఎలా ధరించాలో అదంతా డిమాన్ స్ట్రేట్ చేసి చూపించాలి. ఇంకా బోలెడు తతంగముంది.

పైలట్స్ కూడా ఆ సమయానికి ఇంజన్స్ చెక్ చేసుకోవటం పూర్తిచేసుకుని గ్రౌండ్ కంట్రోల్ కి మెసేజ్ పంపించుకోవలసి వుంటుంది. అప్పుడు టేకాఫ్ కి వాళ్ళు

అనుమతిస్తారు. కాని సునీల్ నిమ్మకు నీరెత్తినట్టు ఇంకా గ్రౌండ్ మీదే వున్నాడు. పైగా అసందర్భ ప్రసంగం చేస్తున్నాడు.

సుస్మిత మాటలకి విరగబడి నవ్వాడు, అదో పెద్ద జోక్ అన్నట్టుగా.

"ప్లేన్ బయల్దేరబోతోందా? నేను కాక్‌పిట్‌లోకి అడుగు పెట్టకుండా ప్లేన్ ఎలా స్టార్టవుతుంది?" అన్నాడు గర్వంగా సునీల్.

"వెంటనే ఇంజన్స్‌ని అటెండ్ కండి. టైం లేదు. పాసింజర్స్ ఎక్కుతున్నారు, ఇక పదిహేను నిమిషాలే ఉంది టేకాఫ్‌కి" అన్నది సుస్మిత.

డ్యూటీని దైవంగా భావించే సిద్ధార్థ చెక్‌లిస్టులోని అయిటమ్స్ పంతొమ్మిదీ చకచక చెక్ చేయటం పూర్తి చేశాడు అప్పటికే. నిజానికి ఆ పని సీనియర్ పైలట్ సునీల్‌ది. అతను ఎలాంటివాడో సిద్ధార్థకి బాగా తెలుసు.

"సుస్మిత, ఐ లవ్ యూ!" అన్నాడు సునీల్ ఆమె చేయి నందుకోబోతూ.

"మిష్టర్ సునీల్! దిసీజ్ టూ మచ్! ప్రేమ ఒన్‌వే ట్రాఫిక్ కాదు. ఐ డోంట్ లవ్ యూ!" నిష్కర్షగా చెప్పింది సుస్మిత.

"అవును, ఆ సిద్ధార్థ గాడొచ్చాక నువ్వు పూర్తిగా మారిపోయావు. అంతక్రితం నాతో కొంత టైం స్పేర్ చేసేదానివి. వాడొచ్చాక నేనంటే వెగటు పుట్టింది నీకు."

"ప్లీజ్ ....డోంట్ టాక్ రఫ్. ఇష్టంలేని ఆడదాని వెంటపడటం ఎవరికీ మంచిది కాదు. నేను వెళ్తున్నాను."

"షాట్ షాట్! ఆ సిద్ధార్థని చూసుకునే కదూ, నీ మిడిసిపాటు? వాడు చస్తే...నన్నే లైక్ చేస్తావు కదూ!" వక్రంగా నవ్వాడు.

"సునీల్ మీరు చాలా వల్గర్ గా మాట్లాడుతున్నారు. సిద్ధార్థ గురించి మరొక్కమాట తప్పుగా అంటే నేను సహించను. హి ఈజ్ సిన్సియర్ అండ్ హేండ్సమ్ గై! అతన్నెవరైనా ప్రేమించి తీరతారు"

"అందుకేనా వాడి ప్రేమలో పడ్డావ్? నాకు తెలియదనుకోకు. వాడ్ని చూసేటపుడు నీ కళ్ళలో మెరిసే తళుకు, నీ ముఖంలో విరిసే ఆనందం, నీ పెదాలపై తొణికిసలాడే చిరునవ్వు నువ్వతన్నెంతగా ఆరాధిస్తున్నావో చెప్తాయి."

"అవును ...అతనంటే నాకెంతో ప్రేమ, ఆరాధన, భక్తి, గౌరవం—అన్నీ! వాటిని మీ మాటలతో తుడిచెయ్యలేరు. లీవ్ మీ, నాదారి కడ్డులేవండి."

"లేవను. ఈ రోజు నీ సంగతి తేలిపోవాలి. నువ్వు నామాట కాదంటే ఏం జరుగుతుందో తెలుసా....?" ఎఫెక్టు కోసం ఓ క్షణం ఆగి ఆమె ముఖంలోకి కోరగా చూశాడు సునీల్.

సుస్మిత మనసు కీడును శంకిస్తోంది. ఈ సునీల్ నయవంచకుడు. దుర్మార్గుడు! ఏమైనా చేస్తాడు. అనుమానం లేదు.

"రేపు అతడి శవానికి దహన సంస్కారాలు జరుగుతాయి" భావయుక్తంగా నవ్వాడు సునీల్.

"వద్దు....వద్దు. అతన్నేం చెయ్యొద్దు. అతనికేం తెలీదు. నేనతన్ని ప్రేమిస్తున్నట్టు అతనికి నేనెప్పుడూ చెప్పలేదు. అతని మనసు తెలుసుకోకుండా నేను తొందర

పడదలచుకోలేదు. అసలు అతను నాతో ఇలాంటి ప్రస్తావన యెన్నడూ తీసుకురాలేదు" ఆమె గొంతులో నిజాయితీ, సిద్ధార్థపట్ల అనురాగం మిళితమై ధ్వనించాయి.

"అలా కాకూడదనుకుంటే—నీ ఆరాధ్య దేవుడు క్షేమంగా కలకాలం వుండాలంటే నా కోరిక నువ్వు తీర్చాలి. ఇప్పుడు కాదు. ఫ్లైట్ ఢిల్లీ చేరాక. రేపంతా మనకి రెస్టు కదా! ఓ కే!?....హోటల్లో కలుద్దాం...." అన్నాడు సునీల్. పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ విమానంవైపు నడిచాడు.

సుస్మిత కొద్దిక్షణాలు మాటలు రానిదానిలా అలాగే నిల్చుండిపోయింది. తర్వాత తెలివి తెచ్చుకుని వేగంగా విమానంవైపు కదిలింది. ఆమె మనసు కలవరంతో నిండిపోయింది. సిద్ధార్థ అమాయకమైన ముఖమే కళ్ళలో మెదుల్తోంది. అతడు కనిపిస్తే సూచనగా చెప్పాలనుకుంది.

అప్పటికి పాసింజర్సందరు తమతమ సీట్లలో కూర్చోవటం సేఫ్టీ బెల్ట్సు కట్టుకోవటం కూడా పూర్తయిపోయింది.

గ్రౌండ్ జనరేటర్ల ద్వారా నాలుగు ఇంజన్లని స్టార్టు చేసి సిద్ధంగా వున్నాడు సిద్ధార్థ.

అప్పుడు కాక్‌పిట్‌లో అడుగుపెట్టాడు సునీల్. ఓరగా సిద్ధార్థ వైపు చూశాడు.

పొగరుగా తలెగరేసి, "హూ ఆర్డర్డ్ యూ టు స్టార్టు ఇంజన్స్?" అంటూ అరిచాడు.

"టైం ఈజ్ అవ్ మిస్టర్ సునీల్! ఉయ్ షుడ్ టేకాఫ్ బై క్వార్టర్ పాస్టు ఎయిట్. ఇటీజ్ ఎయిట్ టెన్ అల్రెడీ!" అన్నాడు సిద్ధార్థ చాలా సౌమ్యంగా.

"అయినాసరే, తనొచ్చి చెక్ లిస్టు వెరిఫై చేసుకొనే వరకు వెయిట్ చెయ్యాల్సిందే! మరోసారి ఇలాంటిది జరిగితే టాలరేట్ చెయ్యలేను" అన్నాడు సునీల్ ముఖం గంటు పెట్టుకుని.

గ్రౌండ్ కంట్రోల్ నించి అప్పుడే అడుగుతున్నారు.

"ఈజ్ ఎవ్రిథింగ్ ఆల్ రైట్?" అంటూ.

సునీల్ రేడియోలో వార్త పంపాడు—

"ద ఫ్లైట్ ఈజ్ రెడీ ఫర్ టేకాఫ్!" అని.

"యు కెన్ ప్రొసీడ్!" ఆర్డర్స్ వచ్చాయి గ్రౌండ్ కంట్రోల్ నించి.

విమానం గాల్లోకి లేచింది.

అప్పుడు గమనించాడు సిద్ధార్థ— ఫ్లైట్ ఇంజినీర్ చక్రవర్తి కాక్‌పిట్‌లో లేని సంగతి! ఒకవేళ కేబిన్‌లోని క్రూతో కలిసి వున్నాడేమోననుకున్నాడు కాని, కాదని తేలిపోయింది.

సరిగ్గా విమానం గాల్లోకి లేస్తూండగా లాంజ్‌లోంచి పరుగెత్తుకొస్తూన్న చక్రవర్తి కనిపించాడు సిద్ధార్థకి.

"మిస్టర్ సునీల్, మిస్టర్ చక్రవర్తి రాకుండానే ఇంజన్స్ టేకాఫ్ తీసుకున్నారేమిటి? ఆయన గ్రౌండ్ మీదే వుండిపోయారు!" అన్నాడు సిద్ధార్థ.

సునీల్ పెదవి మెదపలేదు. విమానాన్ని ఆల్టిట్యూడ్‌కి తీసుకొచ్చేవాడప్పటికే. ఇప్పుడు విమానం భూమికి సమాంతరంగా నాలుగువందల నాట్స్ వేగంతో దూసుకుపోతోంది.

సిద్ధార్థకి సునీల్ మౌనం చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. ఎందుకితనింత ముభావంగా వున్నాడు? తనంటే ఎందుకు ధుమధుమలాడిపోతున్నాడు?

అంతుపట్టలేదు సిద్దార్థకి.

తదేక దీక్షతో తనపనిలో నిమగ్నమైపోయాడు.

* * *

కేబిన్‌లోనించి పెద్దగా కేకలు, అరుపులు విని పించాయి.

ఆ అరుపులమధ్య సుస్మిత గొంతు వినిపించి ఆసక్తిగా వెనక్కి తిరిగి చూశాడు సిద్దార్థ. ఆమె వెక్కి ఏడుస్తు న్నట్టుగా వినిపించింది.

అతని మనసుండబట్టలేదు.

"ఒక్కసారి నేను కేబిన్‌లోకి వెళ్ళి వచ్చేస్తాను" అన్నాడు సిద్దార్థ లేవబోతూ.

వెంటనే అభ్యంతరం పెట్టాడు సునీల్. "ఓ పక్క ఫ్లయిట్ ఇంజనీరు చక్రవర్తి లేడు. ఉన్నది నేనొక్కడ్ని ఎలా కంట్రోల్ చేసుకోవాలి? అక్కడ మేల్ స్టీవార్డు లున్నారు. ఏదయినా గలభా జరిగితే వాళ్ళు చూసు కుంటారు" అన్నాడు.

సుస్మిత దీనస్వరం ఈసారి మరింత స్పష్టంగా వినిపిం చింది.

సిద్దార్థ ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా కేబిన్‌లోకి దూసుకొచ్చాడు.

అక్కడ ఓ పాసింజర్ తన చేతిలోని విస్కీ సీసాని సుస్మిత నోటిదగ్గరకు తీసుకొచ్చి తాగమని వేధిస్తున్నాడు.

"మీరున్నది ఎందుకు? పాసింజర్స్ అవసరాలు తీర్చ టానికి! మా సంతోషంకోసం ఏం చెయ్యమన్నా చెయ్యాలి....జస్ట్ రెండు సిప్స్....ఊఁ....తాగాలి...." అంటూ హుంకరిస్తున్నాడతను.

చూడటానికి గూండాలా వచ్చి నెత్తురుతాగే

దాదాలా వున్నాడతను. సుస్మిత చేయి అతని గుప్పెట్లో నిర్దాక్షిణ్యంగా నలిగిపోతోంది.

అంతవరకు తక్కిన ఎయిర్ హోస్టెస్‌లు, మేల్ స్టివార్డులు—అతనికి యెంతగానో నచ్చచెప్పటానికి ప్రయత్నించి విఫలమయ్యారు. తోటి ప్రయాణీకులు ఇదంతా వినోదంగా చూస్తూన్నారేగాని యెవరూ "ఇదేం పని!" అని అడగటంలేదు, అతనికి భయపడి.

సుస్మిత నిస్సహాయస్థితిలో సన్నగా రోదిస్తోంది.

సరిగ్గా అప్పుడే కేబిన్‌లో అడుగుపెట్టాడు సిద్ధార్థ. పరిస్థితిని క్షణాల్లో తెలుసుకున్నాడు.

"ప్లీజ్ లీవ్ హెర్!" అన్నాడు సౌమ్యంగా.

అప్పటికే తాగుడు నిషా తలకెక్కిన ఆ పాసింజర్ తుపుక్కున సిద్ధార్థమీద ఉమ్మాడు.

అంతే! సిద్ధార్థ పిడికిలి బిగించి అతని నోటిమీద కొట్టాడు.

ఆ దెబ్బకు అతని దంతాలు కదిలిపోయి వుంటాయి. ముక్కునుంచి నోటి చివర్లనుంచి రక్తం ధారికలు కట్టింది.

అప్పుడు ముందుకొచ్చారు మేల్ స్టివార్డులు.

ఇంతలో దెబ్బతిన్న ఆ గూండా పాసింజర్ జేబు నించి రివాల్వర్ పైకితీశాడు. సెక్యూరిటీ స్టాఫ్ కళ్ళు గప్పి మెటల్ డిటెక్టర్‌కి దొరక్కుండా ఆ రివాల్వర్ నెలా తెచ్చాడో అర్థంకాలేదు సిద్ధార్థకి.

రివాల్వర్ సూటిగా సిద్ధార్థకే గురిచేసి, ట్రిగ్గర్ మీద వేలుంచాడు. క్లిక్‌మన్న శబ్దం వినిపించింది. సేఫ్టీ కాచ్ రిలీజయిన శబ్దం అది!

సిద్ధార్థ మెరుపువేగంతో అతనిమీది కెగిరి తన్నాడు.

రివాల్వర్ అల్లంతదూరం ఎగిరిపడింది.

టెన్షన్‌తో, ఆందోళనగా ఇదంతా చూస్తున్నది సుస్మిత. తక్కిన ఎయిర్ హోస్టెస్‌లు, ప్రయాణీకులు చేష్టలుడిగి చూస్తున్నారు.

సిద్ధార్థ ఆ ప్రయాణీకుడిమీద పడి అతని చేతులు వెనక్కి విరిచి పట్టుకున్నాడు. స్టివార్డ్ లిద్దరు అతన్ని నైలాన్ తాడుతో చేతులు వెనక్కి విరిచి కట్టేశారు. కూచున్న చోటనే సీటుకి బంధించారతన్ని.

"థాంక్యూ వెరీమచ్ సిద్ధార్థా! మీరు నా పరువు మర్యాదలు కాపాడారు" అంది సుస్మిత కృతజ్ఞత నిండిన స్వరంతో.

చిరునవ్వుతో ఆమె అభినందనలందుకుని కాక్‌పిట్ లోనికి ప్రవేశించాడు సిద్ధార్థ.

"నువ్వు నా ఆర్డర్స్ ఒబే చెయ్యకుండా వెళ్ళావు. నీ ఇన్ ఒబీడియన్స్ టు సుపీరియర్స్ గురించి హాయ్యర్ అథారిటీస్‌కి రిపోర్టు చేస్తాను" అన్నాడు సునీల్ మండి పడుతూ.

సిద్ధార్థ చాలా సౌమ్యంగా చెప్పాడు. "అవతల మన స్టాఫ్‌ని పాసింజర్స్ అవమానిస్తుంటే ఆదుకోవటం అపరాధం కాదు."

"అది నీ డ్యూటీ కాదు. ఒక స్టాఫ్ మెంబర్ కోసం రెండువందల డెభ్భైయయిదు మంది పాసింజర్ల ప్రాణాలతో ఆటలాడుకోవటం యెవరూ హర్షించరు."

"నిజం తెలిస్తే మీరిలా మాట్లాడరు."

"నేను కాకమ్మ కథలు వినను. డ్యూటీలో యే మాత్రం పొరబాటు దొర్లినా క్షమించను"

సిద్ధార్థ వెంటనే మాట్లాడలేదు. సీట్లో కూచుని

రిలాక్స్‌గా ఒక్క నిమిషం వెనక్కి వాలాడు కళ్ళు మూసు కుని.

సరిగ్గా అప్పుడే అత నూహించని సంఘటన జరిగి పోయింది.

"మిస్టర్ సిద్ధార్థా!" అన్న సుస్మిత కేకతో ఉలిక్కి పడి కళ్ళు తెరిచాడు సిద్ధార్థ.

అప్పటికే. యెప్పుడు విండో తెరిచాడో తెలీదు; సునీల్ ఆ విండోలోంచి సిద్ధార్థని బలంగా కిందికి తోసేశాడు.

*    *    *

తన పరువు కాపాడటం కోసం ధైర్యంగా దుండ గుడితో ప్రాణాలకి తెగించి తలపడ్డ సిద్ధార్థకు కూల్ డ్రింక్ సర్వ్ చెయ్యటానికి కాక్‌పిట్ లోని కొస్తున్న సుస్మితకి సునీల్ తలపెట్టిన ద్రోహం కనిపించింది.

సుస్మిత ఆర్తనాదం విని కళ్ళు తెరిచిన సిద్ధార్థ విండో నుంచి జారిపోతూ రెక్కను పట్టుకుని గాల్లో వేల్లా డాడు. పైకి రావటానికి వీల్లేకుండా గాలి విపరీతమైన వేగంతో అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

భూమికి నాలుగు మైళ్ళ ఎత్తులో దాదాపు నాలుగు వందల నాట్స్ వేగంతో గాలిని కోసుకుంటూ దూసుకు పోతున్న విమానం రెక్కని పట్టుకుని నిస్సహాయంగా గాల్లో వేలాడుతున్నాడు సిద్ధార్థ.

సుస్మిత మెరుపు వేగంతో విండో దగ్గరకొచ్చి చేతి నందించింది సిద్ధార్థకి. అయితే యిలా జరుగుతుందని ముందే వూహించిన సునీల్ ఆమెకా అవకాశ మివ్వకుండా ఆమెని గెంటుకుంటూ తనే ముందుగా విండోని సమీపిం చాడు.

ఆటోపైలట్ స్టార్టు చేసిన కారణంగా విమానం నిర్ణీత మార్గంలో నిరాటంకంగా సాగిపోతోంది— సునీల్ సీట్లో లేకపోయినా.

సుస్మిత సునీల్ పట్టునుంచి విడిపించుకుని విండో దగ్గర కొచ్చి చేయి అందించటానికి మళ్ళీ ప్రయత్నించింది.

సరిగ్గా అప్పుడే సునీల్ కాలితో బలంగా సిద్ధార్థ చేతులమీద తన్నాడు. సిద్ధార్థ సమయస్ఫూర్తితో ఓ చేతిని పక్కకి జరిపి రెండో చేతిని సునీల్ బూటుకాలి బారినుంచి లాఘవంగా తప్పించుకున్నాడు.

సునీల్ మళ్ళీ కాలెత్తి తన్నాడు.

సుస్మితకి మెరుపులాంటి ఆలోచన వచ్చింది. సునీల్ని ఒక్కసారిగా బయటికి తోసేస్తే....!?

కాని, ఆమె వివేకం తట్టి లేపింది. అలాచేస్తే రెండువందల డెబ్భైఅయిదు మంది ప్రాణాలు గాల్లో కలిసిపోయినట్టే! సిద్ధార్థ ఓ పక్క చావుబతుకుల మధ్య వేళ్ళాడుతున్న సమయంలో సునీల్ని బయటికి తోసేస్తే ఆ ఎయిర్ బస్ను నడిపే దిక్కేది?

అదే ఆమె చేసిన పొరపాటు! సునీల్ని తోసేసి, సిద్ధార్థని పైకి చేదుకోగలిగితే సిద్ధార్థ ఆ విమానాన్ని సురక్షితంగా గమ్యం చేర్చగలిగి వుండేవాడు.

చేతులు పచ్చిపుళ్ళయిపోతున్నా పళ్ళ బిగువున భరించి విమానం రెక్కని పట్టుకొని వేళ్ళాడుతున్న సిద్ధార్థ తనని తాను రక్షించుకోవటం సాధ్యం కాదని రూఢీ చేసుకున్నాడు.

అయితే సుస్మిత సమయస్ఫూర్తితో వ్యవహరించింది.

ఓ పారాచూట్ ని సిద్ధార్థకి అందించింది.

సిద్ధార్థ గాల్లోకి జారాడు పారాచూట్ సాయంతో.

ఊహించని సంఘటనకి కొద్దిక్షణాలు నిశ్చేష్టుడయ్యాడు సునీల్. అయితే అంతలోనే అతని పెదాల మీద క్రూరహాసం మెరిసింది.

అంతే! సుస్మితను కూడ విండోలోంచి బయటికి తోసేశాడు. ఆవిడ ఆర్తనాదం విమానం రొదలో కలిసిపోయిన ఎవరికీ వినిపించలేదు. అయితే అదృష్టవశాత్తు ఆమె చేతిలో మరో పారాచూట్ వుంది.

'పారాచూట్స్‌లో తప్పించుకున్నంత మాత్రాన బతికి బట్టకట్టొద్దూ? మీ ప్రాణాలు గాల్లో కలిసిపోయినట్టే!' వికటంగా నవ్వుకుని విండో మూసి తన సీట్లోకి వచ్చి కూచున్నాడు సునీల్.

తనకి దక్కని సుస్మిత ఎవరికీ దక్కకూడదు. ఆమె తను సిద్ధార్థని తోసేయటం చూసిన ప్రత్యక్ష సాక్షి! ఆమె బతికుండటం తన ఉనికికే ప్రమాదం.

సునీల్ తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

విపరీతమయిన వేగంతో పారాచూట్స్ గాలివాటుకి అనుకూలంగా ఎక్కడికో ఎగిరపోతూనే వున్నాయి చాలా సేపటివరకు.

అయితే యింతలోనే సునీల్‌కి ఓ ఆలోచన వచ్చింది. కేబిన్‌లోని స్టాఫ్‌కి తన తప్పు లేదని రుజువు చేసుకోవాల్సిన బాధ్యత తనమీదున్నది. వాళ్ళిద్దరి అంతర్ధానం గురించి సంజాయిషీ ఇచ్చుకోవాల్సిన పరిస్థితి రాకుండా ముందే జాగ్రత్తపడాలి.

సునీల్ లేచి కాక్‌పిట్‌నుంచి బయటికి, కేబిన్‌లోకి తొంగిచూసి ఎయిర్‌హోస్టెస్‌ని, స్టివార్డ్స్‌ని పిలిచాడు

హడావుడిగా.

వాళ్ళు వచ్చేసరికి మళ్ళీ విండో తెరిచివుంచి, బయటికి చూస్తున్నట్టు నటిస్తూ నించున్నాడు.

"సుస్మిత, సిద్ధార్థ పారాచూట్స్‌తో గాల్లోకి గెంతేశారు" అన్నాడు ఆందోళన, విచారం ముఖంలోను గొంతులోను మిళితంచేసి.

తొంగిచూసిన స్టాఫ్‌కి సుదూరంగా చుక్కల్లా కనిపిస్తున్న పారాచూట్స్ లీలగా కనిపించాయి.

సునీల్ మాటల్ని నమ్మినవాళ్ళు నమ్మారు. నమ్మని వాళ్ళు మౌనంగా తమ విధి నిర్వహణకి మరలారు. ఎవరూ పెదవి కదపలేదు.

కాని అందరికీ తెలుసు....సిద్ధార్థ, సుస్మిత ఎలాంటి వారో! కోరి ప్రాణాలకి తెగించి, ప్రాణాపాయ సమయంలో ఉపయోగించే పారాచూట్స్‌లో ఎందుకు ఎగురుతారు?

కాని....సునీల్‌ని నేరస్థుడిగా నిరూపించే శక్తి తమకి లేదని వాళ్ళకి తెలుసు! అందుకే మనసుల్ని పిండేస్తున్న బాధ నణచుకుని మౌనం వహించారు.

* * *

దాదాపు రెండు మూడు గంటల నుంచి పారాచూట్స్ అలా గాల్లో తేలిపోతూనే వున్నాయి.

టైం చూసుకున్నాడు సిద్ధార్థ.

రాత్రి పన్నెండున్నర గంటల సమయం!

చీకట్లో యేమీ సరిగా కనిపించటంలేదు.

అయితే తనకి కొద్ది దూరంలో సుస్మిత పారాచూట్ కనిపిస్తోంది. ఒక్కోసారి గాలివాటుకి అది మరో దిశలో ఎగుర్తోంది. తామిద్దరు ఒకచోట నేలమీదికి దిగే

అవకాశముందా? ఈ లోపల గాలి వేగంలో గణనీయమైన మార్పు వస్తే చెరోపక్కకి చెదిరిపోయే ప్రమాదం లేకపోలేదు.

సిద్ధార్థ మనసుని సునీల్ చేసిన ద్రోహం పిండి వేస్తోంది. ఎంత నయవంచకుడు సునీల్! తనమీద అతని కెందుకు అకారణ ద్వేషం? తను తెలిసి అతని కెలాంటి హాని చెయ్యలేదు. పాసింజర్ చేసిన అగడం గురించి ఇద్దరిమధ్య అభిప్రాయభేద మొచ్చింది, అంతే!

అంతమాత్రాన తనని విమానం నుంచి బయటికి తోసేస్తాడా సునీల్? ఊహూ, ఏదో బలమయిన కారణ ముండివుండాలి....అదేమిటో తన కెంతకీ అంతుబట్టడం లేదు.

అసహనంగా, అలసటగా తల విదిలించాడు సిద్ధార్థ.

సరిగ్గా అప్పుడే విపరీతమయిన వేగంతో ఝంఝా మారుతం చెలరేగింది. ఎక్కడ్నుంచో ఇసుక రేణువులు ఉవ్వెత్తున లేచి అతని కళ్ళలో పడ్డాయి.

భగ్గున మండాయి కళ్ళు. బాధతో వేదనగా కళ్ళు మూసుకున్నాడు సిద్ధార్థ. కర కరమని కళ్ళల్లో ఇసుక రేణువులు కంటి పాపల్ని ఒరుసుకుంటున్నాయి కర్కశంగా.

అంతకంతకు గాలి ఉధృతం పెరిగిపోతుందే గాని తగ్గుముఖం పట్టలేదు. అతను పయనిస్తున్న పారాచూట్ అమాంతం గాల్లో తలకిందులుగా అయింది. పారాచూట్ ని సరసర మంటూ గాలి తోసేస్తోంది. చినిగిపోయి చిలికిపోతున్న తరుణంలో మహావేగంగా నేలమీదికి జారి పోయింది పారాచూట్.

చీకట్లో తనేమైపోతున్నాడో యెక్కడికి చేరు

ఉన్నాడో తెలియని పరిస్థితిలో సిద్ధార్థ నేలమీదికి బలంగా విసిరి వేయబడ్డాడు.

నేలను తాకుతూనే అతనికి స్పృహ తప్పింది.

అది కొండప్రాంతమో, అడవిప్రాంతమో, కింద వున్నది బండరాళ్ళో, సముద్రమో, లోయలో యేమీ తెలియని అగమ్యపరిస్థితిలో గాలి దెబ్బకు అతనికి ఒక్కసారిగా స్పృహ తప్పిపోయింది.

* * *

సూర్యకిరణాలు వెచ్చగా సోకటంతో చటుక్కున మెలకువ వచ్చింది సిద్ధార్థకి.

కొంత సేపటివరకు కళ్ళు తెరవలేకపోయాడు. కళ్ళలోని ఇసుక కనుకొలకుల దగ్గరకు చేరింది. కాని కళ్ళు తెరిచేసరికి కనురెప్పమీది నుంచి ఇసుక జారింది.

ఓసారి పరిసరాల్ని పరిశీలించి చూశాడు.

అతని గుండె ఝుల్లుమన్నది.

కనుచూపు మేరలో యెటు చూసినా మేటుగా ఇసుక. తను ఇసుకలో కూరుకుపోయి వున్నాడు. దూరంగా పారాచూట్ లో శిథిలభాగాలు చిందరవందరగా పడున్నాయి.

ఎక్కడా చెట్టుచేమలు గాని, చిన్న మొక్కగాని కనిపించటంలేదు.

ఇసుక....ఇసుక....ఇసుక.

సిద్ధార్థకర్థమైపోయింది.

తనిప్పుడున్న ప్రాంతం ఎడారి! మానవమాత్రుడు జీవించటానికి కేమాత్రం సావకాశం లేని ఎడారి! తాగటానికి నీటిచుక్క కూడా దొరకని ఎడారి.

అయిపోయింది....తన జీవితం ఈ ఎడారిలో సమాధి

కాబోతున్నది. మహా బతికితే రెండు లేక మూడురోజులు బతుకుతాడేమో ఆహారం లేకుండా.

కాని నీరు లేకుండా ఇరవైనాలుగ్గంటలు కూడా బతకటం కష్టం!

నీరు దొరకదనే ఆలోచన మనసులో బలపడే కొద్దీ విపరీతమయిన దాహం చేస్తూంది. యెండ పెరిగే కొద్దీ దాహం కూడా పెరుగుతుంది. తల దాచుకోవటానికి నీడ కూడా దొరకదు. దాంతో క్షణ క్షణానికీ పెరిగే టెన్షన్‌తోను, దాహంతోను, ఒంటరితనంతోను రెండు రోజుల్లో పోయే ప్రాణం ఒకరోజులోనే పోతుంది.

'భగవాన్! తన కిలాంటి చావు రాసిపెట్టావయ్యా!!

విరక్తిగా నవ్వుకున్నాడు సిద్ధార్థ. చెయ్యని నేరానికి శిక్ష అనుభవిస్తున్నాడు తను.

ఈపాటికి హైద్రాబాద్‌లో తనింట్లో నిద్ర లేచి అమ్మతో కబుర్లు చెప్పుకుంటూ ఆమె యిచ్చే వేడి కాఫీ, కమ్మని పెసరట్లు రుచి ననుభవిస్తూ తన గర్ల్‌ఫ్రెండ్ దివ్యను కల్సుకునే ప్రయత్నాల్లో వుండాల్సినవాడు, దిక్కు లేని యీ ఎడారిలో దిక్కు లేని చావు చావబోతున్నాడు.

తన ప్రియురాలు దివ్య గుర్తుకు రాగానే అతని మనసు కొద్ది క్షణాలు మధురమైన ఊహాల్లో తేలిపోయింది. అంతలోనే తనెప్పటికీ ఆమెను కల్సుకోలేడని, ఈ లోకంతో చాలా తొందరలోనే తనకి ఋణం తీరిపోబోతున్నదని గుర్తుకొచ్చి మనసు నెవరో ఇనప పిడికిలితో నొక్కి వేస్తున్నట్టు విలవిల్లాడాడు.

అంతలో, అతనికి గుర్తొచ్చింది—సుస్మిత. అవును,

ఆమె ఏమయింది?

వెంటనే పైకిలేచి నించున్నాడు సిద్ధార్థ.

కళ్ళు తిరిగినట్టనిపించి తూలి పడబోయి నిలదొక్కు కున్నాడు. విపరీతమయిన గాలి తుఫాన్‌లో తను గతరాత్రి చిక్కుకున్న వైనం గుర్తొచ్చింది.

ఇసక రేణువులు కంట్లో పడిన కారణంగా తను కళ్ళు మూసేసుకున్నాడు యాంత్రికంగా. అప్పటివరకు తనకి కొంతదూరంలో సుస్మిత పయనిస్తున్న పారాచూట్ తన దృష్టిపథంలోనే వున్నది.

ఆ తర్వాతేమయిందో, ఆమె కేమయిందో తనకి తెలియదు.

ఎడారిలో ఇసక తుఫాన్‌లు తరచూ వస్తూంటాయని తనిదివరలో వినివున్నాడు. ఎక్కడో ఆకాశంలో ఎగురుతున్న తన కళ్ళలో ఇసక రేణువులు పడటానికి కారణం ఆ తుఫానే నని యిప్పుడు గ్రహింపు కొస్తోంది.

అయితే ఆ తుఫాన్‌లో పడి సుస్మిత పారాచూట్‌లో ఎక్కడికో ఎగిరిపోయి వుంటుంది.

తన ప్రాణం కాపాడటానికి పారాచూట్ నందించి తనతోబాటు గాల్లోకి దూకిన సుస్మిత యే మాశించి అలాంటి దుస్సాహసం చేసింది? లేదా—సునీల్ ఆమెను కూడ క్రిందికి తోసేశాడా?

అతని ఊహ కందలేదా విషయం.

కాని—ఆమె రక్షించిన ప్రాణం యిప్పుడీ ఎడారికి బలయిపోతున్నది. ఆమె త్యాగం నిరుపయోగమయి పోయినట్టే!

కాని....ఆమె ఉనికిని గుర్తించాలి. తన ప్రాణం

పోయేలోపల ఆమె నేదయినా సురక్షిత ప్రాంతానికి చేర్చగలదేమో ప్రయత్నించాలి. కాని, ఆమె బతికున్నదో లేదో తెలియాలి....ముందుగా ఆమె ఉనికి తెలియాలి....ఎలా?

ఇసుకలో కాళ్ళు కూరుకుపోతున్నా, నీరసంతో, దాహంతో శరీరం ప్రతిఘటిస్తున్నా ముందుకి అడుగులు వేస్తున్నాడు సిద్దార్థ.

అలా కొద్దిగజాలు వెళ్ళాక అతనికి ఓ ధర్మ సందేహం కలిగింది.

తను ముందుకి వెళుతున్నాడు. కాని, నలువైపులా యెటు చూసినా ఇసక మేటలు వేసిన ఆ ఎడారిలో సుస్మిత గురించి యే దిశలో వెతకాలి? ముందు, వెనక, కుడి ఎడమలు—అన్నీ వెతికేవరకు తన ప్రాణం నిలబడుతుందా? తన ప్రాణమే నిలబడుతుందో లేదో తెలీదు—తను మరో ప్రాణిని రక్షించాలనుకోవటం....! నవ్వొచ్చింది అంత బాధలోను.

ఒక నిముషం పాటు అలాగే నిల్చుండిపోయాడు సిద్దార్థ.

వాచీలో సమయం పది గంటలు చూపిస్తోంది. ఎడారిలో ఎండ తీవ్రత ఎంత దారుణంగా వుంటుందో ప్రత్యక్షంగా అనుభవిస్తున్నాడు,

ఎటు వెళ్ళాలో తెలియని అనిశ్చిత పరిస్థితిలో నిల్చుండిపోయిన సిద్దార్థకి తిరుగులేని ఓ సంకేతం కనిపించింది ఆకాశంలో.

అతని ముఖం వికసించింది. కాని అంతలోనే అతని మనసు కీడును శంకించింది.

ఆకాశంలో రాబందులు రెండు చాలా దిగువగా

చక్కర్లు కొడ్తున్నాయి.

రాబందులు నేలమీదకు అంత దగ్గరగా ఎప్పుడొస్తాయో అతనికి తెలుసు!

అంటే........సుస్మిత శరీరం ఆ ప్రాంతాల్లో పడి వుండొచ్చు. అయితే ఆమె ప్రాణాలతో లేనట్టేనా?

సిద్ధార్థ గుండె ఝల్లుమన్నది!

ఊహు, ఆమె చనిపోకూడదు....బతికే వుండాలి. తన ప్రాణం నిలబెట్టడానికి ఆమె ఎంతగానో తపనపడ్డది.

తనామెను ప్రాణాలతో చూడగలడా?

వేగంగా ముందుకి అడుగులు వేస్తున్నాడు.

దగ్గరగా కనిపించిన ఆ ప్రాంతాన్ని చేరటానికి గంటకు పైగానే పట్టింది.

దూరం నుంచే అతడికి చీలికలు పేలికలై పోయిన పారాచూట్ శిథిల భాగాలు కనిపించాయి.

అతనిలో టెన్షన్, ఆందోళన చోటు చేసుకున్నాయి. మనసుని చిక్కబట్టుకుని ఇసకలో కూరుకుపోతున్న అడుగుల్ని పైకి తేల్చివేస్తూ ఆ స్పాట్ చేరుకున్నాడు.

మొదట గాల్లో ఎగురుతున్న శిరోజాలు, ఆమె కట్టుకున్న సిల్కుచీర కొంగు కనిపించాయి.

సందేహం లేదు, ఆమె సుస్మిత!

భగవాన్, ఆమె బతికివుండాలి. ఆమెకేం కాకూడదు. అదే తను కోరుకునేది.

మరో పది నిమిషాల్లో అక్కడికి చేరుకున్నాడు సిద్ధార్థ. ఇప్పుడు సుస్మిత స్పష్టంగా కనిపిస్తోంది.

* * *

సుస్మితని చేర్తూనే ఆమె నాడి పట్టుకుని చూశాడు

సిద్ధార్థ.

బలహీనంగా కొట్టుకుంటోంది.

ముక్కు దగ్గర వేలుంచి చూశాడు.

ఊపిరాడుతోంది.

'థాంక్ గాడ్! ఈమె బతికే వుంది' అనుకుంటూ తేలిగ్గా నిట్టూర్చాడు సిద్ధార్థ.

రాత్రి ఇసకతుఫాన్‌కి ఆమె పారాషూట్ కూడా బాగా దెబ్బతిని ఇసకలో కూలిపోయిందన్నమాట! ఇసక కాబట్టి ప్రాణాలు పోకుండా తామిద్దరు బతికి బయట పడ్డారు అదే యే పర్వతానికో కొట్టుకుంటే తమ శరీరాలు ఛిన్నాభిన్నమైపోయి గాల్లోనే ప్రాణాలు పోయుండేవి.

సిద్ధార్థ ఆమెని తట్టిచూశాడు. అటు ఇటు కదిపాడు. కాని ఆమెకు స్పృహ రాలేదు. బహుశా బాగా షాకయి వుంటుందని గ్రహించాడు.

ఇప్పుడెలా? పోనీ యే నీటినో ముఖాన చల్లి సేద తీరుద్దామంటే అది నీటిచుక్క దొరకని ఎడారి.

ఎడారిలో కూడా నీటిచెలిమ లుంటాయని, వాటిని ఒయాసిస్ లంటారని అతడికి తెలుసు. కాని ఈ విపత్కర పరిస్థితిలో ఒయాసిస్ ఎక్కడుందో ఎలా కనిపెట్టేది? ఎండమావి కూడా ఒయాసిస్ అన్న భ్రాంతి కూడా కలిగిస్తూంది ఎడారిలో.

గత్యంతరం లేక ఆమెని ఒళ్ళోకి తీసుకుని "సుస్మితా" అంటూ ఆమె చెవిదగ్గర పదేపదే పిలుస్తూ ఆమెను జాగృదవస్థలోకి తీసుకురావటానికి శాయశక్తులా ప్రయత్నించాడు సిద్ధార్థ.

అతని ప్రయత్నం వృధాపోలేదు

సుస్మితలో కదలికలు మొదలయ్యాయి. భారంగా కళ్ళు తెరవబోయి అంతలోనే "అబ్బా" అనుకుంటూ మూసుకున్నది.

తనకలానే ఆమె కళ్ళలోకి కూడా ఇసక బాగా పోయివుంటుందని గ్రహించాడు సిద్ధార్థ. జేబునుంచి కర్చీఫ్ పైకితీశాడు. దాంతో ఆమె కళ్ళమీద మృదువుగా తుడిచాడు. కనుకొలకుల చివరకు చేరిన ఇసక రేణువుల్ని జాగ్రత్తగా తొలగించాడు.

"ఇప్పుడు కళ్ళు తెరు సుస్మితా!" అన్నాడు మృదువుగా సిద్ధార్థ.

సుస్మిత కళ్ళు మెల్లగా విప్పి అతన్ని చూసింది.

కొంతసేపటివరకు తనెక్కడున్నదీ ఆమెకు అర్థం కాలేదు.

తనో పరాయి ఆడదాన్ని ఒళ్ళోకి తీసుకున్నానన్న భావన సిద్ధార్థకిగాని, పరపురుషుడికి చాలా సన్నిహితంగా అతని గుండెలని తాకుతూ పడుకుని వున్నానన్న ఆలోచన ఆమెకిగాని లేవు.

ఆమెను రక్షించాలనే తపనలో ఆమెను చంటిపిల్లలా లాలిస్తున్నాడు సిద్ధార్థ. నిస్సహాయస్థితిలో అతని ఒళ్ళో స్వాంతన పొందుతోంది సుస్మిత.

"మీరు....మీరు....క్షేమంగానే వున్నారు కదూ! భగవంతుడు కరుణామయుడు" అన్నది సుస్మిత. అప్పటికి బాగా తేరుకున్నదామె.

"ఇది నువ్వు నిలిపిన ప్రాణం! నీ ఋణం యెలా తీర్చుకోను!" అన్నాడు సిద్ధార్థ.

సుస్మిత అప్పుడు గుర్తించింది—తను అతని ఒళ్ళో

పడుకుని వున్న సంగతి.

చటుక్కున లేచిపోయింది సిగ్గుతో.

“అహా, ఎందుకంత కంగారు? నెమ్మది..” అన్నాడు సిద్దార్థ.

సుస్మిత ముఖం ఎర్రగా కందిపోయింది. లేచి చీర సవరించుకున్నది.

ఇసుక అప్పటికే బాగా వేడెక్కిపోయి శరీరాల్ని కాల్చేస్తోంది వేడిగాడ్పులు మొదలయ్యాయి. పైన సూర్యుడు తన విశ్వరూపం చూపిస్తూన్నాడు.

“ఇంతకీ........మనం ఎడారిపాలయిపోయాం. ఇక్కడ్నుంచి బయటపడగలమా?” అన్నది పరిసరాలు పరిశీలనగా చూస్తూ సుస్మిత.

“నువ్వు....మీరు ...నామూలాన కోరి కష్టాలు కొని తెచ్చుకున్నారు....” తడబడుతూ అన్నాడు సిద్దార్థ. అంతవరకు ఏకవచనంలో సంబోధించినవాడల్లా, ఇప్పుడలా ఫ్రీగా మాట్లాడలేకపోతున్నాడు. అది గమనించింది సుస్మిత.

“మీరు నాకన్న అన్ని విషయాల్లోను పెద్దవారు. నన్ను చనువుగా ‘నువ్వ’ అనే పిలవండి. అదే నా కానందం” అన్నది సుస్మిత, అతని కళ్ళలోకి ధైర్యంగా చూడలేక పక్కకు చూస్తూ.

ఆమె ఎన్నాళ్ళు గానో కోరుకున్న ఏకాంతం ఇన్నాళ్ళకి దొరికింది. కాని సందర్భమే యెన్నడూ ఊహించనది, ఎవరూ కోరుకోనిది. అయినా ఆ మండు టెండ ఆమె శరీరాన్ని బాధించలేదు. నిప్పులా కాలుతున్న ఇసుక వేధించటంలేదు.

“మనం ఈ ఎడారినుంచి సురక్షితమైన ప్రదేశానికి

చేరటానికి ప్రయత్నించాలి. ఎడారిలోకూడా నీటి చెలమలుండే ప్రాంతంలో మనుషులు నివసిస్తూంటారు. అలాంటి జనావాసప్రాంతం చేరుకోగలిగితే ప్రాణాలు నిలబడతాయి. తర్వాత మన నాగరిక ప్రపంచంలోకి చేరుకోవటం పెద్ద కష్టం కాదు....'' అర్ధోక్తిలో నే ఆమె వంక భావయుక్తంగా చూశాడు సిద్ధార్థ.

''మీరిలా చెపితే అలా చెయ్యటానికి సిద్ధంగా వున్నాను. నా గురించి నాకెలాంటి చింతా లేదు. మీరు క్షేమంగా వుండటమే నాకు కావలసింది!'' అన్నది సుస్మిత స్థిరమైన గొంతుతో.

ఆమె కంఠంలో ధ్వనించిన ఆప్యాయతనురాగాలకి, ఆరాధనకి చలించిపోయాడు సిద్ధార్థ.

''చీకటి పడేలోపున యేదైనా సురక్షిత ప్రాంతానికి చేరుకోగలిగితే అదృష్టవంతులమే! పద, వెళ్దాం'' అన్నాడు సిద్ధార్థ.

* * *

ఇద్దరు ముందుకు అడుగులు వేస్తున్నారు.

ఇసకలో కూరుకుపోతున్న పాదాలని కష్టంమీద పైకి ఎత్తివేస్తూ మళ్ళీ ఇసకలో కూరుకుపోతూ, నిమిషానికో అడుగుచొప్పున వేసుకుంటూ కష్టంమీద ప్రయాణం సాగించారు.

సిద్ధార్థకి బూటుకాళ్ళలోకి ఇసక వెళ్ళిపోయి పాదం అడుగున కరుగ్గా తగుల్తోంది. బెల్టు షూ వేసుకున్న సుస్మిత పరిస్థితికూడా అందుకు భిన్నంగా లేదు.

ఇద్దరు ఆ మండుటెండలో గమ్యంలేని ఆ ఎడారిలో గమ్యంకోసం వెతుక్కుంటూ అలా సాగిపోతూనే వున్నారు.

సిద్ధార్థ సుస్మిత వైపు చూశాడు.

ఆమె నడవలేక పోతోంది. మామూలుగా గట్టిగా వుండే ప్రదేశంలో ఎన్ని మైళ్ళయినా సునాయాసంగా నడవవచ్చు — కాని కాళ్ళు కూరుకుపోయే ఇసకలో నడవటం సహనానికి పెద్ద పరీక్ష!

ఆ పరీక్షలో నెగ్గటానికి సర్వశక్తులు క్రోడీకరిస్తూ పళ్ళ బిగువున నడుస్తోంది సుస్మిత. చెమటతో ఆమె శరీరం తడిసిపోతూ, మళ్ళీ వేడిగాడ్పుకి ఆరిపోతోంది. నీరసంతో మధ్య మధ్య పొడారిపోయిన పెదాలని నాలుకతో తడుపుకుంటూ యమయాతననను భవిస్తోంది సుస్మిత.

ఆమెకు విపరీతమైన దాహం వేస్తున్నట్టు సిద్ధార్థ గమనించాడు — కాని, నీరేది?

ఎంత దాహం వేస్తున్నా ఆ విషయం పైకి చెప్పుకోనంతవరకు ఫరవాలేదు. కాని, చెప్పుకున్నాక. కనుచూపు మేరలో యెక్కడా నీరు దొరికే ఛాన్సెస్ లేవన్న నిజం తెలిశాక, ఇక ఆ దాహం రాక్షసిలా పెరిగిపోతుందేగాని, దాన్ని కంట్రోల్ చెయ్యటం ఎవరితరం కాదు.

ఆమె దృష్టిని దాహంమీదినుండి పక్కకి మళ్ళించటానికి హుషారుగా యేవో కబుర్లు చెప్తూ జోక్స్ కట్ చేస్తూ ఆమెని నవ్విస్తూ పరిస్థితిని తేలిక పరచటానికి ప్రయత్నిస్తున్నాడు సిద్ధార్థ.

అలాంటి పరిస్థితుల్లో మాట్లాడంవల్ల కూడా ఎంతో శక్తి వ్యర్థమయిపోతుందని అలా వ్యర్థమయిన శక్తి శరీరాన్ని మరింత నీరసపరుస్తుందని అతనికి తెలుసు. అంతేకాదు, వ్యర్థమయ్యే శక్తితోబాటు దాహం విప

రీతంగా పెరుగుతుంది.

అయినా సుస్మిత గురించి అతను వాటిని లెక్క చేయటంలేదు. కనీసం తినటానికయినా ఏదోకటి దొరుకుతుందేమోననే ఆశ కూడా లేదు.

అది అడవైనా ఏదోక ఫలమో, పుష్పమో దొరికుందేదేమో!

కాని, అది ఎడారి! నిర్జనమైన ఎడారి. ఎలాంటి చెట్లు, చేమలు మొలవటానికవకాశం లేని పాడి ప్రదేశం!

సాయంత్రం వరకు అలా ఇద్దరూ ఆ ఎడారిలో దిక్కు తోచకుండా తిరుగుతూనే వున్నారు.

“నేనిక నడవలేను సిద్ధార్థా! మీరు నా కోసం ఆగవద్దు. ముందుకు సాగిపోండి. ఏదయినా వాహనమో, మనుషులో కనిపిస్తే అప్పుడు వెనక్కి రండి. నేనిక్కడే ఎదురుచూస్తుంటాను” అన్నది సుస్మిత ఆ ఇసకలో కూలబడుతూ.

ఆమె పరిస్థితిని చూసి కంట నీరు తిరిగింది అతనికి. ఆమె గులాబీరంగు పెదాలు ఎండకు, దాహానికి మాడిపోయి పగుళ్ళు పడ్డాయప్పుడే. ఇదే పరిస్థితి మరి కాసేపు కొనసాగితే అవి పుళ్ళుగా మారటం ఖాయం. ఆ తర్వాత శరీరమంతా బొబ్బలెక్కిపోయి, చివరికి ప్రాణాన్ని....

ఇక ఆలోచించలేకపోయాడు అతడు. అతనికీ పరిస్థితి దుర్భరంగా, దుస్సహంగా ఉంది. తన ప్రాణదాతనా స్థితిలో చూడలేకపోతున్నాడు. కాని తనేం చెయ్యగలడు? ప్రాణం పోయేవరకు ఆమెకు తోడుండగలడు— ఈలోపల తన ప్రాణం పోకుండా వుంటే!

విషాదంగా నవ్వుకున్నాడు అతడు.

అప్పుడు సమయం సాయంత్రం అయిదు గంటలు కావస్తోంది. ఎండ తీవ్రత తగ్గినా గాడ్పులు వీస్తూనే వున్నాయి, ఉండి వుండి.

"ప్లీజ్, సుస్మితా, ఇక్కడ నిన్ను ఒంటరిగా వదిలి నేను వెళ్ళలేను. మనిద్దరం కలిసే వెళ్దాం. ఆధారం దొరికితే ఇద్దరం బతికి బయటపడదాం, లేదంటే కలిసే" తక్కిన మాటల్ని ఉచ్చరించలేదతని పెదాలు. తను పిరికివాడు కాకూడదు. ఆమె మానసిక పరిస్థితిని దిగ జార్చకూడదు.

ఆమె బలహీనంగా నవ్వింది.

"మీ గుండె నిబ్బరం ప్రశంసనీయం. మీ మాటలు వింటుంటే నాకు కొత్త ఉత్సాహం వస్తోంది. పదండి, ఈ శరీరంలో చివరి రక్తపుబొట్టు ఆవిరైపోయేవరకు మీతో కలిసి నడుస్తాను" ఆమె సర్వశక్తులు క్రోడీక రించి లేచి నిల్చుంది.

• • •

ఇద్దరు ముందుకు సాగారు.

ఎక్కడా నీటిచెలమగాని, మనుష్య సంచారంగాని కనిపించలేదు.

దాహంతో ఏ క్షణంలోనైనా ఇద్దరి ప్రాణంపోయేలా వున్నది.

సూర్యుడు అస్తమించాడు.

అంతవరకు మరిగిపోతున్న ఇసుక క్రమేణా చల్లబడటం మొదలయింది.

వాళ్ళిద్దరు వాతావరణంలో వచ్చిన ఆ మార్పును స్పష్టంగా గుర్తించారు.

అతడు ఆకాశంవైపు చూశాడు.

ఆకాశంలో చంద్రుడు చాలా ఆత్మీయంగా పలకరిస్తూ కనిపించాడు.

వెన్నెల వెలుగు ఇసక పర్రలమీద మనోజ్ఞంగా పరుచుకుంది.

ఆ వెన్నెల వెలుగులో సుస్మిత దృష్టి గుబురుగా పెరిగిన ఓ పొదమీద పడింది. దాని ఉపరితలంమీద ఎర్రగా మెరుస్తూ పళ్ళు కనిపించాయి. వాటిమీదినుంచి తియ్యాటి వాసన వస్తోంది.

సిద్ధార్థ కూడా ఆ పొదలను గుర్తించాడు.

ఎడారిలో అక్కడక్కడ గుబురు పొదలు ఖర్జూర చెట్లు, పొట్టి వృక్షాలు దర్శనమిస్తూంటాయి. కాని వాటిలో ఖర్జూర చెట్లు మాత్రమే మనిషికుపయోగపడే పళ్ళను కాస్తాయి.

ఈ గుబురు పొదలకున్న పళ్ళు తినటానికి ఉపయోగపడాయో, లేదో తెలియదు. కాని, వాటిని చూడటంతోనే ఇద్దరికీ ఆకలి, దాహం పరాకాష్ఠ నందుకున్నాయి.

ముందుగా సుస్మితే పళ్ళను తెంచి ముక్కు దగ్గర పెట్టుకుని వాసన చూసింది. తియ్యాటి వాసన వస్తోంది. చిదిపి చూస్తే దాన్నుంచి తేనెలా వున్న రసం స్రవిస్తూ కనిపించింది.

నోట్లో పెట్టుకోబోతుంటే సిద్ధార్థ వారించాడు.

"అవి మనకి హానికలిగించే పళ్ళయితే చేజేతులా కష్టాల్ని కొనితెచ్చుకోవటమే అవుతుంది. తొందరపడి వాటిని తినొద్దు" అన్నాడు.

సుస్మిత అతనివంక దీనంగా చూసింది.

"ఇవి తినకపోయినా ప్రాణంపోయేలా వుంది. దాహంతో నాలుక పిడచకట్టుకుపోయింది. ఈ రోజంతా ఆహారంలేక అవయవాలన్నీ స్తంభించిపోతున్నాయి. ఎలాగూ ప్రాణంపోక తప్పదు. ఇవి తిని దప్పిక, ఆకలి తీర్చుకుని చస్తేనే నయం కదూ!" అన్నది.

ఆమె చాలా సునాయాసంగా అనేయగలిగిందా మాటలు. కాని, సిద్ధార్థ గుండెల్లో పదునైన కత్తితో గాయపరిచినట్టు విపరీతమైన బాధ పుట్టించాయవి.

చిరునవ్వుతో అతని వంక చూస్తూ నిర్భయంగా ఆ పళ్ళను నోట పెట్టుకున్నది సుస్మిత.

సిద్ధార్థ ఆ వెనువెంటనే తనూ ఆ పళ్ళను తెంపి నోట పెట్టుకుంటుంటే, అతని చెయ్యి మృదువుగా పట్టి ఆపింది సుస్మిత.

ఆశ్చర్యంగా చూశాడామె వంక.

"కాస్సేపాగండి. నా ప్రాణం పోకుండా నిలిచి వుంటే ఈ పళ్ళు ప్రాణహాని కలిగించేవి కాదని నిర్ధారణయిపోతుంది కదా, అప్పుడు తిందురుగాని" అన్నది, మందహాసం చేస్తూ.

నివ్వెరపోయాడు సిద్ధార్థ. ఆమె ఆంతర్యం అర్థమయిపోయింది. 'ఈమెకు నా ప్రాణంపట్ల వున్న శ్రద్ధ, జాగ్రత్త — తన ప్రాణంపట్ల లేవా? ఇంత స్వార్థత్యాగమా?' అనుకున్నాడు.

ఆ మరుక్షణమే ఓ నిర్ణయానికొచ్చినట్టు ఆ పళ్ళను నోట్లో పెట్టుకున్నాడు సిద్ధార్థ.

తియ్యగా పుల్లగా తగిలింది రుచి. కాన్నిండా రసముంది. ఆరిపోయిన నోటికి ఆ ద్రవం అమృతోపమానంగా తోచింది.

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల ౫ వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహూమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి ౬ నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. ౬౦/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా, రెండేసి నెలలకు V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**

ఇద్దరు ఒకటొకటిగా ఆ పళ్ళను తృప్తిగా తిన్నారు. ఆకలి, దాహం రెండూ ఉపశమించాయి.

అప్పటికి వాళ్ళ ఆకలిబాధకి మల్లేనే ఇసకకూడా చల్లబడింది. చల్లటి గాలి వాళ్ళ శరీరాలకు సేదతీరుస్తూ వీస్తోంది. చలిగా వున్నట్టనిపించింది.

ఎంతలో ఎంత మార్పు!

వాతావరణంలోనే కాకుండా తమ శరీరాల్లోకూడా యేదో తెలియని మార్పు వచ్చినట్టనిపించింది వాళ్ళిద్దరికి.

రాను రాను ఆ మార్పు వాళ్ళని వివశత్వానికి గురి చేసింది.

సిద్దార్థ మెల్లగా ఆమెకు దగ్గరగా మరింత దగ్గరగా వచ్చాడు. సుస్మితకూడా మరో లోకంలో ఉన్న దానిలా అరమోడ్పు కళ్ళతో అతన్ని మరింత సన్నిహితంగా ఒరుసుకుంటూ నించుంది.

సిద్దార్థ తనలో యేదో విపరీతమైన మార్పు వచ్చినట్టు గుర్తించేలోపలనే అతని చేతులు ఆమె భుజాలచుట్టూ పెనవేసుకున్నాయి. ఆమెను బలంగా తనవైపు అదుముకున్నాయి.

సుస్మిత రెండు చేతుల్ని అతని నడుముకు గట్టిగా పెనవేసి అతని ముఖానికి తన ముఖాన్ని ఒత్తుతున్నది.

ఇద్దరి పెదాలు గాఢంగా పెనవేసుకున్నాయి. సిద్దార్థ ఆమె శరీరంమీద దుస్తులన్నీ ఒకటొకటిగా లాగేస్తున్నాడు.

ఆమె అతని చర్యల్ని వారించలేదు.

* * *

అర్ధరాత్రి సమయంలో అకస్మాత్తుగా మెలకువ వచ్చింది సిద్దార్థకు.

మబ్బులేని ఆకాశంలో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న చంద్రుడు కనిపించాడు ముందుగా. ఆ తర్వాత తనని పెనవేసుకుని గాఢంగా నిద్రపోతున్న సుస్మిత కనిపించింది.

జరిగిందంతా ఒక్కసారిగా గుర్తొచ్చింది.

వెన్నున ఎవరో ఛెళ్ళున కొరడాతో కొట్టినట్టు ఉలిక్కిపడ్డాడు సిద్ధార్థ.

తనేం చేశాడు? తన సంస్కారం, వివేకం అన్నీ ఏమైపోయాయి? తనలో యెన్నడు లేనిది ఇంత చిత్తచాంచల్యం ఎందుకేర్పడింది? అమానుషంగా, అన్యాయంగా ఆమె శీలాన్ని నాశనం చేసే అధికారం తనకేముంది?

ఏదో జరిగింది. లేకుంటే తనింత వివేకహీనుడిలా, పశువులా ప్రవర్తించి వుండేవాడు కాదు! ఎంతో అందమైన, అప్సరసల్ని తలదన్నే అమ్మాయిలు తనని కోరి వచ్చినా యెంతో నిగ్రహం చూపించాడు. వాళ్ళని సున్నితంగా తిరస్కరించాడు. తన మనసునిండా పవిత్రమైన ఆలోచనలు తప్ప మరో చెడు ఆలోచనకి తావివ్వకుండా హుందాగా, పరువుగా తలెత్తుకుని జీవించాడిన్నాళ్ళు.

కాని, ఇప్పుడు తలదించుకునే ఘోరమైన తప్పు చేశాడు. ఓ అమాయకురాల్ని చెరిచాడు. ఆమె కన్నె జీవితాన్ని నాశనం చేశాడు. ఆమె బంగారు భవిష్యత్తుని కాలరాచాడు.

అలవోకగా ఆమెను తన బంధనంనుంచి తప్పించాడు సిద్ధార్థ. ఆమె దుస్తుల్ని ఒంటిమీద నిండుగా కప్పాడు.

అతని మనసు పశ్చాత్తాపంతో దహించుకుపోతోంది.

తన పాపానికి నిష్కృతి ఏమిటి? నిర్జనమైన ఎడారిలో నిస్సహాయురాలైన ఓ ఆడపిల్లని అక్రమంగా అనుభవించిన తనకి శిక్షేమిటి?

ఒకటే.... అవును, అదొక్కటే సరైన శిక్ష. తను సృష్టించిన సమస్యకు పరిష్కారం అదే!

సరిగ్గా అప్పుడే చటుక్కున కళ్ళు తెరిచింది సుస్మిత.

ఎదురుగా వెన్నెల వెలుగులో సిద్ధార్థ! తనకెంతో సమీపంగా, తన ముఖంలోకే చూస్తూ కనిపించాడు.

జరిగిన విషయం ఒకటొకటిగా అంతా గుర్తొచ్చింది. ఆమె శరీరం బాధగా మూలిగింది. అది మామూలు బాధ కాదు, తియ్యటి బాధ.

ఎవరితోనైతే జీవితం పంచుకోవాలని కలలు కన్నదో అతనితోనే తన యవ్వనం పండించుకున్నది.

ఆమె కెంతో తృప్తిగా వున్నది!

కాని.... కాని.... అతనంత చొరవగా, అంత అకస్మాత్తుగా తనని కౌగిలిలోకి తీసుకుని తన కోరిక తీర్చటం విచిత్రంగా వుంది.

ఆ పళ్ళు తిన్న తర్వాతనే అతను వింతగా ప్రవర్తించాడు అంటే అతను తనపట్ల కావాలని చేసిన పని కాదది! ఆ పళ్ళవల్ల ప్రభావితుడై, అతని శరీరం అతని అదుపులో లేని సమయంలో తనతో హద్దుమీరాడు. నిజానికి తను అభ్యంతర పెట్టాల్సింది. కాని ఆ పళ్ళ ప్రభావం తన శరీరంమీద కూడా అదుపు తప్పించింది.

అయితే.... జరిగింది అతనికి గుర్తుందా? తన శరీరం జరిగినదానికి సాక్షీభూతంగా తాను పొందిన అనుభూతికి నిదర్శనంగా అతని నఖదంతక్షతాలతో నలిగిపోయి, అనాచ్ఛాదితమై నిల్చింది. (ఇంకా వుంది)

